# తెలుగులో తొలితరం పరిశోధకులు

## జాతీయసదస్సు పత్రాలు

సంపాదకుడు

పరిమి రామనరసింహం




తెలుగుశాఖ
హైదరాబాదు విశ్వవిద్యాలయం
నవంబరు 07-09, 2005

హైదరాబాదు విశ్వవిద్యాలయం

**తెలుగుశాఖ**

# తెలుగులో తొలితరం పరిశోధకులు

జాతీయసదస్సు

నవంబరు 07-09, 2005

స్థలం : హ్యుమానిటీస్ ఆడిటోరియమ్‌లో

సమారంభ సమావేశానికి

# ఆహ్వానం

07-11-2005 మధ్యాహ్నం 2.00 గం॥లకు

విశిష్ట అతిథి, సమారంభోపన్యాసం :

**ఆచార్య రవ్వా శ్రీహరి**

(ద్రావిడ విశ్వవిద్యాలయం పూర్వకులపతి)

ముఖ్యఅతిథి, కీలకోపన్యాసం :

**ఆచార్య జి.వి.సుబ్రహ్మణ్యం**

(పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం పూర్వకులపతి)

సదస్సు పత్రాల సంకలనం ఆవిష్కరణ :

**ఆచార్య సుధాకర్ మరాఠే**

(హైదరాబాదు విశ్వవిద్యాలయ మానవీయ విభాగాధిపతి)

సభాధ్యక్షులు :

**ఆచార్య ముదిగొండ వీరభద్రయ్య**

(హైదరాబాదు విశ్వవిద్యాలయ తెలుగుశాఖ పూర్వాధ్యక్షులు)

పరిమి రామనరసింహం

సదస్సు సంచాలకులు, తెలుగుశాఖ అధ్యక్షులు

# తెలుగులో తొలితరం పరిశోధకులు

## జాతీయసదస్సు పత్రాలు

సదస్సు సంచాలకులు

పరిమి రామనరసింహం




తెలుగుశాఖ

హైదరాబాదు విశ్వవిద్యాలయం

నవంబరు 07-09, 2005

# తెలుగులో తొలితరం పరిశోధకులు

# The First Generation Researchers in Telugu



సంపాదకుడు: పరిమి రామనరసింహం






నవంబరు 2005



తెలుగు శాఖ
హైదరాబాదు విశ్వవిద్యాలయం
హైదరాబాదు 500 046.

అంకితం:

తెలుగులో పరిశోధనకు దారులు పరచిన తొలి వెలుగులకు...

# కార్యక్రమం

## 07-11-2005 సోమవారం

### మొదటి సమావేశం మ॥ గం.4.00 - 5.30

### అధ్యక్షులు: ఆచార్య జి.వి.ఎస్.ఆర్.కృష్ణమూర్తి

డా॥ జి. అరుణకుమారి : రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ

డా॥ ఎన్. వెంకటరావు : నిడదవోలు వెంకటరావు

ఆచార్య కుసుమాబాయి : జయంతి రామయ్య పంతులు

డా॥ బాలశ్రీనివాసమూర్తి : ఆదిరాజు వీరభద్రరావు

హెచ్. గంగరాజు : కట్టమంచి రామలింగారెడ్డి

**సమావేశకర్త: డా॥ తుమ్మల రామకృష్ణ**

## 08-11-2005 మంగళవారం

### రెండవ సమావేశం ఉ॥ గం.9.30 - 11.00

### అధ్యక్షులు: ఆచార్య వేటూరి ఆనందమూర్తి

ఆచార్య చేకూరి రామారావు : గిడుగు రామ్మూర్తి

ఆచార్య త్రివిక్రమయ్య : తొలితరం భాషా పరిశోధకులు

డా॥ డి. విజయలక్ష్మి : జి.ఎన్. రెడ్డి

డా॥ పమ్మి పవన్ కుమార్ : గంటి జోగిసోమయాజి

పి. గోపాలకృష్ణ, ఆర్. భరత్, ఎన్. భిక్షపతి :
తొలితరం నిఘంటువులు

టి.సురేష్ : తెలుగు జానపదగేయాల పై - తొలి వెలుగులు

**సమావేశకర్త: డా॥ పిల్లలమర్రి రాములు**

**టీ విరామం ఉ॥ గం.11.00 - 11.15**

# కార్యక్రమం

## 08-11-2005 మంగళవారం

### మూడవ సమావేశం : ఉ॥ గం.11.15 - 12.45

**అధ్యక్షులు: ఆచార్య ఎల్. చక్రధరరావు**

ఆచార్య వేటూరి ఆనందమూర్తి : మానవల్లి రామకృష్ణకవి
ఆచార్య వై. బాలగంగాధరరావు : కుందుర్తి ఈశ్వరదత్తు
డా॥ ద్వా. నా. శాస్త్రి : మారేపల్లి రామచంద్రశాస్త్రి
ఆచార్య కిషన్‌రావు : మల్లంపల్లి సోమశేఖరశర్మ
ఆచార్య ఎస్. శరత్ జ్యోత్స్నారాణి : సురవరం ప్రతాపరెడ్డి
ఎ. రవీంద్రబాబు : చిలుకూరి వీరభద్రరావు

**సమావేశకర్త: డా॥ దార్ల వెంకటేశ్వరరావు**

భోజన విరామం మ॥ గం.12.45 - 2.00

### నాల్గవ సమావేశం మ॥ గం.2.00 - 3.30

**అధ్యక్షులు: ఆచార్య అమరేశం రాజేశ్వరశర్మ**

ఆచార్య బేతవోలు రామబ్రహ్మం : వజ్ఝుల చినసీతారామస్వామి శాస్త్రులు
ఆచార్య ఎల్. చక్రధరరావు : తొలితరం వ్యాకరణ పరిశోధకులు
ఆచార్య కోవెల సంపత్కుమార : తొలితరం ఛందశ్శాస్త్ర పరిశోధకులు
జి. ప్రకాశరావు : పాశ్చాత్య పరిశోధకులకు సహకరించిన దేశీయ పండితులు
రత్నప్రసాద్ : తెలుగులో తొలితరం పాశ్చాత్య పరిశోధకులు

**సమావేశకర్త: డా॥ డి.విజయలక్ష్మి**

టీ విరామం మ॥ గం.3.30 - 3.45

# కార్యక్రమం

## 08-11-2005 మంగళవారం

### ఐదవ సమావేశం : మ॥ గం.3.45 - 5.15

### అధ్యక్షులు: ఆచార్య వై.బాలగంగాధరరావు

ఆచార్య అమరేశం రాజేశ్వరశర్మ : ఖండవల్లి లక్ష్మీరంజనం
ఆచార్య జి.వి.ఎస్.ఆర్.కృష్ణమూర్తి : వేదం వేంకటరాయశాస్త్రి
డా॥ పిల్లలమర్రి రాములు : వేటూరి ప్రభాకరశాస్త్రి
డా॥ దార్ల వెంకటేశ్వరరావు : పింగళి లక్ష్మీకాంతం
జె. సుబ్బారావు : తొలితరం వ్యాఖ్యాతలు
జి. భక్తవత్సలం : వీరశైవ వాఙ్మయంపై తొలితరం పరిశోధకులు

### సమావేశకర్త: డా॥ పమ్మి పవన్ కుమార్

## 09-11-2005 బుధవారం

### ఆరవ సమావేశం : ఉ॥ గం.9.30 - 11.00

### అధ్యక్షులు: ఆచార్య జి.ఎస్.మోహన్

ఆచార్య సి. ఆనందారామం : తొలితరం నవలా పరిశోధకులు
డా॥ తుమ్మల రామకృష్ణ : తొలితరం కథా పరిశోధకులు
డా॥ యు.ఎ. నరసింహమూర్తి :
తొలితరం విజ్ఞానశాస్త్ర పరిశోధకులు
ఎమ్. సత్యనారాయణ : ప్రదర్శన కళలపై తొలితరం పరిశోధకులు
టి.ఎస్. గణేశ్ : కొక్కొండ వెంకటరత్నం పంతులు
మాణిక్యరావు : తొలితరం నాటక పరిశోధకులు

### సమావేశకర్త: డా॥ జి.అరుణకుమారి

టీ విరామం ఉ॥ గం.11.00 - 11.15

# కార్యక్రమం

09-11-2005 బుధవారం

ఏడవ సమావేశం ఉ॥ గం.11.15 - 12.45

అధ్యక్షులు: ఆచార్య ఎస్.వి.రామారావు

ఆచార్య ఎన్. ఎస్. రాజు : గిడుగు సీతాపతి

డా॥ పి. మధుసూదనరావు : కొమర్రాజు లక్ష్మణరావు

ఆచార్య జి.ఎస్.మోహన్ : చిలుకూరి నారాయణరావు

డా॥ పి. భాగ్యలక్ష్మి : కందుకూరి వీరేశలింగం పంతులు

జి. వెంకటరామయ్య : సాహిత్యచరిత్రపై తొలితరం పరిశోధకులు

ఎమ్. కృష్ణయ్య : పురాణ వాఙ్మయంపై తొలితరం పరిశోధకులు

సమావేశకర్త: ఆచార్య ఎస్.శరత్‌జ్యోత్స్నారాణి

భోజన విరామం మ॥ గం.12.45 - 2.00

ఎనిమిదవ సమావేశం : మ॥ గం.2.00 - 3.30

అధ్యక్షులు: ఆచార్య కోవెల సంపత్కుమారాచార్య

డా॥ పి.ఎస్.గోపాలకృష్ణ : తెలుగులో తొలితరం పరిశోధకులు (మద్రాసు కేంద్రంగా)

ఆచార్య ఎస్.వి.రామారావు : బండారు తమ్మయ్య

ఆచార్య పరిమి రామనరసింహం : కోరాడ రామకృష్ణయ్య

డా॥ బి. భుజంగరెడ్డి : సి. పి. బ్రౌన్

టి. కిరణ్ బాబు : గురజాడ అప్పారావు

ఇ. శిరీష, జి. రేవతి : తొలితరం పాత్రికేయులు

సమావేశకర్త: ఆచార్య ఎన్.ఎస్.రాజు

టీ విరామం మ॥ గం.3.30 - 3.45

## తొలితరం పరిశోధకులకు

## పూజా పత్రాల క్రమం .....

# ప్రస్తావన

భారతీయ భాషలన్నిటిలో వలెనే తెలుగులో కూడా పరిశోధన ఆధునిక ప్రక్రియ. పంధొమ్మిదో శతాబ్ది ఉత్తరార్ధం నించి ఇరవయ్యవ శతాబ్ది పూర్వార్ధం వరకు ఈ ప్రక్రియ చిగిర్చి పూత పూసి కాపు కాసి ఫలాలు అందించిన మొదటి పంట కాలంగా చెప్పుకోవచ్చు. ఈ కాలంలో జరిగిన పరిశోధనను ఒక వేదిక మీదినించి సమీక్షించుకోవాలనే సంకల్పంతో హైదరాబాదు విశ్వవిద్యాలయ తెలుగు శాఖ 'తెలుగులో తొలితరం పరిశోధకులు' అనే విషయంమీద 46 పరిశోధన పత్రాలతో ఈ జాతీయ సదస్సుకు రూపకల్పన చేసింది. అందులో అందిన పత్రాలు 37 కాగా కొన్ని సాంకేతిక కారణాల వల్ల ఇందులో చేర్చలేక పోయిన పత్రం ఒకటి పోను, 36 పత్రాలతో ఈ సంకలనం మీ ముందుకు వస్తున్నది. సదస్సు ప్రారంభానికి ముందుగానే పత్రాలను సిద్ధం చేసి సదస్సులో పాల్గొనే విద్వాంసులకు అందుబాటులోకి తీసుకువచ్చే సంప్రదాయాన్ని లోగడ ఆచార్య ముదిగొండ వీరభద్రయ్య గారి సంచాలకత్వంలో జరిగిన 'తెలుగు వ్యాకరణం – భాష' అనే జాతీయ సదస్సుతో మొదలైంది. దాని కొనసాగింపుగానే ఈ సంకలనం వెలువడుతున్నది.

ఈ సంకలనాన్ని తెలుగులో పరిశోధనకు దారులు పరచిన తొలి తరం పరిశోధకులకు అంకితంగా వెలువరిస్తున్నాం.

ఈ ప్రయత్నంలో పత్రసమర్పణకై ఆహ్వానించిన విద్వాంసు లందరూ తమ పత్రాలను పంపి సహకరించారు. వారందరికీ తెలుగు శాఖ పక్షాన కృతజ్ఞతలు తెలుపుతున్నాను. ఇందులో మరొక విశేషం: ఈ సదస్సులో సమర్పితం అవుతున్న పత్రాలలో మా తెలుగు శాఖ అధ్యాపకుల పత్రాలు కాక, మా శాఖలోని పిఎచ్.డి పరిశోధక విద్యార్థుల పత్రాలు 15, ఎమ్.ఫిల్. పరిశోధక విద్యార్థుల పత్రం ఒకటి కూడా ఉండటం.

దీన్ని ముద్రించటానికి టైప్‌సెట్టింగులో సహకరించిన మా తెలుగు శాఖ విద్యార్థులకు, ప్రాజెక్టులోని పరిశోధక సిబ్బందికి ప్రత్యేకంగా కృతజ్ఞతలు తెలుపుతున్నాను. ముఖ్యంగా వర్ధిష్ణువులు మా పిఎచ్.డి. విద్యార్థులు గంగరాజు, గోపాలకృష్ణ, భరత్, సురేశ్, శిరీష, రేవతి; ప్రాజెక్టు సిబ్బంది శ్యామ్ సుందర్, డా॥ భుజంగరెడ్డి; ఎమ్.ఫిల్. విద్యార్థులు ప్రజాపతి, కాంతికిరణ్, శ్రీనివాసరెడ్డి, శ్యామలాంబ, సరస్వతి, విజయకుమార్; ఎమ్.ఏ. మూడవ సెమిస్టర్‌లో కంప్యూటింగ్ తెలుగు కోర్సు విద్యార్థులు దుర్గారావు, అర్జున్, స్వరూపరాణి, విజయభాను, కొండారెడ్డి, రమాదేవి, ఇస్తేరురాణి – వీరందరూ వీరిలో ముఖ్యంగా శ్యామ్ సుందర్, గంగరాజు, గోపాలకృష్ణ, భరత్,

డా॥ భుజంగారెడ్డి ఎన్నో గంటలు శ్రమించి సహకరించారు. వీరి సహకారం లేకపోతే సమయానికి ఈ పుస్తకం కంప్యూటరీకరించటం సాధ్యం అయ్యేది కాదు. అందుకు వీరందరి సహకారాన్ని అభినందన పూర్వకంగా స్మరిస్తున్నాను.

సదస్సు రూపకల్పన మొదలుకొని పత్రాల ముద్రణకు, సదస్సు నిర్వహణకు సంబంధించిన అన్ని అంశాలలోనూ తెలుగు శాఖ అధ్యాపక బృందం ఎంతో సహకారాన్ని అందించారు. అందుకు వారికి, సదస్సు రూపకల్పన దశలో మాతోనే ఉండి, అప్పటి మా శాఖాధ్యక్షులైన ఆచార్య ముదిగొండ వీరభద్రయ్యగారికి కూడా కృతజ్ఞతలు తెలుపుతున్నాను.

ఈ సంకలనం ఈ విధంగా ముద్రణ రూపంలోకి రావటానికి మా తెలుగు శాఖలోని జె.ఆర్.ఎఫ్. పరిశోధక విద్యార్థులు ఆర్థిక సహాయాన్ని అందించారు. తెలుగులో పరిశోధన బాగా విస్తరించాలనే వారి ఆశంస ఇందుకు వారిని పురికొల్పింది. వారికి అభినందనలు.

- పరిమి రామనరసింహం

# తొలితరం పరిశోధకులు-పునర్వీక్షణం

–ముదిగొండ వీరభద్రయ్య

మనమెవ్వరమూ జన్మించకముందే తమ తమ పరిశోధనల చేత మన వైజ్ఞానిక సాంస్కృతిక వారసత్వాన్ని మనకు దర్శనం చేయించిన వారు మన తొలి తరం పరిశోధకులు. వారి పరిశోధన కృషి లేకపోతే మనం దేనికి వారసులమో, మన చరిత్ర పేరేమిటో, మన కావ్యాలేమిటో, వాటి కర్తలను గురించిన విశేషాలేమిటో మనకు తెలిసేదే కాదు. భాషా సాహిత్య, రాజకీయార్థిక, సాంఘిక, చారిత్రక, సాంస్కృతిక వారసత్వాన్ని ఇతమిత్థంగా తేల్చి చెప్పిన మహాపరిశోధకులు మన తొలితరం పరిశోధకులు కందుకూరి, మానవల్లి, వేటూరి, మల్లంపల్లి, కొమఱ్ఱాజు ల నుంచి నిడదవోలు, బండారు తమ్మయ్య గారల దాకా ఒక్కొక్కరిది ఒక్కొక్క సౌరకుటుంబమా అన్నంత దేదీప్యమయిన పరిశోధనా ఫలితమయిన జ్ఞాన భాస్కర తేజస్సు తెలుగు సంస్కృతీ క్షేత్రంపై ప్రసరించింది.

పరిశోధన చేసిన ఈ తొలితరం పరిశోధకులందరూ (ఇంచుమించుగా), సృజనాత్మక రచనలు చేసిన వాళ్ళే. చాలా మంది పద్యాలూ కావ్యాలూ రచించిన వాళ్ళే. 'కవిచూడామణి' వేటూరి ప్రభాకరశాస్త్రి గారి 'కపోత కథ' నిడదవోలు వెంకటరావుగారి 'మించుపల్లె' కావ్యాలు సాహిత్య చరిత్రలోనూ వాళ్ళను నిలిపినవి. వేదంవారినీ, కందుకూరి వారినీ ప్రత్యేకించి చెప్పాల్సిన అవసరమే లేదు. రచయితలుగా వారు పొందిన కీర్తి ప్రసిద్ధి అసదృశమైనది.

అన్నమయ్య వంటి వారి కీర్తన భాండాగారం నన్నెచోడుని కుమార సంభవం, పల్నాటి వీరచరిత్రము, క్రీడాభిరామము వంటి కావ్యాలు ఈ పరిశోధకుల కృషి కనుక లేకపోయి ఉంటే ఏమయి ఉండేవో ఊహించలేని విషయమే మీకాదు. ఏ రచన ఎవరిదయి ఉంటుందన్నది తేల్చడం సరిగ్గా జరుగనేపోయి ఉంటేసాహిత్య చరిత్రకు విలువేమి ఉంటుంది? 'అలిఖిత శిలాశాసనం' అన్న పేరుతో నిన్న మొన్న తిరుమల తిరుపతి దేవస్థానం, వారు ప్రచురించిన బృహద్గ్రంథంతో (ఆచార్య వేటూరి ఆనందమూర్తి గారు ఇతర విద్వాంసుల తోడ్పాటూ కలిసి లోకంలోకి వచ్చిన పరిశోధన గ్రంథం అన్నమయ్య కొన్ని రచనలకయినా స్వరరచన, వాటిని పాడుకొనే విధానముల తెలివిడి కలుగుతున్నది.

తొలితరం పరిశోధకులలో కనిపిస్తున్న విశేషమయిన లక్షణం వారందరూ మహావిద్వాంసులు కావడం. వారివారి విద్యాహంకారాలచేతా మాత్సర్యాలచేతా కొన్నిచర్చలూ రాద్ధాంతాలూ జరిగినప్పటికీ, వాటి వలన కూడా వాఙ్మయానికి జ్ఞానలాభం జరిగిందనడం నిర్వివాదాంశం.

శాసనాలూ, రాగి రేకులూ కవిల కట్టలూ ఇవీ వీరందరికీ ఆధారపరికరాలు. ధన కాంక్షలేని సత్యాన్వేషణా దృష్టి వీరికి చోదకశక్తి, వీరి కృషి వలన బౌద్ధం నుంచి వీర శైవం చరిత్ర పుటలలో మరుగు పడకుండా మన వారసత్వాన్ని నిలుపుతున్నాయి. ప్రాన్నయ్య యుగం నుంచి విజయనగర సామ్రాజ్యం వరకు ఇంకా ఆ తరువాత కూడా వీరి శాసన పరిశోధనలచేత మన రాజకీయార్థిక, సాంఘిక చరిత్రలు స్పష్టతను పొంది మన చరిత్ర పరిణామక్రమాన్ని అర్థం చేసుకోవడానికి పూర్తిగా తోడ్పడుతున్నాయి. ఇక కవుల చరిత్ర, సాహిత్య చరిత్ర ఆయితే మొత్తంగా అవి వీరి పరిశోధనా ఫలితమే. కొన్ని వాదాలకు ఈ చరిత్ర తోడ్పడి మన భాషాభివృద్ధికి ఎంతగానో తోడ్పడిందనటం నిర్వివాదాంశం. మన ప్రాచీన సాహిత్యాన్నంతా భాషాపరంగాకూడా పరిశోధించకనే పోయి ఉంటే గిడుగు వేంకట రామమూర్తి పంతులుగారు అట్లా ఏర్పడి ఉండే వారే కాదు. తనకు పోషణ ఇచ్చిన రాజుగారి వంశ చరిత్రలను పరిశోధించే పనినే కనుక చేసి ఉండకపోతే గురజాడ నుంచి అంతగొప్ప రచన వచ్చిండేదా -

తొలితరం పరిశోధకులైన మహానుభావుల పరిశోధనల వలన అటు సాహిత్యానికీ ఇటు భాషకీ ఉన్న పునాదులేమిటో మనకు స్పష్ట పడింది. కొమర్రాజు లక్ష్మణరావు, మల్లంపల్లి సోమశేఖరశర్మ, లక్ష్మీరంజనం గార్లు సంపాదించిన సంగ్రహ (విపుల) విజ్ఞాన సర్వస్వాలు అగ్రశ్రేణి పరిశోధకుల పరిశోధనలను గ్రథించి పెట్టినవి బి.ఎన్. శాస్త్రి గారి కృషీ, పరిశోధనలుకూడా ఈ సందర్భంలో జ్ఞప్తి చేసుకోవలసినవే.

వ్యాకరణ, భాషాశాస్త్ర పరిశోధనలు కూడా అత్యంత ఉన్నత స్థాయిలో జరిగి జ్ఞాన భాండాగారానికి వన్నె తెచ్చినవి.

తొలితరం తరువాత జరిగిన పరిశోధనలేవీ వన్నెతక్కువేమీ కావు. పరిశోధనలన్నీకూడా జ్ఞానాన్ని ఒక అడుగు ముందుకు తీసుకొని వెళ్ళేవే. విశ్వవిద్యాలయాల కృషి తక్కువేమీ కాదు. పరిశోధన పద్ధతులా ఆవగాహన నిజానికి వర్తమానంలో ఎక్కువయింది కూడా. సాహిత్య విమర్శ కూడా పరిశోధనలో భాగంగా గుర్తింపు పొందటం ఇప్పటి పరిణామం

వెన్నేటి రామచంద్రరావుగారు, కాశీభట్టబ్రహ్మయ్య గారలు తొలితరం విమర్శకులే ఆయినప్పటికీ సత్యాన్వేషణకు వారు పడిన తపన, వైదుష్యంతో కూడిన వారి పరిశీలనలు సాహిత్యక్షేత్రాన్ని సుసంపన్నం చేసినవి. వెన్నేటి రామచంద్రరావుగారు మను వసుచరిత్రలపైచేసిన విమర్శను ఖండిస్తున్న సందర్భంలో ప్రసక్తానుప్రసక్తంగా బ్రహ్మయ్య శాస్త్రిగారు 'విదూషకుడు' అన్న అంశం మీద చేసిన పరిశీలనలు నేటి పద్ధతిలో చెప్పాలంటే ఒక డాక్టరేటు ఇవ్వాల్సినంత గొప్పవి. ఇంకా మాట్లాడితే అవి అంతకన్నా గొప్పవనే చెప్పాలి.

పురాణం సూరి శాస్త్రి గారి విమర్శక పారిజాతం, అందులో ఈస్థటిక్స్ అన్న అధ్యాయం ఈ తొలితరం వారు ఎంత ముందున్నరో నిరూపిస్తుంది.కోరాడ రామకృష్ణయ్య గారు భాషపైనా సాహిత్య విమర్శ లోనూ ఎంతగా మార్గ దర్శనం చేయించారో చూస్తే మనకు ఆశ్చర్యం కలగక మానదు.

తొలితరాన్ని మన్నించటమే కాదు. మనం చేస్తున్నది ఆ తరంవారి కృషియే కనుక లేకపోతే మన అస్థిత్వమే సందేహాత్మకం అన్న స్పృహతో వారికి కృతజ్ఞతా పూర్వకంగా వారి కృషిని, వారి పరిశోధనా ఫలితాలను తలచుకోవడమే మనం ఇప్పుడు చేస్తున్నది. ఈ రోజున మనం చదువుకోగలుగుతున్న మన ప్రాచీన సాహిత్యాన్నంతా ఒక్కచేతిమీదగా పరిష్కరించి, పాఠ నిర్ణయం చేసినతొలితరం పరిశోధకులకు మనం ఏమిచ్చి ఋణం తీర్చుకోగలం? ఇవేళ మనం వెన్నెముఖను నిలబెట్టి ఇది మా పరిశోధక పత్రిక అని ఒక్క పేరయినా చెప్పుకోగలమా? ఆలాంటిది ఏ వ్యాపార దృష్టి లేకుండా, వ్యయ ప్రయాసల భయంకాని నష్టపోతున్నాం అన్న స్పృహకానీ లేకుండా ఆనాడు ఎన్నెన్ని పత్రికలు పరిశోధక వ్యాసాలకు ఆదరణ చూపి పరిశోధక పత్రికలన్న కీర్తి సంపాదించుకోగలిగాయి.

మన విశ్వవిద్యాలయం ఈ తొలితరం పరిశోధకుల కృషిని పరామర్శించే ఈ గోష్ఠిని ఏర్పరచి, పత్రాలను ప్రచురిస్తున్నందుకు ఎవరు సంతోషపడరు. ఈ గోష్ఠి పత్రాలను అచ్చు వేయడం ఈ తెలుగు శాఖకు ఇది మూడో సారి. శక్తికి మించిన పనే అయిన విద్వచ్ఛక్తికి కొరత లేదని ఈ పత్రాలన్నీ నిరూపించేవే.

# డా|| చిలుకూరి నారాయణరావు

- జి.ఎస్.మోహన్

వాఙ్మయతపస్వి, మహామనీషి, కళాప్రపూర్ణ డా|| చిలుకూరి నారాయణరావు గారు సెప్టెంబరు 10, 1890 లో అప్పటి విశాఖపట్నం జిల్లా, పొందూరు తాలుకా ఆనందపురం అగ్రహారంలో జన్మించారు. వీరి తండ్రిగారు శ్రీ చిలుకూరి భీమాచార్యులు గారు, తల్లి సన్నమ్మగారు. డా|| చిలుకూరివారికి తల్లిదండ్రులు పెట్టిన పేరు సూర్యనారాయణ. ఆయన సంవత్సరం పిల్లవాడుగా ఉన్నప్పుడు పెద్ద జబ్బుచేసి ప్రాణాపాయస్థితిలో ఉండడం, ఆయన మీద ఆశ వదులుకోవడం జరిగింది. ఏం చెయ్యాలో తోచక ఆ పసికందుని సూర్యుడి కెదురుగా ఒక అరిటాకు మీద పడుకోబెట్టి సూర్యనారాయణా! నువ్వేదిక్కని మొుక్కుకొన్నారట. ఏమి విచిత్రమోకానీ శ్రీ సూర్యనారాయణ స్వామి దయవల్ల ఆయన వెంటనే కోలుకోవడం, అప్పట్నుంచీ ఇంట్లో వాళ్ళందరూ ఆయన్ని సూర్యనారాయణ అని పిలవడం జరిగిందట.

డా|| చిలుకూరి వారికి 21-22 సంవత్సరాల వయస్సులో వివాహం జరిగింది. వీరి సతీమణి శ్రీమతి లక్ష్మీనరసమ్మగారు. వీరింటిపేరు ఢిల్లీవారు. వీరిది బరంపురం. ఈ దంపతులకు ముగ్గురు మగపిల్లలు, అయిదుగురు ఆడపిల్లలు. డా|| చిలుకూరి వారు పొట్టిగా, సన్నగా ఉండేవారు. ఒక కన్ను కొంచెం మెల్ల. సరళ, శాంత స్వభావులు. పట్టుదల గల వ్యక్తి. వీరిది ఆస్తిపాస్తులున్న కుటుంబంకాదు. తండ్రి శ్రీమంతుల ఇళ్ళల్లో దేవతార్చన చేసి కుటుంబాన్ని పోషించేవారు.

చిలుకూరి వారు ఆనందపురంలో తమ ప్రాథమిక విద్యని ముగించారు. తర్వాత శ్రీకాకుళం హైస్కూల్లో మెట్రిక్ చదివి ఫస్ట్‌క్లాసు తెచ్చుకున్నారు. బీదరికం ఆయన్ని ముందుకు చదివించలేకపోయింది. పై చదువులు చదవలేని పరిస్థితుల్లో తలవని తలంపుగా గిడుగువారి దృష్టి చిలుకూరి వారిమీద పడింది. ఆ కాలంలో గిడుగువారు పర్లాకిమిడిలో హిస్టరీ మాస్టారు. చిలుకూరి వారిని తమ ఇంట్లోనే ఉంచుకొని ఎఫ్.ఏ. చదివించారు. ఒకమారు గిడుగువారు క్లాసులో మిల్టన్ మహాకవి వ్రాసిన సానెట్ ''on my blindness'' ను చదివి 'ఎవరైనా అప్పజెప్పగలరా?' అని ప్రశ్నించారట. అప్పుడు నారాయణరావుగారు లేచి 'మరోసారి చదవండి, అప్పజెప్తాను' అన్నారట. పంతులుగారు మళ్ళీ ఓసారి చదవడం, రావుగారు అప్పగించడం జరిగిపోయింది. అప్పట్నుంచీ పంతులుగారికి ఎక్కడలేని వాత్సల్యం, విశ్వాసం కుదిరాయి. ఇలా చిలుకూరివారు గిడుగు రామమూర్తి పంతులుగారికి ప్రియశిష్యులయ్యారు. గిడుగువారు చిలుకూరి వారిని తమ పెద్దబ్బాయితో సమానంగా చూసుకొనేవారట. ఒకసారి గురువుగారు మందలిస్తే

చెప్పాచెయ్యకుండా చిలుకూరివారు కాశీకి పారిపోయారట. తర్వాత గిడుగువారే తెలుసుకుని శిష్యుణ్ణి పిలుచుకొనివచ్చారట. చిలుకూరి వారి తొలి అభివృద్ధికి తోడ్పడ్డ మహానుభావుడు స్వామిబాబుగారు. ఆయన నరసన్నపేటలో మోతుబరి ఆసామి. ఆ కాలంలో ఎఫ్.ఏ., సీట్ల కోసం పోటీ పరీక్షలు జరిగేవి. చిలుకూరివారు ఆ పోటీలో పాల్గొని ఉత్తీర్ణులై విద్యావేతనం సంపాదించుకొన్నారు. స్వామిబాబుగారు మూడు నెలలకు సరిపడేట్టుగా 38 రూపాయల్ని రావుగారికి చేతిలో వుంచారు.

డా॥ చిలుకూరివారు విజయనగరం మహారాజావారి కళాశాలలో వేదాంతాన్ని ముఖ్య విషయంగా తీసుకొని బి.ఏ., చేశారు. విద్యాబోధనకు అవసరమైన ఎల్.టి, డిగ్రీని కూడ సంపాదించుకొన్నారు. 1914లో మద్రాసు విశ్వవిద్యాలయంలో ఎం.ఏ., తెలుగు, కన్నడ డిగ్రీలు పొందారు.

డా॥ చిలుకూరివారు శ్రీకాకుళం హైస్కూల్లో అధ్యాపకుడుగా కొంతకాలం పనిచేశారు. ఆ సమయంలోనే ఆంధ్రోద్యమంలోనూ, ఆంధ్ర గ్రంథాలయోద్యమంలోనూ పాల్గొన్నారు. ఆ తర్వాత విశాఖపట్నం సి.బి.ఎం. హైస్కూల్లో మూడు సంవత్సరాల కాలం ఉపాధ్యాయుడుగా పనిచేశారు. ఉత్తర సర్కారుజిల్లాలో ఇంగ్లీషు బోధన శక్తిని ప్రచారం చెయ్యడం కోసం రెండేళ్ళకాలం స్కూళ్ళ ఇన్స్పెక్టరుగా పనిచేశారు. ఈ సందర్భంగా వీరు జర్మన్, అమెరికా సంయుక్త రాష్ట్రాల విద్యా విధానాలను గూర్చి తెలుగులో ప్రచారం చేశారు. ఆ తర్వాత నాలుగేళ్ళపాటు రాజమహేంద్రవరంలోని ప్రభుత్వ కళాశాలలో తెలుగు అధ్యాపకులుగా పనిచేసి 1927 జనవరిలో అనంతపురం ceded district college కి బదిలీ అయ్యారు. అప్పట్నుంచీ తాము అధ్యాపక వృత్తి నుండి నివృత్తులయ్యేదాకా అంటే సెప్టెంబరు 1945దాకా అనంతపురం కళాశాలలో పనిచేశారు. ఆ కళాశాలలో వీరు సంస్కృతాంధ్రకన్నడ భాషల్ని బోధించేవారు. తమ శేషజీవితాన్ని అనంతపురంలోని తమ 'ఆత్రేయాశ్రమం' లో గడిపారు.

డా॥ చిలుకూరివారు స్వయంకృషితో పైకి వచ్చిన మహానుభావుడు, భారతీయభాషలతోపాటు, ఆంగ్లం, జపానీస్ మొదలైన విదేశీభాషలను నేర్చుకొన్నారు. వీరు మాధ్వులు కావడంవల్ల ఇంట్లో కన్నడం మాట్లాడేవారు. ఆ కన్నడం తమ సాహిత్యాధ్యయనానికి సరిపోదని విజయనగరం కళాశాలలో ఆంగ్లభాషను బోధించిన శ్రీ సుబ్బరాయ భట్టుగారి దగ్గర క్షుణ్ణంగా కన్నడ భాషాసాహిత్యాలను అభ్యసించారు. ఆ కాలంలోనే సంస్కృత భాషమీద ఆసక్తిని చూపి అభ్యసించడం మొదలుపెట్టారు. (వీరికి సంస్కృత భాషమీద అధికారం ఉందనడానికి వీరు సంస్కృతంలోనే రచించిన ''విక్రమాశ్వత్థీయమ్'' నాటకం సాక్ష్యం). కురాన్ షరీఫ్‌ని తెలుగులో అనువదించడం

కోసం ఉర్దూ, అరబిక్ భాషల్ని అభ్యసించారు. చిలుకూరి వారికి తెలుగు వాఙ్మయంమీద అభిరుచి పుట్టించిన మహాపండితుడు అరసవిల్లి గ్రామనివాసి శ్రీ గోదా నరసయ్యగారు. గిడుగు రామమూర్తిగారి ముఖ్యశిష్యులుగా ఉంటూ చారిత్రక పరిశోధనలమీద ఎక్కువ మక్కువ చూపుతూ వచ్చారు. చిలుకూరి వారు తామ్ర శాసనాలను, శిలా శాసనాలను నకలు చేసుకుని పరిష్కరించడం, తాటాకు గ్రంథాలను సేకరించడం ఒక hobby చేసుకున్నారు.

డా॥ రావుగారు ఓపిక, పట్టుదల గలవ్యక్తి. రోజుకు 18 గంటలకుపైగా రచనా వ్యాసంగం చేసేవారు. ఒక కలం ఒక చిన్న ఏటవాలు మేజా, వ్రేలాడుతున్న దీపం - ఇవి ఆయన రచనలకి ఉపకరించిన వస్తువులు. ఓపిక తగ్గినప్పుడు ఒక కప్పు కాఫీ త్రాగి, చురుకుదనం పొంది మళ్ళీ వ్రాయడం మొదలుపెట్టేవారు. ఆయన వ్రాతలలో కొట్టివేతలు కన్పించేవికావు. ఏది వ్రాసినా ఒకేసారి వ్రాసేవారు. ఆయన దస్తూరి గొలుసుకట్టు, వ్రాత చాలా అందంగా ఉంటుంది. కన్ను మెల్ల కావడం చేత పుస్తకాలను చాల దగ్గరగా పెట్టుకొని చదివేవారు.

సర్వమతసారాన్ని క్షుణ్ణంగా పరిశీలించిన విద్వద్వరేణ్యులు చిలుకూరివారు. వైదిక, శైవ, జైన, బౌద్ధమత సిద్ధాంతాల గురించీ, కురాన్ షరీఫ్‌ని అనువదించి ఇస్లాం మత స్వరూపాన్నీ ఆంధ్రులకు అందించారు. మద్రాసు ప్రభుత్వానికి చెందిన హిందూ దేవాదాయ ధర్మాదాయ శాఖకు, అనంతపురం జిల్లా ఉరవకొండలోని లింగాయత మతానికి చెందిన నిరాబారి మఠం (దీన్నే గవిమఠం అంటారు) వారికీ వచ్చిన వ్యాజ్యం సందర్భంగా మతపరమైన విషయసేకరణ కోసం ప్రభుత్వం వేసిన విచారణ సంఘంలో 1939నుంచి దాదాపు అయిదు సంవత్సరాలపాటు సభ్యులుగా ఉన్నారు. డా॥ రావుగారు వీరశైవలింగాయత మతం హిందూమతంలో అంతర్భాగమే అనీ తమ సాక్ష్యాన్ని బలపరచుకోవడానికి 200 పుటల విషయసేకరణ గావించి కోర్టుకు సమర్పించారట. వీరి సాక్ష్యాధారాలను బట్టి న్యాయమూర్తి 1944లో కేసును కొట్టివేశారు.

డా॥ చిలుకూరి వారు న్యాయశాస్త్రంలో మంచి ప్రవేశం ఉన్నవారు. కోర్టుకేసుల్ని స్వయంగా వాదించేవారు. ఒకమారు ఆయన అనంతపురంలో తమ పొరుగింటాయనతో చిన్న పోట్లాటకు దిగి కోర్టుమెట్లెక్కారు. ఆ పొరుగింటాయన లాయరు. ఏమైతేనేం డా॥ రావుగారు న్యాయశాస్త్రానికి చెందిన గ్రంథాలను తిరగేసి తమకేసులో తామే వాదించుకుని లాయరు మీద కేసుగెలిచారు.

డా॥ చిలుకూరివారు తెలుగు భాషాసాహిత్యాలకు ఎనలేని సేవచేశారు. తెలుగులో మొట్టమొదటి పిహెచ్.డి. పట్టాన్ని పొంది 'పరిశోధక పితామహులు' గా

వాసికెక్కారు. 'పదునెకండవ శతాబ్దమునాటి భాష' అనే అంశం మీద ఆంగ్ల భాషలో సిద్ధాంతవ్యాసం వ్రాసి 1928లో మద్రాసు విశ్వవిద్యాలయంనుండి పిహెచ్.డి. పట్టం పొందారు.

డా॥ రావుగారికి తెలుగు భాషమీద ఉన్న మమకారం ఆయన్ని ఆంధ్రభాషా చరిత్రకారులుగా చేసింది. భాషాతత్త్వ పరిశోధనలో మొట్టమొదట కృషిచేసినవారు డా॥ రావుగారు. వీరి 'ఆంధ్ర భాషా చరిత్ర' సంపుటాలను (రెండు) 1937లో ఆంధ్ర విశ్వవిద్యాలయం వారు ప్రచురించారు. కాల్డ్వెల్ వాదాన్ని ఖండించడం కోసమే వీరు ఆంధ్ర భాషా చరిత్రని వ్రాశారు. వీరి భాషా చరిత్ర పరిశోధనకి, అవిరళమైన కృషికీ, పాండిత్య ప్రకర్షకీ ఇది గీటురాయి. ఇందులో వీరు ఆంధ్ర సంస్కృతాలకు జన్యజనక సంబంధం ఉందని నిరూపించడానికి ప్రయత్నించారు. ఈ సంపుటాలకు విపులమైన పీఠిక వ్రాశారు. ఆంధ్రభాష, ఆంధ్రానికి సంబంధించిన ఉపభాషలు, తెనుగు, తెలుగు పదాల వ్యుత్పత్తి విచారం, తెనుగుకు సంబంధించిన మాండలిక భాషలు ఇత్యాదుల్ని ఉపోద్ఘాతంలో చర్చించారు. ద్రావిడ భాషల్లో తెనుగుకీయదగ్గ స్థానం ఇత్యాదుల్ని క్షుణ్ణంగా వివరించారు. అలాగే సంస్కృత ప్రాకృతాలకు, తెలుగుకు ఉండే సంబంధం, సంస్కృత ధ్వనులకు, ప్రాకృత ధ్వనులకు ఉండే సంబంధం, తెనుగు ధాతువులకు, సంస్కృత ప్రాకృత ధాతువులకు ఉండే సంబంధం, ఆంధ్రలిపి, ఆంధ్రలిపి సంస్కారం, ఆంధ్ర ధ్వనులను గూర్చిన సుదీర్ఘచర్చ, సంస్కృత ప్రాకృత ద్రావిడ భాషల్లో సంధులు మొదలైన వాటినన్నింటినీ సోదాహరణంగా వివరించారు. గ్రంథం చివర మూడు అనుబంధాల్ని చేర్చారు. 'అనంతపురం జిల్లాలోని గ్రామనామధేయాలను గురించిన మీమాంస', 'తెనుగున నావిక పదజాలము' ఇత్యాది. తమ తర్వాత పిహెచ్.డి. చేయబోయే వాళ్ళకు కావలసినంత సామగ్రి చేకూర్చారు. మార్గదర్శకులైనారు. ఈ గ్రంథం భాషాతత్త్వ పరిశోధకులకు నేటికీ ఉపాధేయ గ్రంథంగా మిగిలి ఉండడం హర్షించదగ్గ విషయం. కాల్డ్వెల్ సిద్ధాంతాన్ని ఖండించి తెలుగు సంస్కృత జన్యమే అని నిరూపించ ప్రయత్నించి నందుకు ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ఆచార్య పదవిని సైతం పోగొట్టుకున్న దురదృష్టవంతులు డా॥ చిలుకూరివారు. ఇంటర్వ్యూలో ఒక బెంగాలీ expert డా॥ రావుగారి వాదనని అంగీకరించక చేసిన పని ఇది. అయినా ఆయన తమ వాదాన్ని వదులుకోలేదు. ఓపికతో తమవాదాన్ని పండితులకు విడమరచి చెప్పేవారు. అంగీకరించినా, అంగీకరించకపోయినా వాళ్ళతో మాత్రం సన్నిహితంగా వర్తించేవారు. ఎవరి అభిప్రాయాలు వారివనీ, అవి స్నేహానికి అడ్డురాకూడదనీ అభిప్రాయపడేవారు.

డి.లిట్. పట్టాకోసం 15-10-1937లో 'Dravidian Meters' అనే అంశం మీద సిద్ధాంత వ్యాసం వ్రాసి మద్రాసు విశ్వవిద్యాలయానికి సమర్పించారు.

ద్రావిడ ఛందస్సుల్ని సేకరించి, ద్రావిడ ఛందస్సులకు ఇతర భారతీయ భాషా ఛందస్సులకు మధ్య ఉన్న సంబంధాలను పరిశోధనాత్మకంగా పరిశీలించిన ప్రప్రథమ పరిశోధకులు డా॥ రావుగారు. పండితుల ఈర్ష్యాసూయలవల్ల డిగ్రీరాలేదని తెలుస్తుంది.

పరిశోధకులకు భావనాశక్తి, కవితాశక్తి చచ్చిపోతుందంటారు. అయితే నారాయణరావుగారిలో ఈ కవితాశక్తి, భావనాశక్తి బూజుపట్టలేదు. తమ పరిశోధనల్లో క్షణం తీరిక లేకపోయినా ఆశుకవితలు చెప్పారు, కవిత్వం వ్రాశారు, నాటికలు వ్రాశారు.

డా॥ రావుగారు ఆంధ్రులకు పరిశోధకులుగాను, పండితులుగాను మాత్రం తెలుసు. ఆయన మంచి కవులు కూడా. 1947లో బెనారసులో P.E.N. Club వాళ్ళు నిర్వహించిన ఒక కవితాగోష్ఠిలో ఆశువుగా, ఆవేశపూరితంగా ఒక గేయం పాడారు. ఈ ఆవేశం అందరికీ లభించదు. ఆ గేయంలోని కొంత భాగాన్నిక్కడ ఉదాహరిస్తాను. గేయం శీర్షిక : 'మహానటుని మయూరనృత్యము'

'ఈ సదా మహా శ్మశాన
వాసి కాశికా విభుండు
విశ్వనాథుఁ డిపుడిదేమో
యీ చిదంబర ప్రచండ
కాల మేఘరాశి జూచి
యానందం బంతకంత
కతిశయింపగా మయూర
నృత్యముతో మొదలించి
నందికేశ నాట్యరీతి
డుండినాథ లాస్య ఫణితి
మించి తాండవించుసేడ
దేమొ! రండు గణనాథులు
రండు యక్ష, రాక్షస, గం
ధర్వ, గరుడ, కిన్నర, కిం
పురుషులు, మరి భూతపతులు
ప్రేతములు, పిశాచంబులు
రండీ సంహార నాట్య
సుందర తరహస్త, పాద
శిరో, నయన భంగి మొద్కు
తాభినయము జూడరండు
కాళ్ళకు గజ్జెలు
కటిపై పులితోల్
హస్త, కంఠ, భుజ
మస్తక పూత్కృత్
స్సర్ప భూషణుడు
మహానటుడు
నాట్యమాడు ........
నృత్యమాడు ........
లాస్యమాడు ........
తాండవించు .......
ఓంకార శ్రుతితో నా
రాయణ రాయ రచిత
గీతమునకు నీ సహృదయ
సభ్యులెల్ల తాళగతుల
జతులతోడ మనోవీధి
తాముగూడ తాండవింప
......... ......... .........
......... ......... .........

డా॥ చిలుకూరి వారు అనంతపురంలో వేమన ఉపన్యాసాల తర్వాత ఒక మిత్రగోష్ఠిలో శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ గారిమీద చదివిన పద్యాలలో కొన్ని

రాళ్ళపల్లిలోన రాళ్ళెన్ని పుట్టెనో
రాళ్ళలోన వజ్జరాలు పుట్టె
వజ్జరాలలోన వలపెట్లు పుట్టెరా
కీర్తనీయ చరిత ! కృష్ణశర్మ !

కఱపె వేమయోగి, కర్ణాట సర్వజ్ఞ
మూర్తి కఱపె; ఎవరు ముందొ కాని
ఇరువురందు ( గలుగు నింపులు దెలిపితి
కీర్తనీయ చరిత ! కృష్ణశర్మ !

నేడు మనం అభ్యుదయ కవిత్వం, విప్లవ కవిత్వం, స్త్రీవాద కవిత్వం అనే పేర్లతో వ్రాస్తున్న కవిత్వానికి డా॥ చిలుకూరి వారు 1928 ప్రాంతంలోనే శ్రీకారం చుట్టారు. ఆ కవితల్లో కొన్ని

## తమాషాకాదు

తమాషాకాదావిడతో తంటా తెచ్చుకొనేవు సుమీ !
నీనుంచి విద్యలన్నీ నేర్చుకొన్న దావిడ
నీవు చేయలేని పనులెన్నో నెమ్మదిగా చేస్తుందావిడ
కలముతోనా కట్టెతోనా
పొలమువద్దనా, ప్రొయ్యివద్దనా
మగవాడా ! దేనితో, ఎక్కడమించి పోతావావిడను?
కవితలో నంటావా? ఆమెయే ఒక కవిత !
ఏలుబడిలోనా? దాసాను దాసుడా నీవేమేలగలవు?
మరి ఎందులో నీ ఘనత?
తుదకు పిల్లలనయినా కనగలవా?
లేకుంటే నోరు మూసుకో !

## నేను

ఎందుకోసం పుట్టినామో
ఎందుకోసం బ్రదుకుతామో
ఎందుకోసం చచ్చిపోతా
మెవరు చెప్తారోయ్ !
..... ...... .......
..... ...... .......
ఉన్నవారికి సున్నచుట్టి
బ్రతికి నోళ్ళను పస్తులుంచి
చచ్చి నోళ్ళకు శ్రాద్ధమెట్టే
చవటి పీనుగునోయ్ !

ఉన్నవాళ్ళకు ఒప్పు(జెప్పి
లేనివాళ్ళకు లేకజేసి
కడుపుకోసం గడ్డికరిచే
గడుసు పసరమనోయ్!
..... ...... ....... .......
..... ...... ....... .......

('పినాకినీ' - అనంతపురం)

డా॥ చిలుకూరి వారు రచించిన కథాగేయం 'ముసలమ్మపదం'. ఇది అనంతపుర మండలంలోని బుక్కరాయ సముద్రం చెరువుకు సంబంధించింది. ఇదొక విషాదంతగాథ. 1918లో మూడవ ముద్రణం పొందిన ఈ పదానికి డా॥ చిలుకూరి వారే ప్రకాశకులు. ఇది మాత్రాఛందస్సులో 'ముత్యాలసరము'లా నడిచి అటు శ్రోతల్ని, ఇటు గాయకుల్ని ఉర్రూతలూగిస్తుంది. ఇది శ్రీ గురజాడ అప్పారావుగారి 'పూర్ణమ్మ'ను పోలివుంది.

'అన్నల్లారా ! తమ్ముల్లారా !
అక్కల్లారా ! చెల్లెల్లారా !
తనయులగన్న తల్లుల్లారా !
విన్నారా మీరీ కథను' - అనే ఈ ప్రారంభ చరణాలు పూర్ణమ్మలోని

మేలిమి బంగరు మెలతల్లారా !
కలువల కన్నుల కన్నెల్లారా !
తల్లులగన్న పిల్లల్లారా !
విన్నారమ్మా ఈ కథను ! - అనే చరణాలను పోలి ఉన్నాయి.

ముసలమ్మ పదం ఒక విధంగా బుర్రకథాశైలిలో నడిచే లఘుకావ్యం. పండిత పామరులు పాడుకోవడానికి అనువైన శైలిలో రచింపబడింది. ముసలమ్మను వర్ణిస్తూ డా॥ రావుగారు

'నడకల అందము నుడువుల అందము
నవనవలాడే నగుమోమందము
ఏమందము తీరంతా అందము
ముద్దులగుమ్మా ముసలమ్మ' అని వర్ణించారు.

అత్తాకోడళ్ళ మధ్య జరిగిన సంవాదంలో డా॥ రావుగారు చక్కని నాటకీయతను, జీవుల పరస్పర బంధాన్ని చాలా రసవత్తరంగా చెప్పడం జరిగింది.

' ...... ....... ....... ...... ......
చావంటే అది - సాధారణమా?
ఒక్కరినొక్కరు - ఒక్కసారిగా
విడిపోవలసే - నా తల్లీ !'
విడిపోతే మరి - కలియగలేమా?
కలిసి ఉండినవి - విడిపోవద్దా?
కలిసి యెప్పుడును - గడుపగ గలమా?
విసుగోనేకద - ఓ యత్తా?
...... ....... ....... ...... ......
...... ....... ....... ...... ......'

' అమ్మా ! తనువులు - చీరలుకావే,
చీరలు పోతే - చీరలు వస్తవి
తనువులు పోతే - తనువులురావే
యిది తెలియదె నీ - కోతల్లీ !'

'చిన్నప్పటి నీ - చిటి దేహమ్ము
నేడున్నాదే నీ - కోయత్తా
నీదేహమ్మిటు - మారినగానీ
నీవు మారనే - లేదు గదా?'

- ఇలా అత్తాకోడళ్ళ సంవాదం ఈ కథనగేయంలో రక్తి కట్టిస్తుంది.

'తుక్కాంబ' అనే గేయకావ్యంలో కన్నడం, ఒరియా, సంస్కృతం ప్రయోగించారు.

డా॥ రావుగారు మంచి అనువాదకులు. పిఠాపురం యువరాజా వారు రచించిన 'చినుకుల చిందులు' అన్న కావ్యాన్ని వీరు 'The Dance of the Rain Drops' అన్న పేర్తో ఆంగ్లంలోనికి అనువదించారు. అల్గాగే త్యాగరాజ కీర్తనలని 'Songs of Tyagaraja' అన్న పేర్తో అనువదించి ప్రకటించారు. ఇది వారి అనువాద నైపుణ్యానికీ, ఆంగ్ల భాషాభిమానానికీ, త్యాగరాజు మీద వారికి ఉన్న గౌరవానికీ నిదర్శనం.

వీరేశలింగం పంతులుగారి తర్వాత చెప్పుకోదగ్గ పండితులు డా॥ చిలుకూరి నారాయణరావు గారు. గేయాలు, జీవిత చరిత్రలు, భాషా చరిత్రలు, వాఙ్మయ చరిత్రలు, పద్య కావ్యాలు మరెన్నింటినో చేపట్టి సమర్థవంతంగా నిర్వహించిన దిట్టలు. 35 సంవత్సరాలు నిరంతర కృషి చేసి 250 గ్రంథాలు రచించిన పరిశోధకాగ్రేసరులు. గిడుగు వారి అడుగు జాడల్లో నడచిన వ్యావహారిక భాషావాదులు. వ్యావహారిక భాషలో

చాలా నాటకాలు వ్రాశారు. అచ్చి, పెండ్లి, వాడే మొదలయిన నాటకాలు అనంతపురం కళాశాలలోనూ, మైసూరు మహారాజావారి కళాశాలలోనూ విజయవంతంగా ప్రదర్శింపబడ్డాయి. రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ గారు 'అచ్చి' నాటకానికి దర్శకత్వం కూడా వహించారు. మహారాష్ట్రలోని జాల్నాలో కూడ ఈ నాటకం ప్రదర్శించబడింది. అపరాధ పరిశోధన నాటక రచనకు ఆద్యులు డా|| చిలుకూరి నారాయణరావు గారంటారు. 'వాడే' అన్న నాటకం వీరి రచన. వీరి నాటక రచనా ఫక్కీని బట్టీ వీరికి 'ఆంధ్ర బెర్నార్డుషా' అన్న బిరుదు ఉంది. వ్యావహారిక భాషను నిరసిస్తున్న కాలంలో వ్యావహారిక భాషలోనే నాటకాలు వ్రాసి నలుగురి మెప్పు పొందడం ముదావహం. 'అచ్చి' లేదా 'కాపువలపు' నాటకంలో జానపదుల మాటల్లోనే చాల సొగసుగా సంసార సౌఖ్యాన్ని ముచ్చటించారు. 'అచ్చి సేరదీసిందంటే తీపి, కసిరిందంటే కారం, ఊరుకుంటే ఉప్పు, దూరం పోయిందంటే పుల్ల, చికాకు పడితే సేదు, అన్నీ కలుస్తేనే అచ్చి. నేకపోతే మొగం మొత్తి పోదూ?'. డా|| చిలుకూరి వారు 'కమ్యూనిజమ్' గురించీ, 'కమ్యూనలిజమ్' గురించి ఇచ్చిన నిర్వచనాలు చమత్కారంగా కన్పిస్తాయి. 'కమ్యూనిజమ్ అంటే అందరున్నూ కలిసి పంచుకొనేది కొన్ని కో ఆపరేటివ్ సొసైటీల డైరెక్టర్లవలె. కమ్యూనలిజమ్ అంటే అన్నీ ఒక్కడే కబళించేది పెద్దపెద్ద ప్లీడర్లవలె'. అచ్చి, పెండ్లి, వాడే నాటకాలు కాకుండా అశ్వత్థామ, అంబ అనే పౌరాణిక నాటకాలను కూడా వ్రాశారు. ఇందులో అశ్వత్థామ విషాదాంత నాటకం. అలాగే నందుడు, బొమ్మ పొత్తికలు మొదలైన నాటకాలను కూడా రచించారు. 'నాటకనాటకం లేదా బొర్రయ్యసెట్టి' అనే హాస్య నాటకాన్ని, 'తిమ్మరుసు' అనే చారిత్రక నాటకాన్ని కూడా రచించారు. వీరి నాటకాలలో సామాజిక స్పృహ తొంగి చూస్తుంది.

వీరి మరికొన్ని ముద్రిత గ్రంథాల్లో 'సంస్కృత లోకోక్తులు', 'An Introduction to Dravidian Philology' (1929) ముఖ్యమైనవి. అలాగే భారతీయ భాషల వాఙ్మయ చరిత్రలలో 'గుజరాతీ వాఙ్మయ చరిత్ర' ఒకటి. దీన్ని మున్షీ దంపతులకు అంకితమిచ్చారు. వీరి మరికొన్ని ముద్రిత గ్రంథాలు – పద్యకావ్యాల్లో ఉమర్ ఖయామ్ రుబాయితులు, తుక్షాంబ, విద్యావిధానాల్లో జర్మనీ దేశ విద్యావిధానం, The University Exercises in Translations, ప్రాచీన హైందవ ప్రజాస్వామిక ప్రభుత్వము, ఉపనిషత్తులు మొదలైనవి పేర్కొనదగ్గవి.

'అశోకుని ధర్మశాసనము' లను డా|| రావుగారు 1928లో ప్రచురించారు. ఇది 1930 ప్రాంతంలో మద్రాసు విశ్వవిద్యాలయంలో పాఠ్యపుస్తకంగా ఉండిన అమూల్యగ్రంథం. ఈ గ్రంథంలో డా|| చిలుకూరివారు కాత్సా, గిర్నారు, షాబాజు, మైసూరు మొదలయిన ప్రాంతాల్లో లభించిన 14 శిలా శాసనాలను మూల పాలీ

భాషతో సహా సంస్కృత తెలుగు అనువాదాలతో ప్రకటించారు. దీనికి చక్కటి ఉపోద్ఘాతాన్ని కూడా వ్రాశారు. అలాగే అనంతపురం జిల్లాలోని ఎర్రగుడిలో అశోకుడి శిలాశాసనాలు బయల్పడ్డాయి. చిలుకూరి వారు వాటిని చదివి వ్యాసాల రూపంలో పత్రికల్లో ప్రచురించారు.

చిలుకూరి వారు లక్ష సామెతల లక్ష్యసిద్ధులు ఎక్కడికి వెళ్ళినా సామెతలను సేకరించడం. మిత్రులకు ఉత్తరాలు వ్రాసి తెప్పించుకోవడం ఆయన నిత్య కృత్యాల్లో ఒకటిగా ఉండేది. ఆయన బహుభాషావేత్త. ఎనిమిది భాషల్లో ఆయన మంచి ప్రవేశం సముపార్జించుకున్నారు. జపాన్ భాష బాగావచ్చు. 'జపాన్ దేశ కవిత' అనే ఆయన కృతి ఇందుకు మంచి ఉదాహరణ. 'జర్మనీ దేశ విద్యావిధానం' గురించి మరో పుస్తకం వ్రాశారు.

వీరి అముద్రిత గ్రంథాల్లో ముఖ్యమైనవి కొన్ని

–పిడపర్తి సోమన విరచిత ప్రభులింగలీల, చిలుకూరి వారే సేకరించిన ఆంధ్ర దేశపు జానపద గీతాలు, బాలగేయాలు, వనస్పతి నిఘంటువు, జైన దర్శన తత్త్వము, ప్రయోగ రత్నాకరము (తెలుగు నిఘంటువు) మరాఠీ – తెలుగు కోశము, శూరసేనుడు (నాటకం), జర్మను భాషా స్వయంబోధిని, Dictionary of Scientific and Technical terms, కొన్ని చరిత్ర గ్రంథాలు, కవిజీవితాలు. ఇలా అనేక విషయాల మీద ఆయన పరిశోధనలు గావించి గ్రంథాలు రచించారు. శ్రీ సర్దేశాయి తిరుమల రావుగారన్నట్టు దాసు అంటే పురందరదాసు మాత్రమే (దాసరెందరే పురందరదాసరు) అలాగే తెలుగులో విమర్శకుడు, పండితుడు అంటే చిలుకూరి నారాయణరావుగారే (ఆంధ్రప్రభ) శ్రీ మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి గారన్నట్టు 'ఓరిమి – పరిశ్రమపేరిమి – ప్రతిభావ్యుత్పత్తుల నేరిమి కలిసి చిలుకూరి నారాయణరావు పేర వెలసినది'.

నాటి దత్తమండలాలకు 'రాయలసీమ' అని నామకరణం చెయ్యడంలో చిలుకూరి వారి హస్తం ఉంది. శ్రీ పప్పూరు రామాచార్యుల గారిచేత నంద్యాలలో జరిగిన ఆంధ్రమహాసభలో రాయలసీమ అన్న పేరును ప్రతిపాదింపజేసి తీర్మానాన్ని సభచేత ఆమోదింపబడేట్టు చేశారట.

అఖిలాంధ్ర, కర్ణాటక ప్రాంతాల్లోనూ, ఉత్తర భారతదేశంలోనూ పర్యటించి, అఖిల భారత మహాసభల్లోనూ పాల్గొని తెలుగు భాషా వైశిష్ట్యాన్ని ఉగ్గడించారు. అనేక సంస్థలకు వ్యవస్థాపకులుగా ఉన్నారు. రాజమహేంద్రవరంలో 'ఆంధ్ర దేశీయేతిహాస మండలి'కి అధ్యక్షులుగా ఉండి తాము సేకరించు కొన్న కొన్ని వందల గ్రంథాల్ని, శిలా తామ్రశాసనాల్ని ఆ మండలికే అర్పించారు. ఇట్టి ఉదార హృదయులు ఏ కొద్దిమందో

నవ్య సాహిత్య పరిషత్ వ్యవస్థాపకులై అధ్యక్షులుగా ఉండి చాలాకాలం దాన్ని నడిపించారు. రాయలసీమలోని శ్రీకృష్ణదేవరాయ విద్యాపీఠసంస్థను స్థాపించి, అధ్యక్షులుగా ఉండి రాయలసీమ అభివృద్ధికి ఎంతో కృషిచేశారు.

'ది రాయల్ ఏషియాటిక్ సొసైటీ', 'ది జర్మన్ ఓరియంటల్ సొసైటీ', 'ది అమెరికన్ ఓరియంటల్ సొసైటీ' లకు సభ్యులుగా ఉన్నారు. ఆంధ్ర, మైసూరు విశ్వవిద్యాలయాలకు 'ఛైర్మన్ బోర్డ్ ఆఫ్ స్టడీస్' గాను, ఆంధ్ర, మద్రాసు విశ్వవిద్యాలయాలకు 'ఛైర్మన్ బోర్డ్ ఆఫ్ ఎగ్జామినేషన్స్' గాను ఆ కాలంలోనే పనిచేశారు.

డా॥ రావుగారు ఆంధ్రదేశంలోని పెక్కుమంది కవుల్నీ, పండితుల్నీ ప్రోత్సాహించారు. పాల్కురికి సోమనాథుని పండితారాధ్య చరిత్రను పరిష్కరించి, దానికి విపులమైన పీఠికను రచించారు. సోమనాథుని దేశకాలాదుల్ని గురించి చర్చించారు 348పుటలు కల్గిన ఈ ఉపోద్ఘాతం ఎన్నో కొత్త విషయాల్ని అందించింది.

డా॥ నారాయణరావుగారి బహుముఖ ప్రజ్ఞను గుర్తించిన నాటి బ్రిటీష్ ప్రభుత్వం 1947వ సంవత్సరం జూన్ నెలలో 'మహామహోపాధ్యాయ' బిరుదునిచ్చింది. అయితే నాటి ఇండియా ప్రభుత్వం పరప్రభుత్వాలిచ్చే బిరుదాలను నిషేధించడంవల్ల డా॥ రావుగారు స్వీకరించలేదు. అదే సంవత్సరం నవంబరు మాసంలో కాశీ సంస్కృత విద్యాపీఠం వారు 'మహామహోపాధ్యాయ' బిరుదునిచ్చి గౌరవించారు. ఆంధ్ర విశ్వకళా పరిషత్తువారు 'కళాప్రపూర్ణ' బిరుదునిచ్చి ఘనంగా సన్మానించారు.

కళింగసీమలో పుట్టి, చాళుక్యసీమలో పెరిగి, రాయలసీమలో మనుగడ సాగించి, చివరికి క్యాన్సర్ వ్యాధితో సీమకాని సీమలో మద్రాస్ జనరల్ ఆసుపత్రిలో తమ 61వ ఏటనే అంటే 1951 జూన్ 22వ తేదీన తనువుచాలించారు. డా॥ చిలుకూరి వారి శతజయంతి ఉత్సవం 10-09-1990నాడు పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాదులో జరిగింది. అధ్యక్షులుగా డా॥ సి.నారాయణరెడ్డిగారు, ముఖ్యఅతిథిగా జస్టిస్ ఆవుల సాంబశివరావుగారు విచ్చేశారు. 'చిలుకూరి వారి జీవిత విశేషాలు' గురించి నేనూ, చిలుకూరి వారి సాహిత్య విశేషాలు గురించి ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావుగారు ప్రసంగించాం. అలాగే బెంగుళూరు విశ్వవిద్యాలయం తెలుగు విభాగంలో ఆచార్య తంగిరాల వారి అధ్యక్షతలో 11-10-1990లో శతజయంతి కార్యక్రమం జరిగింది. డా॥ హెచ్.ఎస్.బ్రహ్మానంద, డా॥ అవధానం నాగరాజారావు, నేనూ చిలుకూరి వారిని గురించి ప్రసంగించాం.

డా॥ చిలుకూరి నారాయణరావుగారు బ్రతికుండగా రావలసినంత గుర్తింపురాలేదు. సర్కారు ప్రాంతం వారు కనుక రాయలసీమ వాసులు చిన్న

చూపుచూడడం, రాయలసీమలో స్థిరపడ్డంవల్ల సర్కారు ప్రాంతంవాళ్ళు లెక్క చేయకపోవడం జరిగిందనిపిస్తుంది. డా॥ కట్టమంచి వారన్నట్టు 'In scholarly distinction and originality he occupies a first rank. Unfortunately, from a worldly point of view, he has not been the success he deserved to be, and that is due to the conditions of service and recognition in our country'. ఈ అభిప్రాయం అక్షరసత్యం. డా॥ చిలుకూరి వారిమీద డా॥ అవధానం నాగరాజారావుగారు ఎం.ఫిల్., పిహెచ్.డి., పరిశోధనలు జరపడం ప్రశంసనీయం.

డా॥ రావుగారు తమనుగురించి ఒకచోట ఇలా చెప్పుకున్నారు. 'నేను వాఙ్మయ తపస్విని, సారస్వతయాజిని, వాఙ్మయము ద్వారా దేశారాధనను, ఈశ్వరారాధనను సాగింప కృషిచేసినవాడను' అని వినయంగా విన్నవించుకొన్నారు. ఆయన తమ యావజ్జీవితాన్నీ భాషాసాహిత్య సంశోధన సముద్రంగా చేసికొన్న ఒక మహోన్నత వ్యక్తి. ఆయన ఒక 'Mobile Library', 'Mobile Encyclopaedia'.

ఇలాంటి మహామనీషిని, పరిశోధకాగ్రేసరుని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం గుర్తించి అనంతపురంలోని శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయంలో కానీ, పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయంలో కానీ చిలుకూరి నారాయణరావుగారి పేరుమీద ఒక పీఠాన్ని నెలకొల్పవలసిందిగా ఈ సందర్భంగా విన్నవించుకొంటున్నాను.

*****

తొలితరం భాషాపరిశోధకులు -

# మారేపల్లి రామచంద్రశాస్త్రి

- డా॥ ద్వా.నా.శాస్త్రి

''తెనుగు నుడులగుట్టు తెలిమి తెలుపు కతన
క్రొత్త నుడులు తెనుంగునన్ కూర్చు కతన
'తెనుఁగునలుప' నా తనరెడు పెను బిరుదును
చాలి తాల్చితి మా రామచంద్ర శాస్త్రి''

0.0. 'కవిగారు' గా పేరు పొందిన మారేపల్లి రామచంద్రశాస్త్రి 3-11-1874న కృష్ణా జిల్లాలో కనకవల్లి అగ్రహారంలో జన్మించారు. ఆ తర్వాత 1893లో విశాఖపట్నం వెళ్ళారు. అప్పటినుంచి తుదిశ్వాస విడిచేవరకు విశాఖపట్నమే కవిగారికి ఉనికి పట్టు అయింది. అన్ని రంగాలలో తలలో నాల్కగా ఉన్నారు. ఎన్ని సంస్థలు స్థాపించినా ''కవితా సమితి''కి శాశ్వత అధ్యక్షులుగా వుండి శ్రీశ్రీ, పురిపండా, ఆరుద్ర..... వంటి వారికి మార్గ దర్శకులయ్యారు. 09-09-1951న పరమపదించారు.

1.0. మారేపల్లివారు బహుభాషావేత్త. ఆంగ్లం, సంస్కృత భాషలలోనే కాకుండా ద్రావిడ భాషలలో కూడా తగినంత ప్రావీణ్యం సంపాదించారు. గిడుగు రామమూర్తిగారితో బాగా పరిచయముంది. ఉత్తర ప్రత్యుత్తరాలు జరిగేవి. గిడుగువారు మరణించినపుడు 14-01-1940న విశాఖపట్నంలో కవితా సమితి తరపున ''వగపు కొలువు'' నిర్వహించిన కవిగారు గిడుగువారికి ''వగపు మెప్పు కానుక''గా 14 పద్యాలు సమర్పించారు. ఒక పద్యం -

''తెనుగు తల్లిని కొలిచెడి తెన్నులందు
మనకు తేడా కలిగియును మనమిరువుర
మొండొరులమెంతో కూర్మితో ఉండినార
మహహ !. ఎన్నేండ్ల నుండియో ఆర్యవర్య''

ఒకసారి తెలుగు పండితుడు పాఠం చెప్తూ ''తెలుగు ముక్కలకు వ్యుత్పత్తి ఏమిటి? వికృతులే'' అని చులకనగా మాట్లాడారు. అది కవిగారిని కలచివేసింది. అది ''వెఱ్ఱిమాట''గా భావించి అప్పటి నుంచి ''తెలుగు తల్లిని గద్దె ఎక్కించుట ఎట్లు'' అన్నదే జీవిత ధ్యేయం అయింది. అదే తపన, వేదన !

1.1. కవిగారు భాషారంగంలో తొలితరం పరిశోధకులే కాదు - మార్గదర్శకులు కూడా. ఆ రోజుల్లో కవిగారు చేసిన భాషా సంబంధమైన రచనలు మరొకరు

తెలుగులో తొలితరం పరిశోధకులు-జాతీయసదస్సు,
తెలుగుశాఖ, హైదరాబాదు విశ్వవిద్యాలయం-నవంబరు 7-9,2005

చేయలేదనటం అత్యుక్తి కాదు. అయితే రెండు మూడు తప్ప మిగిలినవన్నీ అముద్రితాలుగా ఉండటంవల్ల వీరి భాషా కృషి సమకాలికులకి తప్ప మరొకరికి అంతగా తెలియదు.

"మన కవిగారి వలె స్వార్థము త్యజించి పరార్థము సాధించేవారు అరుదు. వారిని నేను బాగా ఎరుగుదును" - గిడుగు వేంకటరామమూర్తి పంతులు

"కీ.శే. మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు ఆంధ్ర భాషను ప్రేమించి సేవించిన వారిలో అగ్రేసరులు. తెలుగు భాషకు సరియైన సమగ్రమైన ధాతు రూపములతో కూడిన నిఘంటువు లేదని శ్రీశాస్త్రిగారికి బాధ ఆజన్మాంతముండినదే"

- సురవరము ప్రతాపరెడ్డి

"చిన్నయసూరి గారి సూత్రములచే మహా బంధన కష్టముననుభవించు చుండిన యాంధ్రభారతికి కావలసినంత స్వేచ్ఛ నిచ్చుటకై మొట్టమొదట ప్రయత్నించిన యభినవాంధ్ర కవితాపితామహాదుల మార్గముకన్న విశిష్టతర మార్గదర్శులు మీరు".

- మండపాక పార్వతీశ్వరశాస్త్రి

"కవిగారు సంస్కరణవాది. నేను "త్వమేవాహం" రాసే రోజుల్లో కవిగారిని కలిసి concrete, abstract పదాలకు తెలుగు పదాలు అడిగితే ఆయన రూపరి, రూపిడి అని చెప్పారు. ఆధునికులకు భాషాపరంగా ఈయన అవసరం ఉండేది".

- ఆరుద్ర

1.2. కవిగారి భాషా రచనలను తెలుసుకుందాం.

1.2.1. ముద్రిత గ్రంథాలు :

1. తెనుగు - తోబుట్టువులు (1935)
2. తెనుగు నుడిదండలు (1953)
   (నిఘంటువులపై పరిచయ గ్రంథం)
3. నన్నయ్యనుడులు (1967)

1.2.2. ముద్రిత వ్యాసాలు :

1. నుడికడలి - మచ్చునుడులు (1945)
2. తెనుగువారి చదువు (అయ్యంకి షష్టిపూర్తి సంచిక)
3. తెనుగు-పరిపూర్ణ పాండిత్యము (కవితా సమితి ప్రత్యేక సంచిక 'వైశాఖి')
4. పలుకు మనుగడ (గ్రంథాలయ సర్వస్వం సంచిక)
5. మన పలుకు తల్లిని గద్దె యెక్కించుట - ఎట్లు?
   (త్రిలింగ రజతోత్సవ సంచిక - 1941)

1.2.3. అముద్రితాలు - లభ్యములు :
1. సామెతలకడలి
2. నుడికడలి (అసంపూర్ణం)
3. మొల్ల రామాయణపు నుడులు (అసం)
4. వ్రాలదండ ముచ్చటల చదువు

1.2.4. అముద్రితాలు - అలభ్యములు :
1. తెలుగు వ్యాకరణం
2. నాటినుడులు
3. విద్యార్థి నిఘంటువు (అసం)
4. సంస్కృతపు సరులు
5. హిందీ భాషా పరిశీలన
6. మన వార్తా పత్రికలలోని భాష

వీటిలో ముఖ్యమైన వాటిని, లభ్యమైన వాటిలో కొన్నిటి గురించి పరిశీలిద్దాం.

2. తెనుగు - తోబుట్టువులు :

మొదటగా కవితా సమితి ద్వితీయ వార్షిక సంచిక 'వైశాఖి'లో ఈ వ్యాసం నలభై పుటలలో ముద్రించబడింది (1932లో), ఆ తర్వాత కవితా సమితి ప్రచురణగా పుస్తకరూపంలో వెలువడింది. ఇందులో భాషలు-భాషా చరిత్ర - భాషా భేదములు - ఉపభాషలు - ప్రమాణ భాషలు - భాషల మార్పు - భాషా కుటుంబములు - తెన్వంగడము - తెన్వంగడపు చిన్నెలు మొదలైన ఉపశీర్షికలతో సవివరంగా రాయబడిన బృహద్వ్యాసమిది. కవిగారి అభిప్రాయం చూడండి -

'' ఇరువదవ శతాబ్ది యందే కొన్ని ద్రావిడ భాషలు ఉత్తర దేశ భాషలుగా ఉన్నప్పుడు శతాబ్దాల లెక్కరాని నాటికి మది చూపుమరల్చి పరికించుచో అప్పటి స్థితి ఎట్లుండునో! ఉత్తర దేశమంతయు ద్రావిడులయునికిపట్టే! భరత ఖండమంతయు తొలుత ద్రావిడదేశమే; ద్రావిడ భాషయే అపుడు భరతఖండభాష అని తోచును. ఆర్య భాషలగు ప్రాకృతముల లోని దేశ్యములు ఏ భాషలోనివి? అవి ద్రావిడ పదములనియే చెప్పవలయును గాని మఱొక తెఱంగున చెప్పవీలగునా?''

ఈ వ్యాసంలో ''ఇప్పటికి తెనుగునకు పదుమూడు తోబుట్టుబాసలున్నట్లు తెలిసినది. చిన్నయ సూరిగారు సైతము తెనుగు తోబుట్టువులలో ముఖ్యములగు భాషల పేరైనను మచ్చునకైనను ఎత్తకుండుట వింతలలో వింత.'' బ్రాహూయీతో కలిపి పద్నాలుగు భాషలుగా పేర్కొని గ్రియర్‌సన్ కూర్చిన వంశవృక్షాన్ని ఉదాహరించారు. ఈ భాషల వ్యవహర్తలు, వ్యవహార ప్రదేశాలు, భాషా విశేషాలు ప్రత్యేకంగా వివరించారు.

ఆంధ్రము, తెలుగు, తెనుగు పదాల పుట్టు పూర్వోత్తరాలను తెలుపుతూ కవిగారు ఆచంట వేంకట సాంఖ్యాయన శర్మగారు తణుకులో ఆంధ్ర సాహిత్య పరిషత్ అధ్యక్షోపన్యాసంలో ''తెలుగునుడి దేశ్యమే కాని త్రిలింగ శబ్దభవము కాదనియు అందలి తొలినుడి తెల, తెలి మొదలగు నుడులలో ఒకటి కాదగు'' నని చెప్పారని సమర్థించారు. కవిగారు కొత్తగా తెలుగుకి ఇచ్చిన వ్యుత్పత్తి ఇది -

1) తెల + ఉన్ + ఒంగ్ → తెలుంగ్ → తెలుగు; తెల్లగా ఉండువారి భాష, తేటగా ఉండు నుడుల భాష

2) తెన్ + ఉన్ + ఒంగ్ + ఉ → తెనుంగు → తెనుగు; తెన్నున ఉండువారు తెన్ను అనగా దారి, తెనుగునాడే ఆర్యుల దక్షిణాపథం

ఆంధ్రులు మొదట ఆర్యులనీ, తెలుగునాటి తొలిభాష తెనుగేకాని ఆంధ్రము కాదనీ వక్కాణించారు. దీనికి అనుగుణంగా కొన్ని ఉపపత్తులు చూపించారు.

3. నుడికడలి

ఆంధ్ర సాహిత్య పరిషత్తు వారి సూర్యరాయాంధ్ర నిఘంటువు మచ్చు పదాల పీఠిక వెలువడగానే కవిగారు చదివారు. అందులో - ''సాధన సామగ్రి చాలమించేసి'' తెలుగు పదాల ఉత్పత్తి, వ్యుత్పత్తులుగా రాయటం విరమించినట్లు ప్రకటించబడింది. దీనికి కవిగారు నొచ్చుకొన్నారు. అప్పటినుంచి తెలుగుభాషా కృషిని దీక్షగా చేపట్టారు. ''తెలుగు పుట్టువును వెలిపెట్ట గల నిఘంటువును రచియింప తలపెట్టారు''. ఈ నిఘంటువు పేరు ''నుడికడలి''. ఎలమంచిలిలో ''తెనుగుగుడి'' కార్యాలయాన్ని ప్రారంభించి విజయవాడలో ఉపకార్యాలయం స్థాపించారు. పురిపండా అప్పలస్వామి, జయంతి సుబ్బారావు అనే శిష్యుల తోడ్పాటు తీసుకొన్నారు. 1945 - అక్టోబర్‌లో ''నుడికడలి - ప్రమాణాంధ్ర నిఘంటువు - మచ్చునుడులు'' అనే కరపత్రాన్ని ఆరుపుటల్లో ముద్రించారు. గిడుగు, వేటూరి, పంచాగ్నుల, తల్లావజ్ఝల వంటి వారందరికీ పంపి సూచనలు, సహకారం కోరారు.

కవిగారికి అచ్చ తెలుగు పదాలపై మక్కువ ఎక్కువ. ఈ నిఘంటువులో వాడిన సంకేతాలను ''గుర్తుతెలివిడి'' అంటూ ఇలా వివరించారు.

| | | |
|---|---|---|
| క్రొ.ను. | - | క్రొత్తనుడి |
| చే | - | చేర్పు (ప్రత్యయం) |
| పే | - | పేరునుడి (నామవాచకం) |
| స | - | సరినుడి (తత్సమం) |
| మా | - | మార్పునుడి (తద్భవం) |
| గు | - | గుట్టు తెలిమి (వ్యుత్పత్తి) |

ఈ నిఘంటువులో కవిగారు ప్రతిపదానికి నాటినుడి, పేరునుడి, గుట్టు తెలిమి ........ ఇలా ఇచ్చుకుంటూవెళ్ళి ''★'' నక్షత్రం గుర్తు గల నుడులు సూర్యరాయాంధ్ర నిఘంటువులో లేనివి - అన్నారు.

ఉదాహరణలు :

అలమేలుమంగ : నా. పే. వెంకటేశ్వరుని భార్య
గు. అలరు మేలుమంగ. త - అలర్మేళ్‌మంగై - (తామర)
పూవుమీద ఉండునది. మా.రు. - అలమ్మేలంగ

అనాస : పోర్చు. మా.పే. అనాసమొక్క , అనాసపండు (Pine Apple)
దీని పుట్టు బోట్లు మెక్సికో, పనామా. కొండల మీద పెరుగును.
దీని రసము ఆయుస్సు పెంచునందురు.

కురులు : నా. పే. గు. క - త - కురుళ్, చురుళ్ = చుట్టుకొను,
చుట్టుకొనునవి కావున కురులు.

వ్యుత్పత్తులు చెప్పిన వారి పేర్లను బ్రాకెట్లలో తెలిపి కృతజ్ఞతలు ప్రకటించారు. అన్య దేశ్యాలను కూడా పేర్కొన్నారు. ''బస్తా'' అనేది పారసీ పదం నుంచి వచ్చిందని కవిగారన్నారు - పురిపండా ఇది బెంగాలీ పదమని చెప్పారు. అయితే ఈ నిఘంటువు అచ్చుకాక పోవడం మన దురదృష్టం.

4. కవిగారి వ్యాసాలు చాలా దీర్ఘమైనవి. కొద్ది అసంపూర్ణాలు. మరికొన్ని అముద్రితాలు. చిన్న చిన్న అక్షరాలతో కాగితం ముక్కలపై రాయబడినవే. ''నన్నయ్య నుడులు'' అచ్చయినా నాకు లభ్యం కాలేదు. మొల్ల రామాయణం నుడులు - కాగితాల మీద శిథిలావస్థలో వుంది. ''పద ప్రయోగ కోశాలు'' రూపొందించటంలో కూడా కవిగారే ఆద్యులనాలి.

4.1. వావిళ్ళ వేంకటేశ్వర శాస్త్రి సమ్మాన సంచిక - త్రిలింగరజతోత్సవ ప్రత్యేక సంచికలో కవిగారు ''మన పలుకుతల్లిని గద్దె యెక్కించుట ఎట్లు'' అనే వ్యాసం రాశారు. ఇందులో స్వరాజ్యం రావచ్చు గానీ - దానికంటే పండగ మన తెలుగుకి వైభవం రావటమే అన్నారు. ''మన తెనుగువారు - ఆయా జిల్లాలలో పట్టణములలో ఉన్నవారైనను, పల్లెలలో ఉన్నవారైనను ఊరి దొర తనపు వెరవుతో నాటి తల్లితో పాటు మన పలుకు తల్లిని కూడ గద్దె యెక్కించెదరుగాక'' అనడం కవిగారికి వాడుక భాషపై గల మక్కువకి నిదర్శనం.

''పలుకుకొలువు'' (భాషాసేవ) అనే వ్యాసంలో 1914లో కాకినాడలో ఆంధ్రపరిషత్ సభకి వెళ్ళినప్పుడు అప్పటి భాషా వివాదాలను పరిశీలించిన కవిగారు ఇలా ప్రకటించారు - ''ఇట్టి వివాదములతో కాలయాపన చేయుట కంటే రెండు

వర్గముల వారును పూన్కితో తెనుగు తల్లిని కొలుచుట మంచిది. కొన్ని పట్టులందు గ్రాంథికవాదులు వాడుక నుడులు వాడక తప్పదుగాన దానిని ఏవగించుటకూడదు. వ్యావహారిక భాషావాదులు కొన్నియెడల గ్రాంథిక రూపములు వాడవలసివచ్చును గాన గ్రాంథిక భాష అసలే పనికిరాదని నిరసింపరాదు''.

4.2. కవిగారి అముద్రితవ్యాసాలూ, అసంపూర్ణ వ్యాసాలూ పురిపండా గారివద్ద లభ్యమైనాయి. అరవై సంవత్సరాల క్రితమే కవిగారు ''మన వార్తా పత్రికలలోని భాష'' అనే వ్యాసం రాశారంటే ఎంత ముందుచూపు కలవారో అర్థమవుతుంది. ఈ అముద్రిత అసంపూర్ణ వ్యాసం నుంచి కొంత భాగం ఉదాహరిస్తాను .....

''మన వార్తా పత్రికలు ఎందుకు పుట్టినవి? ప్రజలకు జ్ఞానము కలిగించుటకు కదా! అయితే ఇప్పుడు మన వార్తా పత్రికలవల్ల ఆ పని సరిగా జరుగతూ ఉన్నదా? పత్రికలో ఉన్న భాష ప్రజలకు బాగా బోధపడితే కదా అందులో ఉన్న సంగతులు వారికి తెలియడానికి, అందువల్ల వారికి జ్ఞానము కలగడానికి? ------ ప్రజలవాడుకలో లేని ముక్కలు మూలమూలలనుండి బయలుదేరుతవి. సమాసాలు చదువుకొనే వారికి ఉరిత్రాళ్ళు. వినేవారికి ఉఱుములు. కొన్నికొన్ని ఇంగ్లీషు ముక్కలు కూడా అక్కడక్కడ అప్పుడప్పుడు దొర్లుతూ ఉంటవి ------ ఇదంతా తెలుగుభాష అని వ్రాసే వారు వ్రాస్తూ ఉన్నారు. తృప్తి కూడా పడుతున్నారేమో -------''

''పలుకుమనుగడ'' అనే అముద్రిత వ్యాసంలో కవిగారు తెలుగును మహాభాష చెయ్యాలని ప్రకటిస్తూ మహాభాషకి మూడు లక్షణాలు చెప్పారు --

1. మాట్లాడే వారి సంఖ్య అధికంగా ఉండటం
2. పరిపూర్ణమైన పాండిత్యం కుదర్చు కోవడానికి తగిన గ్రంథసామగ్రి ఉండటం
3. పై భాషలవారు తమ భాషలోకి కోరి తర్జుమా చేసుకోగల మంచి గ్రంథాలుండటం

అని వివరిస్తూ ఇలా అంటారు - ''మొదటిది మనకు ఉండనే ఉంది. రెండు, మూడు లక్షణాలు మనకు కొరతగా ఉన్నాయి. ఈ కొరత తీరాలంటే హిందీలాగా, బెంగాలీలాగా మహాభాష కావాలంటే సంస్కృత బానిసత్వం నుంచి మనం బయటపడాలి'' (హిందీపై సంస్కృత భాషా ప్రభావం బాగానే ఉంది కదా?)

4.3. కవిగారి భాషాసేవలో బాల సాహిత్యం ఒక ముఖ్యాంశం. ఆ తరం పండితులందరూ ఇంచు మించుగా బాల సాహిత్యాన్ని సృష్టించినవారే. ''బాలల తెలుగు వ్యాకరణం''; ''విద్యార్థి నిఘంటువు''; ''తెనుగుమేడ'' వంటి రచనలు కవిగారి ఆధునిక భాషా శాస్త్ర దృష్టిని వెల్లడిస్తాయి.

''అక్షరములననేమి? అర్థమును తెలుపుటకు నుడులు పలుకు ధ్వనులు. అక్షరములన్నియు నొక్కరకమే కాబోలును, కావు. రెండు రకములు అవియే అచ్చులు, హల్లులు. అచ్చులననేమి? తమంతట తాము సులభముగా పలుకబడెడి అక్షరములు అచ్చులు. అచ్చుల తోడులేక సులభముగా పలుకబడని యక్షరములు హల్లులు. ఇంతటితో నయినదా? మరల దీనిలో భేధములున్నవా? లేక పోవుటయేమి? ఉన్నవి ......'' అంటూ కవిగారు వివరిస్తూ శాస్త్రీయంగా రెండు పట్టికలిచ్చారు.

'తెనుగుమేడ' అనే వ్యాసం ''వ్రాలదండ'' ను గురించిరాసినది. వ్రాలు సేర్పుటలో కవిగారు పలికిన పలుకులు పరిశీలిస్తే తొలి భాషా పరిశోధకత్వం అవగతమవుతుంది - ''వ్రాలు బండ వ్రాతగా వ్రాయించుట మంచిది కాదు. అందువలన పిల్లల తెలివి పైకిరాదు. వ్రాలు వ్రాయుటతో చదువు మొదలిడుచున్నారు. ఇదిసరి అయిన దారికాదు. చదువు చెప్పుట వ్రాతతో మొదలు పెట్టుట తప్పు ..... అంటూ అభ్యాసము'' ఎలా వుండాలో, పాఠ్యరచనా పద్ధతినీ, ప్రశ్న పత్రాలు స్వరూపాన్ని తెలిపారు. సంభాషణా పరంగా కొన్ని పాఠాలు రాయాలని ఆనాడే ప్రకటించారు.

5. గిడుగు రామమూర్తి, జయంతి రామయ్యపంతులు, గంటిజోగి సోమయాజి వంటి వారితో సమానంగా - కొన్ని అంశాలలో ఇంకా ఎక్కువగా కృషి చేసిన భాషా పరిశోధకులు కవిగారు. అయితే వీరి రచనలు ముద్రితం కాకపోవడంవల్ల, అసంపూర్ణాలుగా ఉండిపోవటంవల్ల వీరి భాషాకృషి వెలుగులోకి రాలేదు. పైగా కవిగారు ఒక్క భాషారంగానికే పరిమితం కాకుండా స్వాతంత్ర్య సంగ్రామం, గ్రంథాలయోద్యమం, ఖాదీ ఉద్యమం, నాటకరంగం, వయోజన విద్యారంగం, సాహితీ సంస్థల ప్రచరణల సంస్థల స్థాపన .... వంటి వాటిల్లో బాధ్యత వహించడం వల్లకూడా ఒకే రంగంలో స్థిరపడలేదు.

''కని, పలువెతల పాలయి, మనుచుతల్లి
తల్లి కంటె హెచ్చుగ పెంచు తల్లినాడు
తనమది వెలార్చి పేర్తెచ్చు తల్లిభాష
తనర, కొలుచువారల కంటె ధన్యులెవరు'' - మా.రా.శాస్త్రి

*****

## తొలితరం పరిశోధకుడు -
# కందుకూరి వీరేశలింగం పంతులుగారు

- డా॥ పి. భాగ్యలక్ష్మి

సాధారణంగా మనిషి జీవితంలో ఉన్నట్లే సమాజ జీవితంలో కూడా మార్పులు ఉంటాయి, వస్తుంటాయి. ఒక తరం, కొత్త అభిరుచులతో ప్రమాణాలతో అవసరాలతో సమాజాన్ని మార్చడానికి ప్రయత్నం చేస్తుంటుంది. అప్పుడు ఈ సంఘర్షణే ఏకాలంలోనైన 'ఆధునికతకు' భూమిక. అప్పుడు ఆలోచనలు కదులుతాయి. అనుభూతులు వ్యక్తం చేసేతీరు మారుతుంది. భాషకు కొత్త వాడి వేడి కలుగుతుంది. చైతన్యం కలిగిన వ్యక్తి తన నాటి సమాజంలో తన ఉనికికి సార్థక్యం ఏమిటని ఆలోచిస్తాడు. ఆ ఆలోచనలతో మధనపడే వ్యక్తుల నుండి నవ సమాజ ప్రవక్తలు, కవులు, కళాకారులు ఉద్భవిస్తారు. సమాజ స్థితిని మారుస్తారు. యుగపురుషులు, యుగ కర్తలు అవుతారు.

తొలినాళ్ళలో విద్వత్ సభలు, తరువాత కాలంలో కావ్యగతంగా సుకవి స్తుతి కుకవి నింద రూపంలో విమర్శనా వ్యాపారం జరిగేది. రెడ్డిరాజుల కాలంలో ఏకంగా విద్యాధికారి వ్యవస్థ ప్రారంభం అయింది. రాయల యుగంలో పండిత సదస్సుల వంటి భువన విజయం, రఘునాథ నాయకుల కాలంలో సరస్వతీ మందిరం మొదలయిన ప్రశంసా పూర్వక చర్చా వేదికల ద్వారా విమర్శ దూషణ భూషణ తిరస్కార పురస్కార పరంగా సాగుతూండేది.

అక్కడక్కడ ప్రాచీన కవులు (తిక్కన, అల్లసాని పెద్దన, మొల్ల, రఘునాథ నాయకులు) కవిత్వం ఉండవలసిన తీరు తెన్నులను కవిత్వంలోనే చెప్పారు. ఇదంతా సంస్కృత లక్షణ గ్రంథ లక్ష్యంగా సాగింది. ఇక్కడ పాశ్చాత్య సాహిత్య ప్రభావం లేదు. ఆధునిక విమర్శన విశ్వవిద్యాలయ ప్రాపకంలో విస్తృతి పొందింది. విశ్వవిద్యాలయ ప్రాపకంలో లేని విమర్శకులు కూడా లేకపోలేదు. విమర్శనలో ప్రాచీన అలంకార శాస్త్ర ప్రాభవం క్షీణిస్తూ ఆంగ్ల సాహిత్య పరిచయం ద్వారా అభివృద్ధి చెందుతున్న నూత్న విమర్శనా పద్ధతి ప్రారంభ దశను సంధి దశ అనవచ్చు. ఈ కాలంలో వెలసిన ఆధునిక ఆంధ్ర సాహిత్యానికి రాచబాటవేసి సాంఘిక దురాచార నిర్మూలనకు మత మౌఢ్యానికి సాహిత్య ప్రక్రియల ద్వారా సమయోచిత సందర్భోచిత పాత్రల రూపకల్పనలతో ప్రక్రియా వైవిధ్యంతో సంగీత సాహిత్య సాంఘిక చైతన్యం కోసం కలం పట్టిన ప్రక్రియా విమర్శకుడు కందుకూరి వీరేశలింగం. వీరి విమర్శన వ్యాసరూపంగాను, గ్రంథ రూపంగాను సాగక సాహిత్య ప్రక్రియా పరంగా సాగడం వీరి ప్రతిభా పాటవ క్రియాశీలతకు నిదర్శనం.




తెలుగులో తొలితరం పరిశోధకులు-జాతీయసదస్సు, తెలుగుశాఖ, హైదరాబాదు విశ్వవిద్యాలయం-నవంబరు 7-9, 2000

ప్రాచీన సాహిత్యాన్ని పరిశీలిస్తే కవులు కావ్య రచన కుపక్రమించడానికి ఏదో ఒక బలీయమైన కారణం కనిపిస్తుంది. కొంత మంది కవులకు రాజుల ప్రోత్సాహం కారణమైతే మరి కొంత మందికి ఇష్టదేవతలు కలలో కనిపించి కావ్యం వ్రాయమనడం కారణమవుతుంది. ఇది ప్రాథమిక దశ. కాలం మారే సరికి శృంగార భావాలు పెరిగాయి. నిరుపహతిస్థలము, రమణీ ప్రియ దూతిక తెచ్చి ఇచ్చు కప్పుర విడెము, ఒప్పుతప్పరయు రసజ్ఞులు ఊహ తెలియంగల లేఖక పాఠకోత్తములు, ఊయల మంచము ఉన్నప్పుడే కవిత్వం చెప్పాలన్న స్పందన కలిగింది. అంటే కవిత్వం చెప్పడానికి ఏదో ఒక ఉత్ప్రేరకం (stimulation) కావాలని అర్థమవుతున్నది. దీన్నే ''తిక్కన భవ్య కవితావేశం'' అన్నారు. ఆధునిక గద్య తిక్కనగా పేరుగాంచిన కందుకూరి వీరేశలింగం సాహితీ జగత్తులో అన్ని సాహిత్య ప్రక్రియలకు ఆద్యుడయినాడు. దీనికి మూలకారణం నాటి కాలంలో ఉన్న సాంఘిక దురాచారాలు, మూఢ నమ్మకాలు, బాల్యవివాహాలు. వీటిపై తిరుగుబాటుగా సాహిత్యాన్ని ఆయుధంగా చేపట్టారు. ఈ సాహిత్యానికి ఇన్స్పిరేషన్ సాంఘిక దురాచార నిర్మూలన. ఇదే ఆయనకు కలిగిన భవ్యకవితావేశం.

పంతులగారు సాంఘిక రంగంలోనే గాక, సాహిత్య రంగంలో కూడ సంస్కరణలను ప్రారంభించారు. దేశకాల పరిస్థితుల ననుసరించి సరళము సుబోధకము, విజ్ఞాన ప్రదములైన ఎన్నో గద్య ప్రక్రియలకు శ్రీకారం చుట్టారు. నూత్నరీతులకు మార్గదర్శకుడు అయినాడు.

ఆంగ్లభాషలో గోల్డుస్మిత్ వ్రాసిన 'వికార్ ఆఫ్ వేక్ ఫీల్డు' అను నవలను అనుసరించి తెలుగులో రాజశేఖర చరిత్రను వ్రాశారు. ఇందులో వీరేశలింగం గారి స్వీయ జీవితానుభవాలే సన్నివేశాలు, పాత్రలు అయినాయి. నోములు, వ్రతాలు, శకునాలు, శాంతులు, భూతవైద్యం, ఎఱుకలు, సోదులు, మతంపేరిట మోసాలు, దొంగ సన్యాసులు మొ॥ విషయాలను విమర్శించారు. పురుషుడు నడుచుకోవలసిన తీరు ఇందులో వివరించారు. సమాజ బాధ్యతా నిర్వహణలో సమాజ వికాసానికి కావలసిన విద్యా వివేకాలలో స్త్రీలు కూడ పురుషులతో సరిసమాన స్థాయిని పొందితే తప్ప సమాజం బాగుపడదని ఆయన విశ్వాసం. ఈ దృక్పథంతో మహిళావికాసం కోసం ''సతీహితబోధిని'' అనే పత్రికను నడుపటమే కాక స్త్రీల ఉపయోగార్థంగా ''సత్యవతీ చరిత్రము'' అను నవల 'గలీవరు ట్రావెల్స్' ను ఆధారముగా చేసికొని చేశారు. ఇది వ్యంగ్య హాస్యములతో కూడిన సాంఘిక విమర్శనా గ్రంథము. ఇందులో సంఘంలో స్త్రీకి తరతరాలుగా జరుగుతున్న అన్యాయాలను, జాతకాలు, మూఢ విశ్వాసాలు, గ్రహచారాలు శకునాలను ఆయన హేళన చేశారు.

నాటక రచనకు పంతులుగారే ఆద్యులు. కాళిదాసుని అభిజ్ఞాన శాకుంతలము, మాళవికాగ్నిమిత్రము. కృష్ణ మిశ్రుని ప్రబోధ చంద్రోదయము, హర్షుని రత్నావళి వంటివి సంస్కృత నాటకాలను, వెనీసు వర్తక చరిత్ర, రాగమంజరి, కళ్యాణ కల్పవల్లి, వంటి ఆంగ్ల నాటకలాను అనువదించి ప్రదర్శింప చేశారు. నాటక ప్రదర్శనము నందు కూడ పంతులుగారు సంఘ సంస్కార ప్రయోజనమునే అపేక్షించుట గమనార్హము ''ఇట్టి నాటక ప్రదర్శన మూలమున జనులకు వినోదము కలుగటమే కాక యక్రమములు చేయు వారు సిగ్గుపడి తన ప్రవర్తనను దిద్దుకొనుటయు, అందువలన నీతి వర్థిల్లుటయు గలుగును'' అను అభిప్రాయమును వ్యక్తం చేశారు. ''తెలుగునాట ప్రబోధ వాఙ్మయమును, సృష్టించుటయందు పంతులుగారు ఆద్యులు అగ్రగణ్యులైనారు.'' (డా॥ అక్కిరాజు, రమాపతి రావు : వీరేశలింగం పంతులుగారు సమగ్ర పరిశీలన. పుట 126).

జీవిత చరిత్రలు, స్వీయచరిత్ర అను నూత్న ప్రక్రియలకు కూడ ఆద్యులు కందుకూరి వీరేశలింగం పంతులుగారే. సంస్థాన చరిత్రులలో ప్రస్తావికముగా అహల్యాబాయి, పండితరామాబాయి సరస్వతి, పండిత ఈశ్వరచంద్ర విద్యాసాగరుల జీవిత చరిత్రలు వ్రాశారు. కాని ప్రత్యేకముగా వ్రాసిన వాటిలో విక్టోరియా మహారాజ్ఞి జీవితము ముఖ్యమైనది. ఇది స్త్రీలకుపయుక్తముగా ఉంటుందని ఆయన భావన. తరువాత పేర్కొనదగినది శ్రీరాజారామమోహనరాయలవారి చరిత్ర. కాని ఇది పూర్తి చేయబడలేదు. పంతులుగారు వ్రాసిన మహాపురుషుల జీవిత చరిత్రలలో జీసను చరిత్ర ముఖ్యమైనది. ఆ కాలం జనులలోని దురాచారాలు, మూఢవిశ్వాసాలను మహాపురుషుల మహిమలను గూర్చి జనులల్లిన ప్రచారము చేసే కట్టుకథలను పంతులుగారు విమర్శించారు. అవసరమైనప్పుడల్లా చేసే ఈ దురాచార విమర్శనము పంతులుగారి వ్యక్తిత్వంలోని ప్రధానవిషయం. శంకరాచార్యులు గారి జీవిత చరిత్ర రచనలలో కూడ పంతులు గారిట్టి మహిమలను వర్ణించు నెడల తూష్ణీంభావమును వహించారు. స్త్రీవిద్యయందు పంతులు గారు అత్యంతాభినివేశము కలవారు. కావున స్త్రీలకు మార్గదర్శకంగా ఉండటానికై ఉత్తమ స్త్రీల చరిత్రలను వ్రాసిరి. వీరిలో గ్రేస్ డార్లింక్ కన్య, జోన్ ఆఫ్ ఆర్కు, ఎలిజిబెత్ ఫ్రై దొరసాని, లేడిజేన్ గ్రే, అనిబిసెంట్ దొరసాని, వంటి వారల కథలు 'తెలుగు జనానా' పత్రికయందు ముద్రింపబడ్డాయి.

వ్యాసములు, ఉన్యాసములకు శ్రీకారంచుట్టి పుంఖాను పుంఖములుగా రచించారు. వీరేశలింగం కాలానికి వ్యాసం అనే పేరు ప్రాచుర్యం పొందలేదు. ఈ ప్రక్రియను ఆయన ఉపన్యామని వ్యవహరించారు. 19వ శతాబ్దంలో పత్రికలను నడపని పండితుడు లేడు. అని చెప్పటంలో అతిశయోక్తిలేదు. ఎప్పుడైతే పత్రికా

బాహుళ్యం ఏర్పడిందో 'వ్యాసం' ఆధునిక ప్రక్రియగా ప్రామాణిక రూపాన్ని సంతరించుకొంది. వీరేశలింగం పంతులు గారు నాలుగు దశాబ్దాలపాటు వివిధ విషయాలపై ఉపన్యాసాలు చేశారు. వ్యాసాలు వ్రాశారు. ఆనాటి సాంఘిక సమస్యలలో ఆయన స్పృశించని విషయంలేదు. ఏకేశ్వరోపాసన, బాల్యవివాహాలు, వితంతు పునర్వివాహాలు, విగ్రహారాధన, స్త్రీజనోద్ధరణ మొదలైన అంశాలపై వారి ఉపన్యాసాలు, వ్యాసాలు, ఆనాటి పత్రికలలో ప్రచురించబడ్డాయి. ఇవి వారి శక్తిమంతమైన శైలికి ఉదాహరణలు. ఆయనతోనే తెలుగు సాహిత్యంలో వచనరచనా యుగం ప్రారంభమైంది. ఒక వైపు సంఘంలో అధికారులైన ఉద్యోగులతో, ఒక వైపు సాంఘిక సుస్థితిని కలుషితం చేస్తున్న వేశ్యాపరాయణులతో మరొక వైపు భాషాసాహిత్యరంగాలలో అభ్యుదయం పనికిరాదనే ఛాందస వర్గాలతో, ఆయన సిద్ధాంతపరంగాను, ఆచరణ రూపంగాను, తలబడవలసి వచ్చింది. ఆయన జీవితంలో అర్ధశతాబ్ది ఈ విధంగానే సాగింది. ఏమైన ఆయన ఆశయాలకు వ్యాసాలు ఉపన్యాసాలు సాధనాలయ్యాయి.

పరిశోధన, కందుకూరి వారికి ఎంతో ఇష్టమైన విషయం. అనేక తాళపత్ర గ్రంథాల ప్రతులను సేకరించి పరిశీలించి, పరిష్కరించి, ముద్రించారు. తెలుగులో కవుల చరిత్రలకు కూడ కందుకూరి వారే ఆద్యులు. ఏ సాధన సంపత్తి లేని కాలంలో గ్రంథములన్నింటినీ సేకరించి కవుల కాల నిర్ణయాలు, గ్రంథాల పౌర్వాపర్యాలను శాసనాధారంగా నిర్ణయించి, మూడు సంపుటాలుగా ప్రచురించారు. ఇవి వారి పరిశోధన దీక్షకు దక్షతకు నికషోపలము.

అలాగే ప్రహసనాలు అనే మరొక ప్రక్రియకు కూడ ప్రాచుర్యాన్ని కలిగించింది పంతులుగారే. వీరి బ్రాహ్మవివాహము, అభాగ్యోపాఖ్యానం, వ్యవహార ధర్మ బోధిని, మొదలైన ప్రహసనాలు ఆనాటి సమాజంలో తీవ్ర సంచలనాన్ని కలిగించాయి. సమాజంలో సర్వ అనర్థాలకు వేశ్యావృత్తి కూకటి వేరని బాధపడి ఆ పడుపువృత్తి నిర్మూలనకోసం కృషి చేశారు. 'వేశ్యా ప్రియ' ప్రహసనం 'కౌతుకవర్ధిని' వంటి ప్రహసనాలు వ్రాశారు. సమాజంలో సంపన్నతకు, ఉన్నత స్థాయికి, రసికతకు, గౌరవానికి వేశ్యనుంచుకోవటమనేది చిహ్నాంకావటం దీనికి సాంఘికామోదముద్ర లభించటం వీరేశలింగం పంతులుగారు భరించలేకపోయారు. సమకాలీన సమాజంలో పంతులుగారి ప్రహసనాల ద్వారా ఎంతో సంచలనం కలిగింది. ప్రహసనాల ద్వారా ప్రజా సామాన్యంలో జ్ఞాన ప్రబోధానికి విరివిగా యత్నం చేశారు. సంఘ సంస్కరణోద్యమము ఉపన్యాసవేదికల మీద, పండితుల మీద ప్రతివాదములను తెలుపు గ్రంథములలో మాత్రమే కాక, ఈ ప్రహసనముల మూలమున సామాన్య జనుల గృహములలోకి చొచ్చుకొని పోయింది. హిందూ మహాసభ అనే ప్రహసనము అన్నింటిలో కెల్ల

కళుకుదనమునకు ప్రసిద్ధి కెక్కింది. యుద్ధరంగంలో మృదువైన సాధనాలుపయోగించటం ఆయనకిష్టం లేదు. దౌష్ట్యము నొక్కపెట్టున దుడ్డుకర్రతో మోదటానికి అతడు అలవాటు పడ్డాడు' అన్న పంతులుగారి శిష్యుడు అనుయాయి అయిన వేంకట శివుడు గారి మాటలు పంతులుగారి ప్రహసనాల ప్రవాహానికి దర్పణం పడుతున్నాయి. రక్షణోద్యోగులు వీరిని దుయ్యబట్టారు. విమర్శకు పాత్రులైన వాళ్ళందరు సంఘములో పేరు గల ప్రముఖులు కావడంచేత, కోర్టులో పరువు నష్టం దావాలు వేశారు. కోర్టు కేసులు వచ్చాయి. చివరకు కులము వాళ్ళే వెలివేశారు. అయిన మొక్కవోని పట్టుదలతో తన లేఖినికి కత్తి కన్నా పదును పట్టి స్వార్థపరుల బండారాలను బయట పెట్టి సాంఘిక రుగ్మతలకు శస్త్రచికిత్స చేశారు. సామాజిక చైతన్యం సాహిత్యంలో ప్రతిబింబించడానికి ఆద్యులు వీరేశలింగం పంతులుగారు.

శాస్త్ర గ్రంథ రచనలలో కూడ కందుకూరి వారే ఆద్యులు. తర్కశాస్త్ర సంగ్రహం, జోతిశ్శాస్త్రం, శరీర శాస్త్రము, అలంకారశాస్త్రము, జంతు స్వభావ చరిత్ర మొ॥ల గు ప్రకృతి శాస్త్ర గ్రంథములు వ్రాశారు. స్త్రీల ఉపయోగానికై పత్నీహిత సూచని, దేహా రోగ్య ధర్మబోధిని మొదలయిన అనేక శాస్త్ర గ్రంథాలను రచించారు.

వచన రంగమున ఒక 'చిన్న కథ' తప్ప పంతులు గారు చేయని సాహిత్య ప్రక్రియ లేదని విమర్శకులు ముక్త కంఠంతో పేర్కొన్నారు. పంతులుగారి సాహిత్య సేవను, బహుముఖ ప్రజ్ఞను, సంఘ సంస్కార దీక్షను, త్యాగ నిరతిని మెచ్చి ఆనాటి బ్రిటీషు ప్రభుత్వం వారు 'రావుబహద్దూర్' బిరుదుతో సత్కరించారు.

కందుకూరి వారు విద్యార్థి దశ నుండి సాహిత్య పరిశ్రమ ప్రారంభించారు. మనసులో ఒక సంకల్పం పుట్టగానే దానిని చేయనారంభించే స్వభావము ఆయనది. అందువల్ల ఛందస్సు నేర్చుకొని పెద్ద పెద్ద మాటలతో పద్యాలల్లటం ప్రారంభించారు. మూఢ భక్తితో మార్కండేయ శతకం, గోపాల శతకం వ్రాశారు. 'కందం చేసిన వాడు కవి' అనునానుడి ఉన్నది కనుక ఆ రెండు శతకాలు కంద పద్యాలలో వ్రాశారు. భార తంలో నల చరిత్ర కావ్యంగా వ్రాయటం ప్రారంభించారు. ఎవరూ తొక్కని దోవ తొక్కాలి. అని అనుకున్నాడు అందువల్ల శుద్ధాంధ్ర నిరోష్ట్య నిర్వచనంగా దాన్ని మార్చాడు. 'రసి కజనమనో రంజనం' అనే కావ్యం రెండు ఆశ్వాసాలు వ్రాశారు. ఆ తరువాత అన్నింటిలో ఇది ఒకటి అవుతుందనుకొని అచ్చ తెలుగు కావ్యంగా వ్రాసి ఇలాటి ప్రబంధం ఇంకోటి లేదనుపేరు పొందారు. శుద్ధాంధ్ర ఉత్తర రామాయణం, శుద్ధాంధ్ర భారతం మొద లైన కావ్యాలు వ్రాశారు. వీటిల్లో అతివేలమైన శృంగార వర్ణనలున్నాయి. పూర్వ గ్రంథాల్లోని ఉత్తమ కల్పనలకు అనుకరణలున్నాయి. బంధ, గర్భ కవిత్వాలున్నాయి. తరువాత బుద్ధి మారిపోయింది. మనసు తిరిగినప్పుడు ఆ దారినే పోవటం ఆయన

అలవాటు. పూర్తిగా వచనరచనలోకి మారిపోయారు. కవుల చరిత్ర వ్రాసేనాటికి పై కవిత్వాలపై ఏవగింపు కూడా కలిగింది. గణపవరపు వేంకటకవి వేంకటేశ్వర విజయ విలాసం, గుడారు వేంకటదాస బలరామ చరిత్రములను తీవ్రంగా అధిక్షేపించారు.

ఈ విధమైన కవిత్వస్థితికి ఖిన్నుడై కోపావేశుడై తన ఆవేదనను సరస్వతీ నారద విలాపముగా 25 పద్యాల చిన్న కావ్యంగా ఆవిష్కరించారు. అది కందుకూరి వారి విమర్శనా పద్ధతికి దర్పణం. వీరి ప్రతి రచన వెనుక దురాచార నిర్మూలన, సంస్కరణ అనే ఆశయాలు అంతర్వాహినిగా ప్రవహిస్తుంటాయి.

సరస్వతీ నారద విలాపం కవిత్వ సంస్కరణకు కార్య రూపం దాల్చిన కవితా వస్తువు.

ఇందులోని పాత్రలు సరస్వతి, నారదుడు. సంగీత సాహిత్యాలు సరస్వతీ స్తనద్వయాలుగా, ఆమె రెండు కళ్ళుగా ప్రసిద్ధి పొంది ఉన్నాయి. ఇందులో సాహిత్యానికి సరస్వతిని, సంగీతానికి నారదుని ప్రతీకగా గ్రహించారు. ఆ కాలములో ఈ రెంటికి కలిగిన దీన స్థితి ఇందులో వర్ణింపబడింది. ఈ రెండు పాత్రల సమావేశానికి రంగస్థలం దండకారణ్యం. సరస్వతి నారదుడు విచార వదనంతో విలపిస్తు రంగ ప్రవేశం చేస్తారు. సరస్వతి "ఈ పాపుల కతమున నారూపెల్లను మారిపోయె క్రూరాత్మ లకున్ జేపడితి; మోసపోయితి; నేపగిదిం బ్రతుకు గందు నిక నే నకటా?" ఈ పాపు లకతనమున అన్నపదం ముఖ్యముగా వేంకటేశ్వర విలాస కృతికర్త, బలరామ చరిత్ర కృతికర్తలను దృష్టిలో ఉంచుకొని చెప్పినట్లుగా స్వీయ చరిత్రను బట్టి తెలియుచున్నది. ఈ కవి క్షీణయుగపు సాహిత్య లక్షణాలతో అర్థరహితము, అలంకారభూయిష్ట మయిన రచనచేసినట్లు, దానికి కందుకూరి స్పందించి సరస్వతి నారద విలాప కావ్య మునకు శ్రీకారం చుట్టినట్లు తన స్వీయ చరిత్రలో చెప్పుకున్నాడు. సాహిత్యములో వచ్చిన మార్పులకు సరస్వతి తన "రూపెల్లను మారిపోయెను" అని ఆవేదన చెందు తుంది. ఈ ప్రబంధాలలో అర్థసారస్యాన్ని చెరచి కావ్య అవయవాలను పూర్తిగా విరచి, ఆంధ్రభాషా కావ్య వధూటిని విరూపిని చేసి, శవప్రాయంగా మార్చారు.

ఈ భావం కేవలం వేంకట కవి గారికే పరిమితం కాదు. ఆ కాలపు సాహిత్య సామాన్య లక్షణం. ఆ కవులు నవ్యతను చూపలేకపోవడం, పేరు పొందిన గ్రంథాలను గుడ్డిగా అనుకరించడం, నైఘంటిక పదాలను ఏర్చి కూర్చటం హృదయాహ్లాదం కాకపోయినా, కనీసం వీనులవిందు కలిగించాలని పదాటోప ప్రదర్శనకు ఉద్యమించటం, అర్థసారస్యాన్ని పట్టించుకోక పోవడం ఆమె వాదన, ఆవేదన. అందువల్ల ఈ రకమైన కవితాస్రష్టలు 'క్రూరాత్ములు' అయినారు. వారి చేత చిక్కి మోసపోయానని ఇక ఎలా బ్రతకగలనని బాధపడడంతో కావ్య ప్రారంభం జరిగింది.

ఇంక "దాయ లలంకారమిషన్ గాయం బాపాదమ స్తకంబును బొడునన్ గాయపడి మామకాంగని కాయము నొచ్చెడును దేలుకటిచిన భంగిన్" అని వాపో యింది. పూర్వపు కవులు కూడ అలంకార రచనలు చేసేవారు. అయితే అవి కావ్య కాంతకు శోభను కలిగించేవి. అందువల్ల వారు ఆమెకు మిత్రులు, హితులు. కాని నేటి కవులు 'దాయ'లు. కావ్యాత్మకు భంగకారణమైన రచనలు చేసేవారందరు ఆమెకు శత్రువులే. అర్థము పట్టించుకోకుండా యమక గమకాలతో శబ్దాడంబరాలతో రచనలు సాగిస్తున్నారు. శరీరానికి అందం కలిగించే ఆభరణాలు అలంకరించుకోవడానికి నాసి కకు కర్ణాలకు రంధ్రాలు చేయాలి. అంతే కాని ఆభరణాలతో నింపుతామని శరీరమంతా తూట్లు పొడిస్తే ఎలా ఉంటుంది? తేలు కరచిన వ్యక్తి ఎంతటి బాధ పొందుతాడో అలాటి గాయాల బాధ కలుగుతుంది. అది దుస్సహ తరంగా ఉంటుందని భావం. ఈ విధమైన కవిత్వ స్థితికి కదిలిపోయారు పంతులుగారు.

ఇక్కడ నారదపాత్రలో ఆనాటి సంగీత దురవస్థను దుయ్యబట్టారు. నాదబ్ర హ్మోపాసన సంగీతవేత్తల పరమావధి. ఆపాత మధురమైన సంగీతపు రూపం కూడ మారిపోయింది. 'వేశ్యల బూతు కూతలే' ప్రజలకు వీనులవిందుగా మారాయి. వేశ్యలు అరకాసునకు మానం అమ్ముకునే వారు. దీనిని బట్టి ఆనాటి సంఘంలో వేశ్యా ప్రాబల్యం తెలుస్తుంది. అందుచేత సంగీత సాహిత్యాల దీన స్థితి ఈ పాత్రల రూపంలో విశ్లే షించబడింది.

సరస్వతీ దేవిని నారదుడు ముందు గుర్తించలేదు. ఆమె ఆర్తారవము ఆనాటి గానము కంటే శ్రావ్యముగా ఉన్నదనుకున్నాడు. రోదనలో కూడ రాగ మాధుర్య గుణం ఉండడం చేత ఆమె కంఠాభరణంగా పాము పరవశించి ఆడడం చూసి, ఆమెను తన తల్లి సరస్వతిగా గుర్తించాడు. గ్రక్కున పోయి ఆమె విచారహేతువునకు కారణమునడి గాడు. తన వలె అరణ్యానికి వచ్చిన తనయును చూసి ఆమె ఆశ్చర్యపడింది. ఏమైన ప్రియ తనయుని దర్శనముతో కలతనుండి కొంత తేరుకున్నది. ఎందుకంటే అతడు కూరిమి పుత్రుడు ఘనమతి.

ఘనమతి అనే పదం ఆలంకారికులు చెప్పిన ప్రతిభను, ప్రజ్ఞను సూచించేది. వీరు విషయాన్ని పైపై తెలిసికొని తృప్తి పడరు. లోతుకు వెళ్ళి కారణాలను వాటి మూలాలను, పరిష్కార మార్గాలను నిశితంగా పరిశీలిస్తారు. ఇంకో మాటలో చెప్పా లంటే ఇది ఆ పాత్రల యొక్క లక్షణం కాదు. కందుకూరి వారి లక్షణం. అందువలన – ఆమె పుత్రుని చూడగానే కలతనుండి తేరుకున్నది. తన బాధను వివరింపసాగినది.

సరస్వతి నారదునితో

"రమణీయోక్తుల చేత సర్గుణసారస్యంబు గల్పించుచుం
దమి నాయంగచయంబునన్ సహజ సౌందర్యంబు పెంపొంద గొం
చె మలంకారము లుంచి తొల్లిటికవుల్ చేష్టాచమత్కార భా
గ్యము హెచ్చించుచు దీర్ఘకాలము ననుం గాపాడి రర్థక్రియల్."

ఈ పద్యమునందు నన్నయాది కవుల రచనా పద్ధతి గోచరిస్తున్నది. సంస్కృతములోని జ్ఞాన సంపదను ప్రజలకు పంచిపెట్టాలన్న చింతనతో ప్రాచీన కవులు సంస్కృత గ్రంథాలను తెనిగించారు. ఇది 15వ శతాబ్ది దాక అవిచ్ఛిన్నంగా సాగింది. ఈ పద్ధతి ఆంధ్ర సరస్వతికి సౌందర్యం పెంపొందించింది

ఇటువంటి తరుణంలో ఆధునికులు నిరర్థకములైన పటపట లాడు శబ్దములతో, రసమును నెట్టి, అలంకరణ నెపముతో కావ్య శరీరాన్ని గాయపరచారు.

"అటు సుఖియింపుచుండగ మదాస్యమునందు నిరర్థకంబులై
పటపటలాడు శబ్దముల బల్మిని బెట్టి, రసంబు నెట్టి, య
క్కటికములే కలంకరణకై తవముంగొని మేను కుట్టి, య
ప్పటిఘను లార్తి పెట్టెదరు ప్రాణము తీసి ననుం గలంచుచున్"

ఈ రెండు పద్యాలలో వీరేశలింగం పంతులు గారు ఆ కాలానికున్న పద్య కావ్య స్థితిని తూర్పార పట్టారు. సరస్వతి పాత్ర ద్వారా ఎవ్వరెవరు ఏ రకంగా కావ్య దీనస్థితికి కారకులైనారో సుదీర్ఘంగా ఈ క్రింది సీసపద్యంలో వివరించారు.

"దయమాలి తుదముట్ట దలకట్లు నిగిడించి ధీరుడై నన్ను బాధించు నొకడు
పాదంబులోపల బాదంబు లిమిడించి వీరుడై నన్ను నొప్పించు నొకడు
ప్రాసంబుపై బెక్కు ప్రాసంబు లడరించి పోటుబంటైనన్ను బొడుచునొకడు
బెండు పల్కులు గూర్చి నిండైన నగలంచు దిట్టయై జెవులు వేధించు నొకడు
ఖడ్గ చక్రాది రూపముల్ గానిపించి,
వర్ణములు మార్చినను జిక్కుపఱుచునొకడు
కుమతు లొడనెల్ల విఱిచి ప్రాణములుతీయు
నొడలిపసలేక శుష్కించి యున్నదాన."

ఈ పద్యంలో చమత్కార యుక్తంగా శ్లేషార్థముతో నాటి కావ్య స్థితి వర్ణింపబడింది. మొదటి పాదంలో 'తలకట్లు' అంటే అలంకారాలు. అనవసరమైన అలంకారాలతో ఒకరు శిరోవేదన కలిగిస్తున్నారు. గర్భకవిత్వంతో బాధ పెడుతున్నారు. ప్రాసలనే ఈటెలతో మరొకడు పోటుబంటై బాధిస్తున్నాడు. శుష్కపదాలనే అలంకారాలుగా

భావించి, చెవులకు బాధ కలిగిస్తున్నాడు. చక్ర బంధాది కవిత్వాలతో అక్షరములు మార్చి చిక్కుపరచే పదాలతో కుమతులైన కవులు వేధిస్తున్నారని కందుకూరి వారు సరస్వతి పాత్ర రూపమున విమర్శించారు. దీనికి సమాధానంగా కవిత్వమెలా ఉండాలో ఎటువంటి కవిత్వం ఆదరింప బడుతుందో ఈ క్రింది పద్యాలలో సూచించారు.

సుందరబహురసపుష్టి న, మందానందంబు బుధులమది కిడ దేనిన్
ఛందోబద్ధం బగుపద, బృందాటోపంబు తా గవిత్వం బుగనే?

రసములె కావే ప్రాణము, లసమాన కవిత్వకాంత కవనీస్థలిలో?
రసహీనమైన కవితకు, బొసగించునలంకృతి శవమున కిడుతొడవౌ.

అసలు సిసలైన కవిత్వం ఎలా ఉండాలో గమనించి సహృదయులు అర్థం చేసుకోగలరు.

ఈ విధంగా సరస్వతి నారద విలాపం కవిత్వ విమర్శక పద్య కావ్యం. ఇటువంటి ప్రక్రియలో తెలుగులో మొదటిది అందుచే కందుకూరి యుగకర్తయై సంఘ సంస్కర్తయై విమర్శకులలో అగ్రగణ్యుడైనాడు. అభినవ తిక్కన అని పేరు పొందిన వీరేశలింగం గారు భవ్య కవితా పేశుడై ఆచరణ శీలుడై పేరును సార్థకం చేసుకొన్నాడు.

*****

తెలుగులో తొలితరం విజ్ఞాన పరిశోధకులు -

# శ్రీ వసంతరావు వేంకటరావు

- డా॥ యు.ఎ.నరసింహమూర్తి

భారతదేశంలో ప్రాచీనకాలం నుండి శాస్త్రీయ విజ్ఞానం వివిధ శాఖలుగా విస్తరించింది. ఆ శాస్త్రజ్ఞానమంతా సంస్కృత భాషలోఉంది. గ్రీకులు, మహమ్మదీయులు మన దేశంలో ప్రవేశించిన కారణంగా ఆయా దేశాల శాస్త్రీయ విజ్ఞానం కూడా మన శాస్త్రజ్ఞానానికి తోడయింది. సంస్కృతభాష తరువాత దేశంలో ఎక్కువ ప్రాంతాలలో పారశీక భాష వ్యాప్తిచెందింది. బ్రిటిష్‌వారి రాకతో ఆధునిక వైజ్ఞానిక శాస్త్ర విజ్ఞానం భారతీయులకు పరిచయమయింది. వారి విజ్ఞానమంతా ఆంగ్లభాషలో ఉంది. బ్రిటిష్ పరిపాలన కారణంగా క్రమంగా సంస్కృత, పారశీక భాషలు వెనుకపడి విద్యావ్యవస్థలో ఆంగ్లభాష ప్రాధాన్యాన్ని పొందింది. సంస్కృత, పారశీక భాషలను వెనుకకు నెట్టడానికి బ్రిటిష్‌వారు ప్రాంతీయ భాషలను అభివృద్ధి చేయడమనే పరిపాలనా నీతిని అనుసరించారు. 19వ శతాబ్ది ఉత్తరార్ధం ముగిసేటప్పటికి భారతీయ విద్యార్థులెందరో ఆంగ్లభాషలోను, ఆ భాష ద్వారా సంక్రమించిన విజ్ఞాన శాస్త్రజ్ఞానంలోను నిష్ణాతులయ్యారు. తెలుగువారు ఆ రంగంలో కూడా ఎన్నడూ వెనుకబడ లేదు. తొలితరం తెలుగు విజ్ఞానశాస్త్ర విద్యార్థుల నుండి నేటివరకు ఎందరో విజ్ఞాన శాస్త్రంలో మౌలికమైన పరిశోధనలు చేసి ఉన్నారు. ఆ పరిశోధనలన్నీ ఆంగ్లభాష మాధ్యమంగా జరిగినవి. బోదకాలు నివారణకు ఔషధాన్ని కనిపెట్టిన ఎల్లాప్రగడ సుబ్బారావుగారు, రసాయనశాస్త్రంలో పరిశోధనలు జరిపిన ఏచూరి వెంకట్రామయ్యగారు, జీవశాస్త్ర పరిశోధనలలో జగదీష్ చంద్రబోసుకు సహాయకారిగా పనిచేసిన ఉప్పల లక్ష్మణరావుగారు ఈ కోవకు చెందిన తొలితరం విజ్ఞాన శాస్త్ర పరిశోధకులలో ఉదాహరణ ప్రాయులుగా చూపదగినవారు. వీరిలో ఉప్పల లక్ష్మణరావుగారు (1898-1985) రష్యన్, జర్మన్ సిద్ధాంత గ్రంథాలను తెలుగు భాషలోకి అనువాదం చేసారు.

విజ్ఞాన శాస్త్ర విషయాలను ఆంగ్లభాషలో కంటే తెలుగుభాషలో బోధిస్తే ఆ జ్ఞానం సులభతరమైన మార్గంలో విద్యార్థులకు అందగలదని మేధావులు తొలినుండి నమ్ముతూ వచ్చారు. శాఖోపశాఖలుగా వేలకొలది ఆంగ్ల గ్రంథాలలో విస్తరించిన ఆధునిక విజ్ఞాన శాస్త్ర పరిశోధనల ఫలితాలను తెలుగువారికి తెలుగుభాషలో అందించి తెలుగు సారస్వతాన్ని సుసంపన్నం చేయడానికి తొలితరం విజ్ఞానశాస్త్ర సంపన్నులు కొందరు నడుం కట్టారు. తెలుగులోనే కాక భారతీయభాషలలోనే తొట్టతొలి విజ్ఞాన సర్వస్వ రచనకు శ్రీకారం చుట్టిన కొమర్రాజు వెంకట లక్ష్మణరావు (1876 - 1923) గారికి మొదటి

తెలుగులో తొలితరం పరిశోధకులు-జాతీయసదస్సు,
తెలుగుశాఖ, హైదరాబాదు విశ్వవిద్యాలయం-నవంబరు 7-9,2005

నుండి భౌతికశాస్త్ర విజ్ఞానాన్ని దేశీయులకు అందజేయాలనే కోరిక ఉత్కటంగా ఉండేది. వీరు 1906లో విజ్ఞాన చంద్రికా గ్రంథమండలిని స్థాపించి వివిధ విషయాలకు చెందిన ఇతర గ్రంథాలతో పాటు పదార్థ విజ్ఞాన, రసాయన, జీవ, వృక్షశాస్త్రములపై గ్రంథాలను ప్రకటించారు.

దివి గోపాలాచార్యులు (1872 - 1920) సుప్రసిద్ధ ఆయుర్వేద వైద్యులు. వీరు ఆయుర్వేద విజ్ఞానంలో అపూర్వమైన సేవలు చేసి ''మాధవ నిదానము'' ''అర్థ ప్రకాశిక'' ''ఆయుర్వేద పరిభాష'' ''రసప్రదీపిక'' ''భేషజకల్పము'' మొదలైన వాటికి తెలుగులో వ్యాఖ్యానాలు రాసి ముద్రించి ప్రకటించారు. చరకసంహితకు, సుశ్రుతానికి కూడా వ్యాఖ్యానాలు రాసారు.

ఆచంట లక్ష్మీపతి (1880 - 1962) ఆంగ్లాంధ్ర భాషలలో చక్కని రచనా పటిమ కలవారు. వైద్యశాస్త్ర జీవశాస్త్ర విషయాలను పండితులకు, సాధారణ విద్యావంతులకు వివరించడానికి ఆ పటిమను ఆయన వినియోగించారు. 1907లో విజ్ఞాన చంద్రికా గ్రంథమాల ద్వారా ఆయన తాను తెలుగులో రాసిన జీవశాస్త్రమును ప్రకటించారు. తెలుగులో ధన్వంతరి పత్రికను, ఇంగ్లీషులో ఆంధ్ర మెడికల్ జర్నల్‌ను ఆయన నడిపారు. 1922-27లలో ''ఆయుర్వేద విజ్ఞాన సర్వస్వము'', ''ఆయుర్వేద శిక్ష'', ''వనౌషధీ విజ్ఞానము'' మొదలగు గ్రంథాలను తెలుగులోను ఆయుర్వేదాన్ని అభ్యసించగోరే ఆంగ్ల విద్యావేత్తలకు తగినట్లు ''ఆయుర్వేద శిక్ష'' మొదలగువానిని ఆంగ్లంలో ఆయన రాసి ప్రచురించారు. వ్యాసాలను ఎన్నింటినో వెలువరించారు.

విస్సా అప్పారావుగారు (1884 - 1966) ప్రముఖ భౌతిక శాస్త్రాచార్యులు. సంగీత నాట్యశాస్త్రాలలో దిట్ట. మద్రాసు ప్రెసిడెన్సీ కళాశాలలో ఆనర్సు భౌతికశాస్త్ర విద్యార్థులకు ఆచార్యులుగా పనిచేశారు. ఈయన భౌతిక, ఖగోళ శాస్త్రాలకు సంబంధించిన ప్రాచీనాధునిక శాస్త్ర సాంకేతిక విషయాలను ఎన్నింటినో సులభశైలిలో బాలురకు ప్రౌఢులకు ఉపయోగపడే విధంగా వ్యాసరూపంలోను గ్రంథరూపంలోను వెలువరించారు. ''పరమాణుశక్తి'' (1952) ''వ్యాసావళి'' (1956) ''ఆకాశం'' (1960) ''విజ్ఞానం - విశేషాలు'' (సర్ సి.వి.రామన్ రచనకు అనువాదం - 1964) అనే గ్రంథాలను రాసారు. తెలుగు భాషా సమితి వారి విజ్ఞాన సర్వస్వ విధాన నిర్ణయ సమితిలో పనిచేసారు.

వేమూరి విశ్వనాథశర్మ (1884 - 1970) గారు విజ్ఞాన చంద్రికా మండలి వారి ఆహ్వానాన్ని పురస్కరించుకొని తెలుగులో రసాయన గ్రంథరచన (1908) చేసారు. ఆంధ్ర విజ్ఞాన సర్వస్వ సంపుటాలలో కొన్ని విషయాలపై వ్యాసాలు (1910)) రాసారు.

తెలుగు భాషా సమితి ప్రకటించిన విజ్ఞాన సర్వస్వ సంపుటాలలో రెండవదైన భౌతిక రసాయన శాస్త్ర సంపుటానికి గౌరవ సంపాదకులుగా వ్యవహరించారు.

ఆచంట వెంకట సాంఖ్యాయన శర్మ (1864 - 1933) గారు ''సుజన ప్రమోదిని'' ''కల్పలత'' అని తాను స్థాపించిన పత్రికలలో పదార్థ విజ్ఞాన, రసాయన శాస్త్రములు భూ వృక్ష క్రిమి కీటక ఖనిజ శాస్త్రములు మొదలైన విజ్ఞాన విషయకములైన వ్యాసాలను ఆయన ప్రచురించారు. రహస్య దర్పణము అనే విజ్ఞాన విషయక వ్యాస సంపుటాన్ని ప్రచురించారు.

కోట వెంకటాచలం (1885 - 1954) గారు ఖగోళ విజ్ఞానం ఆధారంగా భారతీయ చరిత్రను పునర్నిర్మించారు. ''ఆర్య విజ్ఞానము'' అనే ఒక బృహత్ గ్రంథాన్ని 8 భాగాలుగా రాసి ప్రకటించాలని ఆయన సంకల్పించారు. దానితో మొదటి రెండు భాగాలుగా ''బ్రహ్మాండ సృష్టి విజ్ఞానము'' ''మానవ సృష్టి విజ్ఞానము'' అనే గ్రంథాలను ఆయన ప్రచురించారు.

మేడేపల్లి వరాహ నరసింహస్వామి (1890 - 1970)గారు మహారాజా కళాశాల, విజయనగరంలో రసాయన శాస్త్రోపన్యాసకులుగా పదవీ విరమణ చేసి మద్రాసులోని తెలుగుభాషా సమితి వారి ''భౌతిక రసాయన శాస్త్రముల'' సంపుటములో రసాయనిక శాస్త్ర విభాగ రూపకల్పనలో విశిష్టమైన కృషి చేసారు. ఆ తరువాత ''దర్శనములు - మతములు, గణితము - ఖగోళశాస్త్రము, వ్యవసాయ శాస్త్రము - పశుపోషణ'' మొదలగు పలు సంపుటాలు అతని సంగ్రాహకత్వంలో వెలువడ్డాయి. విజ్ఞాన సర్వస్వ సంపుటాలు అనేకం రూపొందించడంలో ఆయన ఎక్కువ బాధ్యత వహించారు.

స్వామి జ్ఞానానంద (1896 - 1969) ప్రాచీనార్య ఋషులైన కణాదబ్రహ్మ గుప్తుల లాగా బ్రహ్మజ్ఞానముతో పాటు భౌతిక విజ్ఞాన శాస్త్రంలో అత్యున్నత స్థానాన్ని పొందారు. పరమాణు విజ్ఞాన సంబంధమైన ఆయన రచనలన్నీ ఇంగ్లీషులో ఉన్నాయి. ''పూర్ణ సూత్రములు'' అనే గ్రంథం మాత్రం తెలుగులోకి అనువదింపబడింది.

దండా వెంకట సుబ్బారెడ్డి గారు (1899 - 1987) ఆంగ్లంలోను, ఆంధ్రం లోను వైద్య శాస్త్రము విషయాలను గూర్చి, వైద్య చరిత్రను గూర్చి అనేక వ్యాసాలను, లఘు గ్రంథాలను ప్రచురించారు. ఆరోగ్య విషయాలను సామాన్యులకు తేలికగా తెలిసేలా ''ఆరోగ్య వ్యాసమంజరి'' అనే గ్రంథాన్ని తెలుగులో రచించారు.

జె.వెంకటేశ్వర్లుగారు (1912 - 1981) ప్రముఖ వృక్షశాస్త్రవేత్త. 'తెలుగు విజ్ఞాన సర్వస్వము - వృక్షశాస్త్ర విభాగ'' సంపాదకుడుగా పనిచేసారు.

పైన పేర్కొన్న తెలుగులో తొలితరం విజ్ఞాన శాస్త్రవేత్తలందరిలోను శ్రీ వసంతరావు వేంకటరావుగారు విలక్షణమైన స్థానాన్ని సంపాదించుకొన్నారు.

శ్రీ వసంతరావు వేంకటరావుగారు 1909లో జన్మించారు. శాస్త్రాధ్యయనాన్ని ఒక తపస్సుగా భావించి అదే తమ జీవిత పరమావధిగా భావించారు. వీరు ఆంధ్రాయూనివర్సిటీ నుంచి భౌతికశాస్త్రంలో బి.ఎ. డిగ్రీని, కాశీ హిందూ విశ్వవిద్యాలయం నుంచి ''పాజిటివ్‌రేస్'' ప్రధానాంశంగా ఎం.ఎస్.సి. డిగ్రీని అందుకొన్నారు. ఆ తరువాత 1935లో ఆంధ్ర విశ్వవిద్యాలయంలో సుప్రసిద్ధ శాస్త్రవేత్త ఆచార్య సూరి భగవంతం గారి వద్ద పరిశోధక విద్యార్థిగా చేరి కొద్దికాలం 'X రే' లను గూర్చి అధ్యయనం చేసి ఆ తరువాత కారణాంతరాల వల్ల పరిశోధనకు స్వస్తి పలికారు. అనంతరం 1935లో విజయనగరం మహారాజావారి కళాశాలలో ఫిజిక్స్ లెక్చరర్‌గా ప్రవేశించి 1955లో ప్రిన్సిపాల్‌గా ప్రమోషన్ పొందారు. 1969లో పదవీ విరమణ చేసారు. రచయితగా శాస్త్ర విజ్ఞానాభివృద్ధికి వారు చేసిన కృషికి అనేక గుర్తింపులు పొందారు. మద్రాసులోని తెలుగు భాషా సమితి ఆధ్వర్యంలో రూపుదిద్దుకున్న ''తెలుగు విజ్ఞాన సర్వస్వం''లో ఫిజిక్సు, కెమిస్ట్రీ సంపుటికి వారు 1949 నుండి 1951 వరకు సంపాదకునిగా వ్యవహరించి దానిని ఉత్తమ ప్రమాణాలతో రూపొందించారు. తెలుగు అకాడమీ వారిని 1970లో రీసెర్చి ఆఫీసరుగా నియమించింది. 1975 వరకు వారు ఆ పదవిలో కొనసాగారు. ఈ అనుభవాన్ని పురస్కరించుకొని హైదరాబాద్‌లోని తెలుగు విశ్వవిద్యాలయంవారు తాము చేపట్టిన ''తెలుగు విజ్ఞాన సర్వస్వం'' ప్రణాళికలో ఫిజిక్సు సంపుటిని తీర్చిదిద్దే బాధ్యత శ్రీ వేంకటరావుగారికి అప్పగించారు. వారు ఎస్ట్రోలాజికల్ మ్యాగజైన్, ఎడ్వర్టయిజర్, ఇండియా మ్యాగజైన్, ఆంధ్రప్రదేశ్, భారతి, తెలుగు విద్యార్థి, విజ్ఞానవాహిని, కృష్ణాపత్రిక, భాగ్యనగరం వంటి వివిధ పత్రికలలో 700 కు పైగా వ్యాసాలు ప్రచురించారు. ఫిజిక్సు, ఎస్ట్రోనమీ, ఏస్ట్రోఫిజిక్సు, కెమిస్ట్రీ, ఫిలాసఫీ మొదలగు శాస్త్రాలకు సంబంధించిన అంశాలపై అనేక వ్యాసాలు రాసారు. సుప్రసిద్ధ స్వాతంత్ర్య సమర యోధులు శ్రీ గోవాడ నిరీక్షణరావుగారి సంపాదకత్వంలో మచిలీపట్నం నుండి వెలువడిన ''భాగ్యనగర్'' పక్ష పత్రికలో ''ప్రకృతితో మానవుని చెరవాటం'' అన్న శీర్షికతో 1980 నుంచి 1982 వరకు ధారావాహికంగా ఇరవైకి పైగా వ్యాసాలను వారు ప్రచురించారు. ముప్పైకిపైగా పుస్తకాలను ప్రచురించారు. ఇందులో శాస్త్ర విజ్ఞానానికి సంబంధించినవే ఎక్కువ, ఆధునిక విజ్ఞానము. విజ్ఞానచర్చ, చంద్రునికథ, ద్రవ్యము-శక్తి, విశ్వరహస్యము, సూర్యుడు, ఎలక్ట్రాన్, గాలి-గ్రహాలు మొదలగు పేర్లతో వెలువడిన గ్రంథాలు సైన్సు గ్రంథరచనపై వారికి గల ఆసక్తికి, అభినివేశానికి తార్కాణము. విజ్ఞానసీమలు, విజ్ఞాన స్రవంతి, విజ్ఞాన వికాసము, విజ్ఞాన

స్ఫులింగాలు, విజ్ఞాన మంజరి, విజ్ఞాన వసంతము అనే పుస్తకాలలో తాను వ్రాసిన అనేక వ్యాసాలను సంకలించారు. ఇవన్నీ కూడా తెలుగులోనే ప్రచురింపబడడం గమనార్హం. వీనికి తోడు వీరు కళాశాల విద్యార్థులకు పాఠ్యగ్రంథాలను కూడా ప్రచురించారు. నేటి విజ్ఞానము, ప్రకృతితో మానవుని చర్లాట, కాలతత్త్వము, జనరంజక విజ్ఞానము, విజ్ఞాన గీత మొదలైన గ్రంథాలను ముద్రించారు. ఇవికాక దేశమంతటా జరిగిన వివిధ గోష్ఠులలోను, సెమినార్‌లలోను పాల్గొని విజ్ఞాన శాస్త్ర విషయాలపై ఆసక్తికరమైన అనేక పత్రాలను సమర్పించారు.

ఆంధ్రాయూనివర్సిటీ పంపించగా శ్రీ వేంకటరావుగారు అనేక కళాశాలల్లో భౌతికశాస్త్రంలోని వివిధ అంశాలపై ఎక్స్‌టెన్షన్ లెక్చర్ల నిచ్చారు. తిరుపతిలో ''హిందూమతం'' పై ఏర్పాటుచేసిన సమ్మర్ స్కూల్‌లో వారు ''శాస్త్రము - మతము'' అన్న అంశంపై ప్రధానోపన్యాస మిచ్చారు. వీటికి తోడు మద్రాసు, విజయవాడ, హైదరాబాదు, విశాఖపట్నం ఆకాశవాణి కేంద్రాలనుంచి వారు 150కి పైగా ప్రసంగాలను, గ్రంథ సమీక్షలను చేయడమే కాక శాస్త్రవిషయాలపై ఆసక్తిదాయకమైన నాటికలను కూడా రూపొందించి ప్రసారం చేసారు. న్యూఢిల్లీలోని కేంద్ర సాహిత్య అకాడమీ, నేషనల్ బుక్‌ట్రస్టు, మద్రాసులోని అమెరికా సమాచారశాఖ చేపట్టిన అనేక ప్రాజెక్టులతో వారికి సన్నిహిత సంబంధం ఉంది. తెలుగులో శాస్త్ర విజ్ఞానాన్ని వ్యాప్తి చేసినందుకు వీరు అనేక గౌరవాలను పొందారు. మనకు స్వతంత్రం రావడానికి పూర్వమే శాస్త్ర విజ్ఞానానికి తన జీవితాన్ని అంకితం చేయదలచుకొన్న శ్రీ వేంకటరావుగారు శాస్త్రాధ్యయనం మాతృభాషలోనే జరగాలనీ ఆ విధంగా ఐతే అక్షరాస్యులైన అందరికీ విజ్ఞాన విషయాలు తేలికగా అర్థమవుతాయనే భావనతో శ్రీ వేంకటరావుగారు కలంపట్టారు. డిగ్రీ లెవెల్ వరకు విద్యాబోధన ప్రాంతీయభాషలోనే కొనసాగాలనే వాదనకి ఆయన ఆద్యులు. ప్రీయూనివర్సిటీ, డిగ్రీ క్లాసులకి ఏడు పాఠ్యగ్రంథాలు రచించారు. తెలుగు సాహిత్య అకాడమీ పర్యవేక్షణలో భౌతికశాస్త్రానికి సంబంధించిన పాఠ్యపుస్తకాలను ఇంగ్లీషు నుండి తెలుగులోకి అనువదించారు.

తెలుగులో ఆయన ''పరిణామాల వింతలు'' ''మానవా! మానవా!'' ''విజ్ఞాని అంతరాత్మ'' ''విజ్ఞానమంజరి'' ''వసంత విజ్ఞానం'' ''రోదసి విజ్ఞానం'' ''ఆధునిక విజ్ఞానం'' ''విజ్ఞానచర్చ'' ''ద్రవ్యము-శక్తి'' ''జగము-జీవము'' ''మారేలోకం'' ''విశ్వరహస్యం'' ''సూర్యుడు'' ''ఎలక్ట్రాను ఆత్మకథ'' ''గెలీలియో'' ''పరమాణు చరిత్ర'' ''భౌతికాధ్యాత్మిక విజ్ఞానాలు'' ''విద్యుద్విలాసము'' ''విజ్ఞాన స్రవంతి'' ''విజ్ఞాన ప్రగతి'' ''రాకెట్టులో ఆకాశయానం'' ''ఎంత పెరిగినాడు'' ''చంద్రుని కథ'' ''ఖగోళ పదార్థ విజ్ఞానము'' మొదలైన గ్రంథాలు రాసారు. ఫిజిక్స్, కెమిస్ట్రీ తెలుగుభాషా

పదకోశ సంపుటాలకు సంపాదకత్వం వహించారు.

వైజ్ఞానిక గ్రంథ రచన చేసే సందర్భంలో ఆయనకు రెండు ప్రధాన సమస్యలు ఎదురయ్యాయి. విజ్ఞాన విషయాలను సూచించే ఆంగ్ల పదాలకు సరియైన పారిభాషిక పదాల లోపం మొదటి సమస్య అయితే ఏ సాహిత్య ప్రక్రియ ద్వారా తన ఉద్దేశ్యాన్ని సర్వతోముఖంగా ప్రచారం చేయడం సాధ్యమన్నది రెండవ సమస్య తెలుగులో సరళంగా సుబోధకంగా ఉండే పారిభాషిక పదాలను ఎన్నుకోవడం ద్వారా వారు మొదటి సమస్యను అధిగమించారు. Spectrascope - వర్ణపటదర్శిని, Line Spectrum - రేఖావర్ణపటము, Radiation - ప్రసారము, Stationary Status - స్థావరావస్థలు, Momentum - ఆవేగం, Angular Momentum - కోణీయావేగం, Radius - త్రిజ్యా, Fine Structure Lines - సూక్ష్మ నిర్మాణ రేఖలు, Ellipse - దీర్ఘవృత్తము వంటి పారిభాషిక పదాలు ఇందుకు ఉదాహరణలుగా నిలుస్తాయి. ''ప్రతి కర్మమునకు వ్యతిరేకమును సమానమును అగు ప్రతికర్మ కలదు''. (విశ్వరహస్యము 1947) వంటి సూత్ర రచనలోను, ''ఒక వస్తువు నుండి ప్రసరించు శక్తిని వివిధ తరంగ దైర్ఘ్యాలలోనికి కేటాయించు యంత్రాన్ని ''వర్ణపటదర్శిని'' అంటారు (ద్రవ్యము - శక్తి రెండవ భాగం 1943) వంటి నిర్వచనాలను కూర్చడంలోను, ఒక తేజోరేఖ యొక్క పౌనఃపున్యం 'ప' అనుకుంటే $ప = R (1/అ^2 - 1/ఆ^2)$ వంటి సమీకరణాలను కల్పించడంలోను వేంకటరావుగారు సరళము, సుబోధము అయిన శైలిని ఎన్నుకొన్నారు.

రెండవ సమస్యను పరిష్కరించడానికి ఆయనకు ఒక కవి, ఒక శిల్పి, ఒక సంగీతజ్ఞుడు స్ఫూర్తి నిచ్చారు. ఆ కవి రాయప్రోలు సుబ్బారావుగారు. ఆ శిల్పి ఆదిరాజు సుబ్రహ్మణ్యంగారు. ఆ సంగీతజ్ఞుడు ద్వారం వేంకటస్వామినాయుడుగారు. ''విజ్ఞానం అనుక్షణం విస్తరిల్లుతున్నది. దానిని కథలుగా, గాథలుగా, పదాలుగా, పాటలుగా చివరకు చిత్ర పురాణాలుగా కూడా వివిధ రూపాలలో అనుఘటించి ఆవిష్కరిస్తేగానీ అది ప్రజల బుద్ధులలోనికి ప్రాకదు, అని పూజనీయ రాయప్రోలు సుబ్బారాయ కవీంద్రులు నావిశ్వాసమును బలపరచిరి'' అని వేంకటరావుగారు తన ''విశ్వ రహస్యము'' (1947) అనే పుస్తకానికి కూర్చిన ముందుమాటలో పేర్కొన్నారు. ఆదిరాజు సుబ్రహ్మణ్యం గారు వేంకటరావు గారి గ్రంథాలకు ఎన్నో చిత్రాలను సమకూర్చారు. ఈ ముగ్గురి ప్రోత్సాహంతోను వ్యాసము, గేయము, పద్యము, నాటిక, ఆత్మకథ వంటి వివిధ సాహిత్య ప్రక్రియలతో ఆధునిక వైజ్ఞానిక పరిశోధన జ్ఞానాన్ని సహజము, సరళము, సుందరము అయిన ఆధునిక ప్రామాణిక శైలిలో తెలుగు వారికి అందించడంలో వేంకటరావుగారు కృతకృత్యులయారు. వేంకటరావుగారి గేయరచనకు విశ్వరహస్యము అనే గ్రంథం నుండి ఈ క్రింది భాగాలను ఉదాహరణలుగా స్వీకరించవచ్చును.

గట్టిగ జగతిని సంకులయంత్రాల్
పెట్టి పరీక్షగ దిగ్వలయంబే
మూలను చూచిన తొంబది రెండే
మూల పదార్థాల్ గలవండీ !

ఋణ విద్యుత్తని ధన విద్యుత్తని
కణరూపములో గలవండీ !
ఋణ ధన కణముల కలయికచే పర
మాణువు లేర్పడ గలవండీ !

వేంకటరావుగారి పద్యరచన శైలి ఎంత సుగమంగా ఉంటుందో ఈ క్రింది పద్యాలు తెలియజేస్తాయి.

గాలినైదు పాళ్లు కావింపనందులో
నాల్గు పాళ్ల వరకు నత్రజనియు
ప్రాణ వాయు వొక్క పాలును మిగిలిన
వన్ని వాయువుల్ రవంత గలవు (గాలి - గ్రహాలు, P:2)

మండుచున్న వాయుఖండాలుగా పుట్టి
ఆకసమ్ము వేడి నపహరింప
గడ్డ కట్టినట్టి గ్రహములు బంతులై
నిరత మినుని చుట్టు తిరుగుచుండు (గాలి - గ్రహాలు, P:12)

లేవు మరుల్ సమూహములు
లేవు ఘనాఘన సంచయంబులున్
లేవు లతా నికుంజములు
లేవు రసాల తమాల వాటికల్
లేవు కదా సముద్రములు
లేవు నదాది తటాక కూపముల్
జీవము వృద్ధిచెందగల
చిహ్నము లెవ్వియు లేవు నీయెడన్ (గాలి - గ్రహాలు, P:28)

సూర్య బింబమందు చూపట్టు మచ్చలు
భీకరాగ్ని కీల కాకరములు
మండుచున్న వాయుమండలా లెగయుచు
కాంతి నడ్డగింప కలుగు నవియు (గాలి - గ్రహాలు, P:32)

ప్రౌఢ సాహిత్య పరిజ్ఞానమున్నా వేంకటరావుగారు ఎక్కడా విజ్ఞాన శాస్త్ర గ్రంథ రచనకు విరుద్ధమైన కఠినశైలికి చేటీయలేదు. ఎంతటి క్లిష్టమైన శాస్త్ర విషయాన్నైనా అలవోకగా సహజంగా తేట తెలుగులో పాఠకులకు అందించగలగడం తొలితరం తెలుగు వైజ్ఞానిక పరిశోధకులలో ఆయన సాధించిన ప్రత్యేకత.

యురేకా, బుధులు వంటి నాటికలలో విజ్ఞాన శాస్త్రాంశాలను ఆయన రసవత్తరంగా చిత్రించారు. ఒక వస్తువును నీటిలో ముంచినప్పుడు ఆ వస్తు పరిమాణానికి సమానమైన పరిమాణం గల నీరే పైకి నెట్టబడుతుంది. అనే సూత్రం ఆధారంగా కంసాలి రాజుగారి కోసం తయారుచేసిన కిరీటమంతా స్వచ్ఛమైన బంగారంతో చేసినదని చెప్పి దానిలో 110 తులాల స్వచ్ఛమైన బంగారంతో పాటు 10 తులాల వెండిని కలిపి చేసినట్లు ఆర్కిమెడీస్ నిరూపించిన కథ ''యురెకా'' అన్న నాటికలో ఉంది.

హీరో – సైరక్యూస్ నగరరాజు, యుడెక్సస్ – మంత్రి, హిరాన్ – ఖిల్లేదారు, ఆర్కమెడీస్ – విజ్ఞాని, అర్బిటా – కంసాలి, ఎథీనా – మంత్రి భార్య, మేరీ – ఆర్కిమెడీస్ భార్య అనే పాత్రలతో కూడిన ఈ నాటికలో 6 రంగాలు ఉన్నాయి.

బుధుని ఆత్మభ్రమణ కాలం మన 88 రోజులు. సూర్యునికి ఒక ప్రదక్షిణం చెయ్యడానికి 88 రోజులు బుధ గ్రహం తీసుకొంటుంది. ఇట్లా ఆత్మభ్రమణ కాలాలు సమానం – అనే వైజ్ఞానికాంశం ఆధారంగా అక్కడ జీవకోటి ఉండే కాలగణనం మన లోకంలో లాగా సులభం కాదని, మన పురాణాలలో చెప్పిన పవన, పర్ణ, అంబు భక్షకుల లాగా అక్కడి ప్రాణులు శక్తి భక్షకులయ్యే అవకాశం ఉందని ఊహలు చేస్తూ ''బుధులు'' అనే నాటిక రాసారు. బుధుడు, భూవుడు, చాంద్రుడు అనే పాత్రలు ఈ ఏకాంకికలో కనిపిస్తాయి.

పర్వా వెంకటేశ్వరరావుగారు కార్యదర్శిగా ఉండిన సంస్కృత నికేతనము వారు 1948లో తమ కార్యకలాపములను ప్రారంభించి వైజ్ఞానిక గ్రంథాలను వందవరకు ప్రచురించాలని నిశ్చయించుకొన్నారు. ఈ సంస్థకు దేవులపల్లి రామానుజరావుగారు, వేమరాజు భానుమూర్తిగారు సహాయకార్యదర్శులు. గిబ్సన్ రాసిన ''వాట్ ఈజ్ ఎలక్ట్రిసిటీ'' అనే పుస్తకం ఆధారంగా శ్రీ వేంకటరావుగారు ''రూపవాణి'' ''ఆంధ్రశిల్పి'' ''మాతృసేన'' అనే పత్రికలలో రాసిన వ్యాసాలను సంస్కృతీ నికేతనం – హైదరాబాదు వారు 1953లో ''ఎలక్ట్రాన్ – ఆత్మకథ'' అనే పేరుతో ప్రచురించారు. భారతీయ వాతావరణానికి అనువుగా సాగిన ఈ రచన ఆత్మకథా రూపంలో ఉండడంలో మాత్రమే మూలంతో పోలిక కలిగి ఉంది. (1) స్వప్న సాక్షాత్కారం (2) ఆది చరిత్ర

(3) చంద్రలోకం (4) సంయోగ విశేషం (5) మానవునితో పరిచయం (6) అణువులు - పరమాణువులు (7) మాసక్రమ గమనం (8) నిరంతర నాట్య విశేషం (9) ఎట్టి వార్తావహులయో (10) రంగు లెట్లు కలుగుచున్నాయి (11) నక్షత్ర వార్తావళి I (12) నక్షత్ర వార్తావళి II (13) నా ఎక్స్ కిరణ అనుభవాలు అనే వ్యాసాలు ఆత్మకథారూపంలో ''ఎలక్ట్రాన్ ఆత్మకథ'' అనే గ్రంథంలో ఉన్నాయి. వివిధ సాహిత్య ప్రక్రియలలో ఆధునిక విజ్ఞాన శాస్త్ర పరిశోధనల ఫలితాలను తెలుగు వారికి తేట తెలుగులో అందించడానికి నిరంతర కృషి కొనసాగించారనడానికి పై విషయమంతా సాక్ష్యంగా నిలుస్తుంది.

ఆధునిక విజ్ఞానమంతా ప్రత్యక్ష ప్రమాణానికి లోబడి కార్యకారణ సంబంధం కలిగి ఉండి తర్కసహంగా ఉంటుందని అందుచేత ఆ గుణాలు లేని దైవ మహిమలు ఆధ్యాత్మిక మార్గము వైజ్ఞానికులకు విశ్వాసం కలిగించవని కొందరి మతము, కానీ ప్రపంచంలోని ఆధునిక విజ్ఞాన శాస్త్ర పరిశోధకు లనేకులు దైవం పట్ల ఆధ్యాత్మికత పట్ల అచంచల విశ్వాసాన్ని ప్రకటించి ఉన్నారు శ్రీ వసంతరావు వేంకటరావుగారు కూడా ఆ కోవకు చెందినవారే అనుటకు వారు రాసిన జగత్తు-జీవము, సూర్యుడు వంటి గ్రంథాలు ప్రమాణాలుగా ఉన్నాయి.

జగత్తు-జీవము అనే గ్రంథంలో ''జగత్తు'' ''జీవము'' ''జీవితాంతము'' ''కారాకాశవైచిత్రి'' అనే నాలుగు విభాగాలున్నాయి. మహామహోపాధ్యాయ, న్యాయభూషణ శ్రీపేరి లక్ష్మీనారాయణ శాస్త్రిగారు ఈ పుస్తకానికి పీఠిక రాస్తూ ''ఈ గ్రంథ పఠనము వలన ఆంగ్లభాష యందలి ప్రకృతి ఖగోళశాస్త్ర పరిశోధన యొక్క సంస్కృత భాష యందలి వేదాంత ఖగోళ శాస్త్రముల యొక్క పరిజ్ఞానము అల్పాయాసముచే సిద్ధించును. ఈ పుస్తక మందున్న విషయము మాత్రము చూడగ మన వేదములలోని విషయములనే గ్రహించి ఆధునికులు తగు పరికరములతో చేసిన పరిశోధనా ఫలిత మాత్రమని తెలియక మానదు. కాబట్టి స్మృతి పురాణేతిహాసాదుల వలె దీనికిని వేదమూలకత సిద్ధించుచున్నది'' అని పేర్కొన్నారు. ఈ గ్రంథరచనలో వేంకటరావుగారి లక్ష్యం కూడా అదే అని తెలుస్తుంది. ఈ గ్రంథం 1944లో ప్రకటితమయింది.

శ్రీ వేంకట రావుగారు ''భారతి'' పత్రికలో ప్రకటించిన సూర్యుడు కర్మ సిద్ధాంతము నారదుడు-కర్మఫలము చిత్రగుప్తులు విగ్రహారాధన అనే వ్యాసాలను 1948లో ''సూర్యుడు'' అనే పేరుతో ఒక పుస్తకంగా వెలువరించారు. ప్రాచీన భారతీయ విశ్వాసాల పట్ల ప్రజలకు విశ్వాసం సడలకుండా ఉండాలంటే ఆధునిక విజ్ఞానంతో వాటిని సమన్వయించి ఒక సామరస్యాన్ని సాధించాలనే పూనికతో వేంకటరావుగారు ఈ వ్యాసాలను రాసారు. ప్రాచీన విజ్ఞాన సౌధాలు ఆధ్యాత్మికపు పునాది

మీద నిర్మించారు అని ధృఢంగా విశ్వసిస్తూ సూర్యోపనిషత్తులో చెప్పిన -

సూర్యాద్భ వన్తి భూతాని
సూర్యేణ పాలితానితు !
సూర్యే లయం ప్రాప్ను వన్తి
య స్సూర్య స్సోహ మేవచ !!

అనే శ్లోకార్థాన్ని ఇతర అంశాలను ఆధునిక విజ్ఞానంతో సమన్వయించడానికి హేతు బద్ధమైన పరిశోధన చేసి ''సూర్యుడు'' అనే వ్యాసరూపంలో ప్రచురించారు. భౌతిక విజ్ఞానం కూడా ఆధ్యాత్మిక శాస్త్రాలను త్రికరణయా అంగీకరిస్తున్నది అనే అంశాన్నే ''కర్మసిద్ధాంతమ''నే వ్యాసంలో స్థాపించారు. భారతీయ ప్రాచీనాధ్యాత్మిక విజ్ఞాన వ్యాప్తి కన్న మానవ కళ్యాణానికి వేరొక సాధనం లేదు. ''న్యూటను సూత్రము కర్మ సూత్రము నారద సూత్రము - ఈ మూడును క్రమంగా జడద్రవ్యమునకు భూలోక జీవులకు అంతకు విశిష్టమైన సురాసురులకు వర్తించక తప్పదని తెలియజేయడానికే నారదుడు పౌరాణిక పురుషుడుగా చిత్రింపబడ్డాడా? అనిపిస్తుంది'' అని భావించిన వేంకటరావుగారు నారదుడు-కర్మఫలము అనే వ్యాసం రాసారు. ''శక్తి ద్రవ్యముల కవినాభావ సంబంధ మున్నదని ప్రాయోగికంగా ధ్రువపరచి స్థూలదృష్టికి గోచరించు బహుధానేకత్వంలో ఏకత్వాన్ని అన్వేషించ గలిగిన భౌతిక విజ్ఞాన దృష్టితో చిత్రగుప్తభావాన్ని విమర్శిస్తే మహత్తర సత్యం వ్యక్తమౌతుంది. అది ఏజీవికా జీవియే చిత్రగుప్తుడన్న పరమ రహస్యము'' అన్న అంశాన్ని తాత్వికంగా నిరూపిస్తూ చిత్రగుప్తులు అనే పరిశోధనా వ్యాసం రాసారు. ''ఒక శక్తి రూపాన్ని ఇంకొక శక్తి రూపంగా మార్చడం భౌతిక విజ్ఞానంలో సర్వసాధారణమైనట్లే విగ్రహాన్ని లక్ష్యంగా నియమించుకొని తద్వారా జగచ్ఛక్తి నిష్టసిద్ధికై ఉపయోగించుకొన వచ్చును'' అన్న అంశాన్ని నిరూపించడానికి ''విగ్రహారాధన'' అనే వ్యాసం రాసారు. ప్రాచీన భారతీయ విజ్ఞానాన్ని గూర్చి ఆధ్యాత్మిక విషయాలను గూర్చి రాయవలసి వచ్చినప్పుడు శ్రీ వేంకటరావుగారు మహామహోపాధ్యాయ పేరి లక్ష్మీ నారాయణశాస్త్రి, మహామహోపాధ్యాయ పేరి సూర్యనారాయణశాస్త్రి వంటి దిగ్గంతులైన పండితులతో కలసి అధ్యయనం కొనసాగించేవారు. సహస్రమాసజీవియైన వేంకటరావుగారిలో పరిశోధన ప్రవణత అధ్యయన శీలం అనే రెండు ప్రముఖ లక్షణాలు జీవితాంతం నిలచి ఉన్నాయి.

తెలుగులో తొలితరం విజ్ఞానశాస్త్ర పరిశోధకుల పరిశోధన ప్రవణత మాతృ భాషాభిమానం ప్రజాసామాన్యంలో విజ్ఞాన శాస్త్ర వ్యాప్తి చేయాలనే దృఢ లక్ష్యం ఎలా ఉండేవో స్థాలీపులాకన్యాయంగా తెలియజేయడానికి శ్రీ వేంకటరావుగారి కృషిని గూర్చి

వివరించవలసి వచ్చింది. ఆ తరంలో విజ్ఞానశాస్త్రంలో కృషిని కొనసాగించిన వారిలో శ్రీ వేంకటరావుగారితో సమస్కంధులెందరో ఉన్నారు. ఆయన సమకాలికులలో ప్రజాసామాన్యంలో ఆధునిక వైజ్ఞానిక దృష్టిని పెంపొందించడానికి నిర్దుష్టమైన సత్య సన్నిహితమైన ప్రమాణపూర్వకమైన కృషిని కొనసాగించిన కొడవటిగంటి కుటుంబరావుగారు, నండూరి రామమోహనరావు గారు ఈ సందర్భంలో ప్రత్యేకంగా స్మరింపదగినవారు. శ్రీకొడవటిగంటి కుటుంబరావుగారి సైన్సువ్యాసాలు, శ్రీ నండూరి రామమోహనరావు గారి నరావతారం, విశ్వరూపం వంటి గ్రంథాలు సరళమైన ఆధునిక ప్రామాణిక భాషలో విజ్ఞాన శాస్త్ర విషయాలను అత్యంత ఆకర్షకమైన రీతిలో సాధారణ విద్యావంతులకు అందుబాటులోకి తెచ్చాయి. శ్రీ జమ్మి కోనేటి రావు వంటి విజ్ఞాన శాస్త్ర పరిశోధకులు నాటినుంచి నేటి వరకు తమ కృషిని కొనసాగిస్తూనే ఉన్నారు. తెలుగులో మూడవతరం విజ్ఞాన శాస్త్ర పరిశోధకులుగా గణించదగిన సి.వి.సర్వేశ్వర శర్మ, సమ్మెట గోవర్ధన్, పురాణపండ రంగనాథ్, రెడ్డి రాఘవయ్య, కె.బి.గోపాలం, నారాయణ, నాగసూరి వేణుగోపాల్, మహీధర నళినీమోహనరావు, గుమ్మా రమేష్‌బాబు, చాగంటి కృష్ణ కుమారి వంటి వారెందరో తెలుగులో విజ్ఞాన శాస్త్ర సంబంధమైన రచనలు చేస్తూ అత్యాధునిక వైజ్ఞానికాంశాలను తెలుగు వారికి సుబోధకమైన శైలిలో అందిస్తూ తొలితరం తెలుగు విజ్ఞానశాస్త్ర పరిశోధకుల నుండి పొందిన స్ఫూర్తితో తమ ప్రతిభను చాటుకొంటున్నారు. ఒక శతాబ్ది కాలానికి ముందు ఆరంభమైన తెలుగువారి విజ్ఞానశాస్త్ర పరిశోధన వ్యాసంగాన్ని గూర్చి వివరించడానికి సాహసించిన ఈ చిన్న వ్యాసంలో శ్రీ గొబ్బూరి వెంకటానంద రాఘవరావు వంటి ప్రముఖుల కృషిని గూర్చి వివరించవలసిన విషయమెంతో ఉంది. కొండను అద్దంలో చూపడం అందరికీ సాధ్యం కాదు.

*****

## తెలుగులో తొలితరం పరిశోధకులు -

# పండిత ఆదిరాజ వీరభద్రరావు

– జి. బాల శ్రీనివాసమూర్తి

20వ శతాబ్ద తెలంగాణ చరిత్రలో ముగ్గురు ప్రముఖ పరిశోధకులు కన్పిస్తారు. వారు ముగ్గురూ తమదైన ప్రత్యేక ముద్రను పరిశోధనా రంగంపై వేసినవారే. తొలుత శేషాద్రి రమణ కవులను పేర్కొనవలసి ఉంటుంది. వీరు తెలంగాణలో విస్తృత సాహిత్యాన్ని వెలుగులోకి తీసుకొని వచ్చేందుకు విస్తృతమైన కృషి చేశారు. రెండవ వారు ప్రతాపరెడ్డి గారు. సాహితీ ఆధారాల ద్వారా సాంఘిక చరిత్రను నిర్మించే సాహసోపేతమైన కృషి చేసిన విద్వాంసుడాయన. మూడవ వారు ఆదిరాజు వీరభద్రరావు. తెలంగాణలో తెలుగువారి తాలుకు పురాతన శిథిల స్మృతుల ఆధారంగా గతాన్ని అంచనా వేసిన షరాబు ఆయన. శేషాద్రి రమణ కవులు, సురవరం ప్రతాపరెడ్డిల వలెనే ఆదిరాజు వారు కూడా తెలంగాణ జనజీవితంతో మమేకమయ్యారు. పండిత మండలి మధ్య ''పండిత ఆదిరాజు వీరభద్రరావు'' అనే మన్ననలు పొందారు. సామాన్యమైన జీవితం, అసాధారణమైన పరిశోధనా తత్పరత ఆదిరాజువారి వ్యక్తిత్వ పాండిత్యాల్లో కన్పిస్తాయి. విజ్ఞాన సర్వస్వ రచనకు శ్రీకారం చుట్టిన నడిచే విజ్ఞాన సర్వస్వం కొమర్రాజు లక్ష్మణరావు శిష్యుడిగా పరిశోధనా ప్రస్థానాన్ని ఆరంభించిన ఆదిరాజు తన రచనల ద్వారా చిరస్మరణీయ ఘనతను సాధించుకున్నారు.

ఆనాటి తెలంగాణ సాంస్కృతిక పరిస్థితుల నేపథ్యంలో ఆదిరాజు గొప్పతనాన్ని అంచనాలోకి తీసుకోవాలి. 1920వ దశకం ఆరంభంలో ఆంధ్ర జనసంఘం అవతరించే వరకు తెలంగాణలో వాఙ్మయ పరిశోధన జరగలేదు. మరొక రకంగా చెబితే, వాఙ్మయ పరిశోధనా రంగమన్నది తెలంగాణ విద్వాంసులకు అప్పటికి అంతగా పరిచయం లేనిదే. ఆంధ్ర జనసంఘం తదనంతరం ఆంధ్ర పరిశోధకమండలి ఏర్పడడంతో చారిత్రక వాఙ్మయ శోధనలు పురుడు పోసుకున్నాయి. ఔత్సాహిక పరిశోధకులు తమ స్థాయిలో స్థానీయ పరిశోధనలు ఆరంభించారు. వీరికి సమన్వయ కర్తగా పెద్దదిక్కుగా నిలచిన వారు ఆదిరాజు వీరభద్రరావు. ఆంధ్ర పరిశోధక మండలి కొద్ది సంవత్సరాల పాటు ఎంతో చురుకుగా పనిచేసింది. దీని వెనుక ఆదిరాజు వారి బలమైన ప్రేరణ దాగి ఉంది. పరిశోధకులు ఛాయాకర్షక యంత్రములు (అంటే కెమెరాలు) కూడా తీసుకొని వెళ్ళి కొత్త అంశాల్ని వెలికి తీయాలని ఆంధ్ర పరిశోధక మండలి సూచించింది. ఇది 1920వ దశాబ్ది ఆరంభం నాటిమాట[1]. ఈ మేరకు నాటి తెనుగు పత్రికలో ప్రకటన కూడా వచ్చింది. వాఙ్మయ పరిశోధనలతో అంతగా పరిచయం లేకుండా ఉన్న రోజుల్లో ఆ కృషిని ఎంతో ముందుకు తీసుకొని పోయిన సమన్వయ కర్తగా, విద్వన్మూర్తిగా ఆదిరాజును గుర్తించాలి.

---

తెలుగులో తొలితరం పరిశోధకులు-జాతీయసదస్సు,
తెలుగుశాఖ, హైదరాబాదు విశ్వవిద్యాలయం-నవంబరు 7-9,2005

మరొక ముఖ్యాంశం నాటి పరిశోధకుల పరిస్థితి నిజాం ప్రభుత్వం పరిశోధనల కోసం అందులోనూ తెలుగు వాఙ్మయ శోధనల కోసం వెచ్చించిన పారితోషికాలు లేవు. పరిశోధకులే స్వయంశక్తితో స్వంత విత్తాన్ని ఖర్చుపెట్టి పరిశోధనలు కొనసాగించవలసిన స్థితి. పలువురు పండితులు స్వీయ వ్యయాన్ని భరించి శోధనలు చేశారు. వీరిలో ఆదిరాజు వారు మునుముందున్నారు.

కొమర్రాజువారి గురుత్వం లభించడం ఆదిరాజు అదృష్టం. హైదరాబాద్ నగరంలో ఆంధ్రోద్యమ శ్రీకార కేంద్రంగా అభివర్ణించదగిన శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయ స్థాపనలో కొమర్రాజుకు అక్షరాక్షరానుబంధం ఉంది. ఆ సంస్థకు ఆదిరాజు కొంతకాలంపాటు గౌరవ గ్రంథ పాలకులుగా పనిచేశారు. కొమర్రాజు నిర్వహణలోని విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి ద్వారా ఆదిరాజు పరిశోధక పాఠాలు నేర్చుకున్నారు. అప్పట్లో జనసంస్థ కేంద్రస్థానం చెన్నై (నాటి మదరాసు)లో ఉండేది. కొమర్రాజు పాండిత్యం వ్యక్తిత్వం ఆదిరాజు పై అపారమైన ప్రభావాన్ని వేశాయి. కొమర్రాజు రచనా శైలి ఆయనకు ఎంతగానో ఆకట్టుకుంది. చారిత్రక వ్యాసరచనల నేపథ్యంలో ఈ ప్రభావం సువిస్పష్టంగా కన్పిస్తుంది.

వీరభద్రరావు కొంతకాలం పాటు మద్రాసులో ఉన్నారు. 1914లో హైదరాబాద్ వచ్చారు. 1948 దాకా భాగ్యనగరంలోని చాదర్‌ఘాట్ హైస్కూల్‌లో బడిపంతులుగా పనిచేశారు. 1921 నవంబరు 21న జరిగిన ఒకానొక సమావేశంలో హైదరాబాద్‌లోని తెలుగువారికి తీవ్రమైన అవమానం జరిగింది. ఈ సాంస్కృతిక పరాభవం నుండి తేరుకొని ఇక్కడి తెలుగు పెద్దలు ఆంధ్ర జన సంఘాన్ని ఏర్పాటు చేసుకున్నారు. ఆంధ్ర జన సంఘం అవతరణ సమయంలో అందులో పాలు పంచుకున్న డజను మందిలో ఆదిరాజు ఒకరు. ఆంధ్ర జనసంఘం ఛత్రఛాయల్లో 1922లో ఆంధ్ర పరిశోధక మండలి ఆవిర్భవించింది. దీన్ని లక్ష్మణరాయ పరిశోధక మండలి అని కూడా వ్యవహరించారు. చరిత్ర పురాతత్వ విషయాల్లో వినూత్న విశేషాల్ని ఆవిష్కరించే సంకల్పంతో ఇది ఏర్పాటైంది. ఆదిరాజు ఈ సంస్థకు సుదీర్ఘ కాలంపాటు కార్యదర్శిగా ఉన్నారు. నామమాత్రపు కార్యదర్శిగా మిగిలిపోకుండా బృహత్తర కార్య దర్శనం చేశారు. 1935లో ఈ సంస్థ శాసన సంపుటిని ప్రచురించింది. ఆదిరాజు ఆంధ్ర పరిశోధక మండలికి నలభై సంవత్సరాలపాటు అవిశ్రాంతమైన సేవలు చేశారని ఖండవల్లి లక్ష్మీరంజనం శ్లాఘించారు[2].

సృజనాత్మక ప్రక్రియల్లో చూసినపుడు ఆదిరాజు వారు కొన్ని కథలు రచించారు. వాటి తాలూకు వివరాలు ఇప్పుడిప్పుడే బయటకు వస్తున్నాయి. జీవిత చరమాంక దశలోనూ పరిశోధనలపైపే ఆసక్తిని చూపిన ఆయన పలు చిరస్మరణీయమైన రచనలు

చేశారు. ఆయన మొత్తం పదకొండు పుస్తకాలు రచించారు. చిత్ర శాకున్తలము, తెలంగాణము, మన తెలంగాణము, ప్రాచీనాంధ్ర నగరములు, గ్రీకు పురాణ గాథలు, చైతన్యము, లలిత కథావళి, రత్నప్రభ, నవ్వుల పువ్వులు, జీవిత చరిత్రలు, మిఠాయి చెట్టు - ఈ రచనలు. వీటిలో కొన్ని త్వరిత గతిలో ద్వితీయ ముద్రణ పొందాయి.

ప్రాచీనాంధ్ర నగరాలు ఉత్తమ చారిత్రక రచన. ప్రసిద్ధ పురావస్తు శాస్త్రవేత్త పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు ఈ పుస్తకానికి ముందుమాట రాశారు. తెలుగు చారిత్రక సారస్వతాల పట్ల ఆదిరాజు వారికి గల అమితాభిమానాన్ని ఆయన ప్రశంసించారు. ఈ పుస్తకంలో రచయిత పన్నెండు తెలంగాణా ప్రాచీన నగరాల్ని ప్రస్తావించారు. అవి అలంపురం, ఆనగొంది, కళ్యాణి, కొండాపురము, కొలనుపాక, గోలకొండ, పానగల్లు, ప్రతిష్ఠానము, భోనగిరి, పేల్పుకొండ, వరంగల్. ఎటువంటి సిద్ధాంత వాద పరిమితులు, ప్రాంతీ రాగద్వేషాలు, అధ్యయనలోపాలు లేకుండా ఆయా నగరాల గతవైభవ విశేషాలు, వాటిలోని విశిష్టతల్ని రచయిత చక్కగా పరిచయం చేశారు. ఇది రెండు ముద్రణలు పొందింది. గోలకొండను గురించి రాస్తూ, ఈ దుర్గము పేరు వినగానే నిజాం రాష్ట్రీయులకు హర్ష విషాదములు ప్రబలిపోవును. అని వ్యాఖ్యానించడం ద్వారా ''అల్పాక్షరములలో అనల్పార్థ రచనా'' చారిత్రక వ్యాసాల్లోనూ సుసాధ్యమేనని నిరూపణ అవుతోంది. పానగల్లును గురించి తెలియజేసే సందర్భంలో పండితారాధ్య చరిత్రను ఉటంకించారు. ఇట్లా చరిత్ర పరిశోధకుడికి సాహిత్య విషయ పరిజ్ఞానం అనివార్యమైన అవసరమని చెప్పకనే చెప్పారు.

ఆదిరాజు కీర్తి భాండాగారంలో నిలిచిన మరో అమూల్య సంపద ''మన తెలంగాణం''. వివరణాత్మక నైపుణ్యం, పరిశోధనాత్మక దృక్పథం సమతూకంతో కలగలసిన రచన యిది. ఇందులో మొత్తం పది వ్యాసాలున్నాయి. ''కాకతీయ రాజవంశము'' ''కాకతీయ సాంఘిక చరిత్రము'' ''తాళపత్ర గ్రంథములు'' ''నాణెములు'' ''శాసనములు'' ''పాకాల సరస్సు'' ''దేవాలయములు'' ''గోలకొండ పట్టణము'' ''కెరమనుల కథ'' ''తెలంగాణము'' ఇవీ ఈ వ్యాసాలు; ప్రసిద్ధ రచయిత, సాంస్కృతికోద్యమ నిర్మాత వట్టికోట ఆళ్వార స్వామి నిర్వహించిన ''దేశోద్ధారక గ్రంథమండలి'' ఈ పుస్తకాన్ని ప్రచురించింది. ధనంజయ విజయ వ్యాయోగము, అర్థ చిత్ర మీమాంశ, ఆనంద మంగళము, శాల్మలీ కంద నందన విలాసము, దశరథ రాజనందన చరిత్రం, శ్రీకృష్ణ శతానందీయం, చిలువ పడిగరేణి పేరణం, తాలాంక నందినీ పరిణయం, ద్విపద రామాయణం, వరదరాజ రామాయణం, మధుర వాణీవిజయం వంటి పలు కావ్యాల్ని ఆయన వెలుగులోకి తీసుకొని వచ్చారు. ఇవన్నీ తాళపత్రాల రూపంలో ఉన్నవే. తెలంగాణయే తెలుగు వారి తొలి నివాస భూమి అన్నది ఆదిరాజు ప్రతిపాదన.

ఆదిరాజు వారు రచించిన షితాబుఖాను అను సీతాపతిరాజు పుస్తకం అనేక వినూత్న విషయాల్ని వెలుగులోకి తీసుకొని వచ్చింది. దీన్ని లక్ష్మణరాయ పరిశోధక మండలి ప్రచురించింది. ఈ పుస్తకానికి ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం చక్కని ఉపోద్ఘాతాన్ని అందించారు. సీతాపతిరాజుగా జన్మించి షితాబ్‌ఖాన్‌గా మారిన ఒక రాజు గాథ ఈ పుస్తకం. అతడు వివాదస్పదుడు. 1450 లలో జన్మించి 1500 ఆరంభంలో ఒక వెలుగు వెలిగాడు. షితాబుఖాను అను సీతాపతిరాజు ఖమ్మం, వరంగల్లు, నల్లగొండ, జిల్లాలను పరిశీలించాడు. వాస్తవానికి షితాబుఖాను గురించి ఎక్కువ మందికి తెలియదు. "ఇంగ్లీషు వచ్చిన విద్యాపకులకే ఈ విషయము కొత్తదిగా నుండెను. ఇక జనసామాన్యము విషయమును గూర్చి వేరుగనడుగవలయునా[3]" అని అన్నారు ఆదిరాజు. చరికొండ ధర్మన్న చిత్రభారతం, అద్దంకె గంగాధరకవి తపతీ సంవరణోపాఖ్యానం కుమార ధూర్జటి కృష్ణరాయ విజయం, ఇతర సారస్వత ఆధారాలు, శాసన పాఠాలు, చరిత్ర కారుల రచనలు, కైఫీయతుల్ని విశ్లేషించి షితాబుఖాను తొలుత సీతాపతిరాజేనని ఆదిరాజు నిర్ధారించారు.

తెలుగు విజ్ఞాన సర్వస్వ రచనల్లో పలు ప్రయత్నాలు జరిగాయి. సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశ రచన ఇందులో భాగం. హైదరాబాద్ సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశ సమితి తరపున విజ్ఞాన కోశ ప్రచురణ జరిగింది. విజ్ఞాన కోశంలో ఆదిరాజు పలు విలువైన వ్యాసాలు రచించారు. బహుముఖ ప్రజ్ఞాశీలిగా, ఉత్తమ పరిశోధకుడుగా ఆదిరాజు కీర్తిని నిలబెట్టేందుకు ఈ వ్యాసాలు కూడా తోడ్పడ్డాయి. అనంతపురం, ఖమ్మం, చిత్తూరు, నల్లగొండ, నిజామాబాద్, మహబూబ్‌నగర్, నెల్లూరు, మెదక్, వరంగల్, హైదరాబాద్ జిల్లాల భూగోళ స్వరూపాల్ని ఇతర అంశాల్ని గురించిన వ్యాసాలు, కొండాపురం, ఎలిఫెంటా గుహాలయాలు, కార్లే గుహాలయాలు, నాగార్జున కొండ, నేపాలు దేశ శిల్పకళ, మహబలిపురం, రామప్ప దేవాలయం, మోహంజొదారో, ఫణిగిరి తదితర చారిత్రక ప్రాముఖ్యత కలిగిన ప్రదేశాలపై చంద్రగుప్త పండరంగ అల్లూరి సీతారామరాజుల గురించిన చారిత్రక వ్యాసాలు, చైతన్య మహాప్రభువు, బౌద్ధ దేవతలపై తాత్విక వ్యాసాలు, ఆదిరాజు పరిశోధనా దృష్టినీ వివిధ విషయాలపై ఆయన లోతైన అవగాహనను వెల్లడిస్తున్నాయి.

ఆదిరాజు వారు పరిశోధనా రంగంలో అగ్రగామిగా ఉన్నరోజుల్లో, తెలంగాణలో జానపద విజ్ఞానం పై పెద్దగా దృష్టి ఏర్పడలేదు. ఆదిరాజు ఈ రంగంపై కూడా దృష్టి నిల్పారు. దేవులపల్లి రామానుజరావు సంపాదకత్వంలో వచ్చిన "శోభ" పత్రికలో "పల్లెపదాలు" శీర్షికలో ఒక వ్యాసాన్ని రాశారు. "కాళ్ళా గజ్జా కంకాళమ్మా చిట్టి చిట్టి మిరియాలు" వంటి పాటల్లోని కొన్ని కొత్త అంశాలను ఈ వ్యాసంలో విశ్లేషించారు.

పరిశోధనల పట్ల ఆదిరాజు ప్రోత్సాహదృష్టి అంతకంతకూ ఎదిగింది. 1950వ సంవత్సరంలో ఫిబ్రవరి 4,5,6 తేదీలలో తూపురాన్ ఆంధ్ర సారస్వత పరిషత్ కార్యక్రమాల్లో ఆదిరాజు చేసిన ప్రసంగం తీరుతెన్నులు అందుకు తార్కాణం. ఈ ప్రసంగాన్ని ''శోభ'' పత్రిక ప్రచురించింది. ''మన పురావస్తు పరిశోధనల వేగం పెరగాలి[5]'' అని ఆయన నొక్కి పలికారు. గోలకొండ పత్రికలో ఆయన ఎన్నో వ్యాసాలు రచించారు. అందుల్లో కొన్ని విలువైన పరిశోధనాత్మక రచనలున్నాయి. ''జంగం కథలు, కళాభిజ్ఞత, సమాగ సాన్నిహిత్యం'' అనే వ్యాసంలో ఆయన ''ప్రజాకవులు సృష్టించినదే గేయ వాఙ్మయము. పండితుల అభిమానాన్ని చూరగొనక పోయినప్పటికీ పామర జనాన్ని సులభంగా ఆకర్షించి వారిని విజ్ఞానవంతులుగా ఒనర్చుటకు ఎంతయో తోడ్పడును...[6]'' అని రాశారు ఆదిరాజు.

సర్కారు తరపున గానీ, ఇతరేతర సంపన్న సంస్థల నుండి కానీ ఎటువంటి ఉపకార వేతనాలు, భూరి పారితోషికాలను ఆశించకుండా పరిశోధనా యజ్ఞాన్ని నిర్వహించిన తొలితరం పరిశోధకులు ఆదిరాజు వీరభద్రరావు.

నిరుపేదగా 1890లో జన్మించి 1973 సెప్టెంబర్ 28వ తేదీన ఈ లోకాన్ని విడిచి వెళ్ళిన ఆ పరిశోధక తపస్వికి హైదరాబాద్ సాంస్కృతికోద్యమ వికాస చరిత్రలో ప్రత్యేక స్థానం ఉంటుంది. తిరుమల రామచంద్ర రాసినట్టు ''అర్ధ శతాబ్ది పై చిలుకు తెలంగాణా చరిత్ర తిరగవేస్తే సేవారంగంలో శ్రీ ఆదిరాజు వీరభద్రరావు గారు శ్రీ మాడపాటి హనుమంతరావుగారు కవలలుగా కనవస్తారు. మాడపాటి వారు సంఘసేవకు అంకితులై పోతే ఆదిరాజువారు సాహిత్యోద్యమానికి అంకితులయ్యారు. తెలంగాణా సాంస్కృతిక పునరుజ్జీవన చరిత్ర వారి చరిత్ర అంటేచాలు[7]''

''రావుగారు విజ్ఞాని - వ్యవహార చేతలందున భావాలందున పెద్ద - మాటలలో నేర్పరి - వక్త - ప్రవక్త - నేత - వ్రాతగాడు[8]'' అని ప్రసిద్ధ రచయిత్రి ఇల్లిందల సరస్వతీదేవి ''తేజోమూర్తులు''లో చేసిన వ్యాఖ్య సంపూర్ణ సత్యం.

*****

## సూచికలు

1. తెనుగు ( వారపత్రిక ) ; సంపాదకులు : బద్దిరాజు సోదరులు
2. షితాబుఖాను అనే సీతాపతిరాజు : ఆదిరాజు వీరభద్రరావు
3. షితాబుఖాను అనే సీతాపతిరాజు : ఆదిరాజు వీరభద్రరావు (పీఠిక)
4. తెలంగాణ పత్రికలు : జి. బాల శ్రీనివాసమూర్తి పుట 125
5. తెలంగాణ పత్రికలు : జి. బాల శ్రీనివాసమూర్తి పుట 124
6. తెలంగాణ పత్రికలు : జి. బాల శ్రీనివాసమూర్తి పుట 98
7. మరపురాని మనీషి (వ్యాస సంపుటి) : తిరుమల రామచంద్ర పుట 15, 17
8. తేజో మూర్తులు : ఇల్లిందల సరస్వతీ దేవి పుట 51.

# ఆచార్య శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనంగారు

- అమరేశం రాజేశ్వరశర్మ

''క్రియాసిద్ధిస్సత్త్వే భవతి మహతాం నోపకరణే'' అనే ఆర్యోక్తికి అచ్చమయిన తార్కాణం ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనంగారి ఆదర్శ జీవితం. పుట్టింది కోనసీమ అయితే పెరిగిందీ, పేరు సంపాదించిందీ తెలంగాణ మాగాణంలో. 12 సంవత్సరాల వయసులో తల్లిదండ్రులు వరంగల్లుకు మారగా వారితో పాటే లక్ష్మీరంజనంగారు కూడా వరంగల్లుకు వలసవచ్చినారు. 1924లో హనుమకొండ ప్రభుత్వ పాఠశాలనుండి హైస్కూలు విద్యను పూర్తి చేసుకొని హైదరాబాదులోని నిజాం కళాశాలలో ప్రవేశించి 1928లో మదరాసు విశ్వవిద్యాలయ పట్టభద్రులయినారు. ముందుగా కొంతకాలం ప్రభుత్వ పబ్లిక్ వర్క్సుశాఖలో గుమాస్తా ఉద్యోగం చేసినా అది తమ ప్రవృత్తికి తగినదిగా లేకపోవడంచేత సిటీ ప్రభుత్వ కళాశాలలో ఉపాధ్యాయులుగా చేరినారు. సిటీ కాలేజీలో హైస్కూలు తరగతులతో పాటు ఇంటర్మీడియట్ అంటే అప్పటి ఎఫ్.ఏ. తరగతులు కూడా ఉండేవి. ఉపాధ్యాయులుగా ఉద్యోగం చేస్తూనే 1936లో మదరాసు విశ్వవిద్యాలయం నుండి ఎం.ఏ. పరీక్ష ప్యాసయినారు. వెంటనే సిటీ కాలేజిలోనే తెలుగు లెక్చరరుగా ప్రమోషను లభించింది. మరికొంతకాలానికి సిటీ కాలేజి నుండి ఉస్మానియా విశ్వవిద్యాలయ కళాశాలలోని తెలుగు శాఖకు బదిలీ జరిగింది. అప్పుడు ఆచార్య రాయప్రోలు సుబ్బారావుగారు ఆంధ్రశాఖాధ్యక్షులుగా ఉండేవారు. 1946లో రాయప్రోలువారు వరంగల్లులోని విశ్వవిద్యాలయ కళాశాలకు ప్రిన్సిపాలుగా నియమితులు కావడంతో లక్ష్మీరంజనంగారు ఉస్మానియా విశ్వవిద్యాలయాంధ్రశాఖకు అధ్యక్షులుగా కార్యభారం వహించవలసి వచ్చింది. 1954లో లక్ష్మీరంజనంగారు రాయప్రోలువారి పదవీ విరమణం తరువాత ఆచార్య పదవి నధిష్ఠించి 1964వరకు ఉస్మానియా విశ్వవిద్యాలయం ఆంధ్రశాఖకు సారథ్యం వహించారు. పదవీ విరమణ తరువాత యూజీసీ ప్రొఫెసరుగా కొంతకాలమూ, ఎగ్జిక్యూటివ్ ఆఫీసరుగా మరికొంత కాలమూ ఆంధ్ర మహాభారత సంశోధిత గ్రంథ సంపాదక వర్గం అధ్యక్షులుగా బృహత్తర కార్యభారాన్ని ఆ గ్రంథం పూర్తి అయి ముద్రణకార్యం కూడా సమాప్తమయ్యే దాకా నిర్వహించినారు. ఇది వారి ఉద్యోగపర్వం.

లక్ష్మీరంజనంగారు ఉభయభాషా ప్రవీణులని ఒక గ్రంథంలో పేర్కొనబడింది. కాని అది సరికాదు. వారు భాషా చతుష్టయ ప్రవీణులు, సంస్కృత తెలుగులేకాదు, ఆంగ్లం ఉర్దూ కూడా వారికి సుపరిచితమయిన భాషలే. మదరాసు విశ్వవిద్యాలయం నుండి సర్వ ప్రథములుగా సంస్కృత భాషా సాహిత్యాలలో మార్కులు పొందినందుకు

---

రెండు బహుమతులు లభించినవట. మదరాసు బి.ఏ. అంటే ఆ రోజుల్లో మామూలు పరీక్షకాదు. ఎందరో మహామహులే ఆ పరీక్ష ప్యాసు కాలేకపోయిన వారున్నారు. హైదరాబాదు రాష్ట్రంలో లక్ష్మీరంజనంగారి హైస్కూలు విద్యాకాలంలో ఉర్దూ మీడియం మాత్రమే ఉండేది. కనుక వారిది హనుమకొండలో ఉర్దూ మీడియం చదువన్నమాట.

లక్ష్మీరంజనంగారు బహుముఖ ప్రజ్ఞాధురీణులు వారిది అమృతహస్తం, మనస్సు నిర్మలమయిందే కాదు కోమలమయింది కూడా. చేతనయితే ఉపకారం చేయడమేకాని శత్రువులకు కూడా అపకారం తలపెట్టని అమృత హృదయంవారిది. ఆకారం పొట్టిదే అయినా అంతరంగం ఉన్నతమయిందీ విశాలమయిందీ కూడా. మేధ అంతకంటే సునిశితమయింది. ఆయన విద్య నీటికొలది తామర. అందుకే అందరికది అంతుపట్టేది కాదు. దీనికి తోడు ఆయన నిరాడంబర వేషం చూచేవారిని బురిడీకొట్టించేది. ''నిండుమనంబు నవ్యనవనీత సమానము, పల్కు దారుణాఖండల శస్త్ర తుల్యము జగన్నుత విప్రులయం''దన్న నన్నయ మాట లక్ష్మీరంజనము గారియెడ అన్వర్థమయినది.

ఆయన బాల్యం గోదావరీ తీరంలో గడచింది కదా! గాలీ ప్రవాహం ఎదురుగా ఉన్నప్పుడు మోకులతో పడవలను లాగుకొని పోయేవారు పాడేపాట ''పట్టినపట్టు ఒదిల్తె ఒట్టు; జోర్సెయ్ బార్సెయ్'' అనేదాన్ని బాగా వినే ఉంటారు. లక్ష్మీరంజనంగారు ఆభావాన్ని బాగా ఒంటపట్టించుకొన్న లక్ష్యసాధకులు. అందువల్లనే పూర్వ మహానుభావులు ప్రారంభించిన పరిసమాప్తి నొందింపలేకపోయిన బృహత్తర కార్యాలను తాను ఒంటరిగా నిర్వహించి పూర్తి కావించినారు. ఆంధ్ర విశ్వవిద్యాలయంలో మహాభారత పరిష్కృత ప్రతిని తయారుచేయాలని సంకల్పించినారట. కాని అది ముందుకు సాగలేదు. లక్ష్మీరంజనంగారు దాన్ని సాధించినారు. అకారాదిగా ఆంధ్ర విజ్ఞాన సర్వస్వ నిర్మాణాన్ని కొమఱ్ఱాజువారూ, కాశీనాథునివారూ ప్రారంభించినారు కాని పూర్తికాలేదు. లక్ష్మీరంజనంగారు దాన్ని సాధించారు. మాడపాటి హనుమంతరావుగారు కళాశాల స్థాయిలో తెలుగును బోధన భాషగా ప్రవేశపెట్టినారు. కాని అదిముందుకు సాగలేదు.. లక్ష్మీరంజనంగారు అందుకై ప్రత్యేక కళాశాలనే ప్రారంభించి కార్యసాఫల్యాన్ని సాధించి ఇతరులకు మార్గదర్శకులయినారు. ఒక నడవని ప్రాథమిక పాఠశాల నిర్వహణాన్ని తమ అధీనంలోకి తెచ్చుకొని ఉన్నత పాఠశాలగా తీర్చి దిద్దినారు. తెలుగు ప్రాచ్య కళాశాలా స్థాపనంలోను నిర్వహణంలోను తెలంగాణంలో వారిదే అగ్రతాంబూలం. ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ప్రాచ్య పట్టపరీక్ష లారంభించడానికీ కళాశాలాస్థాయిలో తెలుగును తప్పనిసరి పాఠ్యంగా ప్రవేశపెట్టడానికీ లక్ష్మీరంజనంగారి కృషి

సామాన్యయిందేమీ కాదు. రాయప్రోలు వారు 27సంవత్సరాలు ఆంధ్ర శాఖాధ్యక్షులుగా ఉండి ఒకరినో ఇద్దరినో ఎమ్.ఏ. పట్టభద్రులను చేసినారు. లక్ష్మీరంజనంగారు తెలుగులో ఎమ్.ఏ. పట్టభద్రులను చేసిన వారి సంఖ్య వందలలోనికి వచ్చింది. వారే తెలుగులో పరిశోధన విభాగాన్ని ప్రారంభించినారు. అందులోనూ విజయం సాధించినారు.

లక్ష్మీరంజనంగారి పరిశోధన ఐదు విధాలుగా సాగినట్లు మనం గమనించవచ్చు.

1. వివిధ పత్రికలలోను ప్రత్యేక సంచికలలోను ప్రకటితమయిన వ్యాసాలు
2. విమర్శ గ్రంథాలు
3. పూర్వ గ్రంథాలను పరిష్కరించి ప్రకటించడం
4. వివిధ గ్రంథాలకు వారు వ్రాసిన పీఠికలు
5. పరిశోధన సిద్ధాంత వ్యాసాల పర్యవేక్షణ

వీటిలో ఒక్కొక్కదాన్నే తీసికొని పరిశీలిద్దాం

1. పత్రికలలోను సంచికలలోను వచ్చిన వ్యాసాలు: లక్ష్మీరంజనంగారి వ్యాసాలు భారతి మాసపత్రికలో ఎక్కువగా ప్రకటితమయినవి. 1945లో ''దశభీ రాజభిస్సహ యుద్ధం..... సాయణ భాష్యం'' అనే వ్యాసం ప్రకటితమయిందట. పాటిబండ మాధవశర్మగారి షష్టి పూర్తి సంచిక, శాంతి, సాహితీవాల్లభ్యం, గురజాడ శత జయంతి సంచిక ఉస్మానియా విశ్వవిద్యాలయ స్వర్ణోత్సవ సంచిక, పరిశోధన సంగ్రహాంధ్ర విజ్ఞానకోశం మొదలయిన వాటిలో అనేక సాహిత్య సాంస్కృతిక చారిత్రకాంశాలపై వారి పరిశోధన వ్యాసాలు ప్రకటితములయినవి.

2. విమర్శ గ్రంథాలు : తెలుగుదుక్కి, ఆంధ్ర సాహిత్య చరిత్ర సంగ్రహం, ఆంధ్రుల చరిత్ర సంస్కృతి, లక్ష్మీరంజన వ్యాసావళి, Spot Lights on Telugu. ఇవీ వారు రచించిన గ్రంథాలు. వీటిలో తెనుగు దుక్కి ముందుగా వచ్చిన వ్యాసరచనల సంపుటి. ఆంధ్రసాహిత్య చరిత్ర సంగ్రహము, ఆంధ్రులచరిత్ర, సంస్కృతి తెలుగు బి.ఏ., ఎమ్.ఏ. విద్యార్థుల కోసం వ్రాయబడిన గ్రంథాలు. చరిత్ర – సంస్కృతి రచనలో లక్ష్మీరంజనంగారి సోదరులు బాలేందు శేఖరంగారు కూడ పాలు పంచుకొన్నారు. ఆంధ్ర సాహిత్య చరిత్ర సంగ్రహానికి పూర్వమే కొన్ని తెలుగు సాహిత్య చరిత్ర గ్రంథాలు వచ్చినప్పటికీ, లక్ష్మీరంజనంగారి గ్రంథంలో అనేక కొత్త అధ్యాయాలు చోటుచేసుకొన్న అంశాన్ని మనం గమనించవలసి వున్నది. లక్ష్మీరంజన వ్యాసావళి వారి షష్టి పూర్తి సందర్భంలో ప్రకటితమయిన వ్యాస సంపుటి. దీనిని గూర్చి ''వీరనేక తరుణ కోవిద కోరకములను పరిణత పరిశోధక సురభిళ ప్రసూనములుగా తీర్చిదిద్దిన మహనీయులు. పలువురిచే పలు విషయములపై పరిశోధనలు జరిపించిన వీరి అనుభవ పరిణాహము,

వివిధ విషయ పరిజ్ఞానము ఈ సంపుటిలోని 21 వ్యాసములలోను ప్రస్ఫుటముగా కనిపిస్తాయి'' (మహతిలోనివారి వ్యాసము) అని ఆచార్య యస్వీ జోగారావుగారు చేసిన ప్రశంస. Spot Lights on Telugu అనే వ్యాస సంపుటిలో లక్ష్మీరంజనముగారు వివిధ సందర్భములలో వ్రాసిన 13 ఆంగ్ల వ్యాసములున్నవి. ఇది కూడా వారి షష్టిపూర్తి సమయంలో ప్రకటించిన గ్రంథమే. పై జోగారావుగారి ప్రశంస ఈ వ్యాసములకు గూడా వర్తిస్తుంది. ఆంధ్రుల చరిత్ర - సంస్కృతిని గూర్చి ఆంధ్ర పితామహ మాడపాటి హనుమంతరావుగారు ''సమగ్రమైన ఆంధ్రుల చరిత్ర యొకటి మన భాషలో ఇప్పటి వరకు లేనిలోపము... ఈ రచన వలన తీరుచున్న''దని రచించినారు. (ప్రథమ ముద్రణలోని వారి ఆశీస్సులు) మారేమండ రామారావు గారుకూడా ఈ గ్రంథాన్ని ప్రశంసించినారు.

3. గ్రంథ పరిష్కరణము : ఈ విభాగంలో లక్ష్మీరంజనం గారి మొట్టమొదటి గ్రంథము కాసె సర్వప్ప సిద్దేశ్వర చరిత్రము. ఇది కాకతీయ రాజుల చరిత్రను వివరించే పూర్వగ్రంథము. దీనినిండా అభూత కల్పనలున్నవనీ, కనుక ప్రమాణముగా స్వీకరింపదగినది కాదనీ కొందరు పరిశోధకుల అభిప్రాయం. లక్ష్మీరంజనంగారు ఇందులోని చారిత్రకాంశాలను పూర్తిగా కొట్టివేయరాదనీ ఇందులోని విషయాలను ఇతరాధారాలతో సరిపోల్చి నిగ్గు తేల్చవలెననీ అభిప్రాయపడి అముద్రితంగా ఎక్కడనో తలదాచుకొంటున్న గ్రంథానికి ప్రతి వ్రాయించి తెప్పించి పరిష్కరించి ముద్రించడమే కాక విపులమయిన పీఠికలో దీనిలోని చారిత్రకాంశాలను శాసనాధారములతో సహా వివరించినారు. ఈ గ్రంథ పరిష్కరణలో నాకూ మా సహాధ్యాయి ఆచార్య సుప్రసన్నకూ కూడా మా గురువుగారు పాలు పంచుకొనే అవకాశాన్ని కల్పించినారు. అదీ వారి శిష్యవాత్సల్యము. దీనిలోని నా కృషికి మెచ్చుకోలుగానే మా గురువుగారు నా చేత కవిశిరోభూషణ గ్రంథాన్ని పరిష్కరింపజేసి ఆంధ్ర వివరణంతో సహా ప్రకటించినారని నేను భావిస్తున్నాను. వారిచొరవ లేకపోతే అహోబలపండితీయానికి ఆంధ్రవ్యాఖ్య వ్రాసిన కీర్తి నాకు దక్కి ఉండేది కాదు. అది అయిదు సంవత్సరాలు సాగిన కృషి. వారి పర్యవేక్షణ ఏవిధంగా ఉండేదీ నాకు తెలియజేసిన గ్రంథమిది.

శ్రీ లక్ష్మీరంజనంగారు నాకు పూర్తి స్వేచ్ఛనిచ్చినారు. కాని యేది వ్రాసినా సహేతుకంగా ఉండాలనేది వారి నిశ్చితాభిప్రాయం. ఒకచోట మల్లినాథ మహోపాధ్యాయులు ప్రమాదానికి గురియైన విషయాన్ని నేను ఎత్తి చూపినాను. వారు దాన్ని అంగీకరించడానికి నేను వ్యాకరణ పండితులు శ్రీ ఖండవల్లి నరసింహశాస్త్రి గారిని తీసికొని వచ్చి వారిచేత చెప్పించవలసి వచ్చింది. తాము పట్టిన కుందేటికి

ాడే కాళ్లని వాదించేతత్త్వం లక్ష్మీరంజనంగారిది కాదు. హేతు బద్ధంగా ఉంటే ఎదుటి
రి అభిప్రాయాన్ని అంగీకరించ గలిగిన సహృదయులు వారు.

ఆంధ్ర మహాభారత పరిష్కరణ కార్యమొక మహాయజ్ఞం. సుమారు పది
ంవత్సరాలు సాగిన దీర్ఘ సత్రమిది. ఋత్విక్కులు చాలా మంది మారినారు. దీనికి
హ్మ లక్ష్మీరంజనంగారు. ఆచార్యులు దివాకర్ల వెంకటావధాని గారు. సదసస్పతులు
ళ్ళపల్లి అనంతకృష్ణశర్మ, వెంపరాల సూర్యనారాయణశాస్త్రి, దీపాల పిచ్చయశాస్త్రి
రలు. కడమ మాబోంట్లు అందుబాటులో ఎవరుంటే వారు ఋత్విజులు. నేను
ది పర్వ పరిష్కరణలో పాల్గొనే భాగ్యం లభించింది. దానికి పూర్వరంగ కార్య
ముంలోనూ నాకు అవకాశం లభించింది. అయితే మాగురువుగారు అప్పటికే
లస్యమయి పోయిన నా సిద్ధాంత గ్రంథాన్ని పూర్తి చేయమని ఆదేశించినారు.
ందువలన తరువాతి కాలంలో నాకు ఆ పరిష్కరణలో పాలుపంచుకొనే
ఖులేకపోయింది. ఒకటి రెండు పాఠాలను గూర్చి యిక్కడ చెప్పాలని ఉన్నది.

''అమల సువర్ణ శృంగఖురమై కపిలంబగుగో శతంబును
త్తమ బహు వేదవిప్రులకు దానము చేసిన తత్ఫలంబు''

అను పద్య పాఠ పరిష్కారం జరుగుతున్నది. ''ఉత్తమ బహువేదదిప్రులకు''
పాఠం చాలా ప్రతుల్లో ఉన్నది. కాని ఒకదానిలో ''ఉత్తములగు పేద విప్రులకు''
నే పాఠం కనిపించింది. ఇదే నన్నయగారి పాఠం అయి ఉంటుందని నా
భిప్రాయం. ''వేదపాఠేన విప్రత్వం'' అని వేదం చదువు కొన్నవాడయితేనే విప్రుడౌతాడు
బహువేదవిప్రుడు''సమాసం ఎట్లా? పైగా బ్రాహ్మణుడు పేదవాడు కావడం అతనికి
ప్రత్వం కల్పిస్తుందనేది స్మృతి పురాణాదులు చెప్పుతున్న సత్యం. ''ఉత్తములగు
దవిప్రులు'' అనేదే నన్నయ శైలి కనుకూలమయిన రచనగా నాకు కనిపిస్తున్నది.
యితే బహువేద విప్రులనేదే అనేక ప్రతుల్లో ఉన్నపాఠం. కనుక అంగీకృతమయింది.
నయితే పాఠాన్ని మార్చి ఉండేవాడిని.

మరోచోట ఏకలవ్యోపాఖ్యానంలో ఏకలవ్యుడు ద్రోణునితో
''ఇదె దేహం బిదె యర్థం బిదె నా పరిజన సమూహము''

అని అవధారణార్థకమయిన 'ఎ'తో సంధి వచ్చిన 'ఇదె' అనేరూపంచాల
ఠాలలో వున్నది. కాని కొన్నింటిలో ''ఇది దేహంబిది యర్థంమిద నా పరిజన
మూహము'' అని అవధారణార్థకం లేకుండా పాఠం వున్నది. మూలంలో
వధారణార్థకం లేదు. దాని అవసరమూ కానరాదు. పైగా నన్నయ భారతంలో

అవధారణార్థకం 'అ' అనేదే కాని 'ఎ' కాని 'ఏ' కాని లేదు. తిక్కన నాటికది యేర్పడింది. అంతేకాదు. ఇది+అ = ఇదియ అని సంధిరహితంగా ప్రయోగించడమే నన్నయ నాటి భాషా సంప్రదాయం. కనుక "ఇది దేహం బిది యర్థం బిది. నా పరిజన సమూహము" అనేదే నన్నయ పాఠమని నా వాదన. కాని యెక్కువ ప్రతుల్లో ఉన్నదన్న కారణంగా అవధారణార్థకంతో వున్న పాఠమే అంగీకృతమయింది. అవధారణార్థక రహితం పాఠాంతరంగా చూపబడింది.

ఈ పాఠ నిర్ణయంలో కొందరు పెద్దలతో నాకభిప్రాయ భేదం యేర్పడింది. గ్రంథకర్త హృదయాన్ని గుర్తించవలెనని నా వాదం. బహు ప్రతుల పాఠం ప్రమాణమని వారి అభిప్రాయం అన్నిచోట్ల అదే మానదండం కారాదని నా అభిప్రాయం. అభిప్రాయ భేదాలకేమి కాని మహాభారత పరిష్కరణ మొక మహాయజ్ఞం. దానిని కడముట్టించిన ఘనత మా గురువుగారిదే.

4. పీఠికలు : సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశం ప్రథమ సంపుటానికి లక్ష్మీరంజనం గారు వ్రాసిన 'నివేదన వాక్యములు' అను పేరుతో ఉన్న పీఠిక వివిధ భాషలలో నిర్మాతమయిన విజ్ఞాన సర్వస్వ నిర్మాణాలను గూర్చిన పరిశోధన వ్యాసం. కవిశిరో భూషణానికి లక్ష్మీరంజనంగారు ఆంగ్లంలో వ్రాసిన పరిచయం కవిశిరో భూషణాన్ని గూర్చి మాత్రమే కాక చింతామణి సూత్రాలు అనేక కాలాలలో అనేక పండితుల నోళ్లలో నలిగి నలిగి గ్రంథరూపము తాల్చియుండునన్న అభిప్రాయమును ప్రకటించిరి. సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశము చివరి సంపుటపు పీఠిక అవభృథములో విజ్ఞాన సర్వస్వ నిర్మాణ భావికార్యక్రమమేవిధముగా ఉండవలెనో నిర్దేశించిన లక్ష్మీరంజనము గారి దూర దృష్టి శ్లాఘాపాత్రమనుటలో సందేహము లేదు. కాని అది కార్యరూపము తాల్చ లేదనుట మాత్రము చింతాజనకమయిన అంశమే. ఆంధ్ర మహాభారతము వివిధ సంపుటములకు తామేకాక యితర పండితులచేత గూడ వివిధాంశముల పై విమర్శాత్మకములయిన పీఠికలను రచింపజేసి ప్రకటించినారు లక్ష్మీరంజనముగారు. వారు తాము మాత్రమే కాదు. ఇతరులు కూడ బాగుపడవలెనని కోరే ఉదార స్వభావము కలవారు. వారి హయాములో ఎమ్.ఏ. విద్యార్థుల చేత వ్యాసములు వ్రాయించి సెమినార్లుగా నిర్వహించిన కార్యక్రమాలలో మంచి విమర్శవ్యాసములు రావడమే కాక అవి పండితుల ఆమోదమును పొందిన విషయము ఇక్కడ స్మరింపదగినది. విద్యార్థులకు తర్ఫీదు నిచ్చుచునే వారిచేత శ్రీ లక్ష్మీరంజనముగారు శ్రీనాథ పద ప్రయోగకోశమును సిద్ధముచేయించిరి. ఏ కార్యక్రమయినా సంకల్పించుటలోను దానిని నిర్విఘ్నముగా నిర్వహించుటలోను సిద్ధహస్తులు లక్ష్మీరంజనముగారు.

5. పరిశోధన సిద్ధాంత వ్యాసాల పర్యవేక్షణ : ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగుశాఖలో పిహెచ్.డి. పట్టంకోసం పరిశోధన కార్యక్రమం ప్రారంభించిందే లక్ష్మీరంజనంగారు. వారి పర్యవేక్షణలో హేమాహేమీలు ఎందరో తమ పరిశోధనను కొనసాగించి డాక్టరేటు పట్టాలు సంపాదించినారు. బి. రామరాజుగారు తెలుగు జానపద వాఙ్మయం అనే అంశం మీద ప్రామాణికమైన సిద్ధాంత గ్రంథం వ్రాసి విశ్వవిద్యాలయం తెలుగుశాఖలో మొట్టమొదటి పిహెచ్.డి. పట్టభద్రులయినారు. ఆ వెంటనే దివాకర్ల వెంకటావధానిగారు ''ప్రాఙ్నన్నయ యుగము నన్నయభారతము'' అను విషయం మీద సిద్ధాంత గ్రంథాన్ని వ్రాసి డాక్టరేట్ పట్టా పుచ్చుకొన్నారు. 1959లో పల్లాదుర్గయ్యగారు 16వ శతాబ్దియందలి ప్రబంధ వాఙ్మయాన్ని గూర్చి సిద్ధాంతవ్యాసం సమర్పించి పిహెచ్.డి. పట్టా పొందినారు. ఆ మరుసటి సంవత్సరమే పోణంగి శ్రీరామ అప్పారావుగారు తెలుగు నాటకము-అవతరణము-వికాసము అనే సిద్ధాంత వ్యాసానికి పిహెచ్.డి. పట్టా సంపాదించినారు. ఆధునికాంధ్ర కవిత్వంలో సంప్రదాయము -ప్రయోగము అనే సిద్ధాంతవ్యాసం 1962లో సి.నారాయణరెడ్డిగారు వ్రాసి పిహెచ్.డి. పట్టా పుచ్చుకొన్నారు. ఆ సంవత్సరమే బి.వి.కుటుంబరాయ శర్మగారి ఆంధ్రనవలా సాహిత్య పరిణామము అనే సిద్ధాంతవ్యాసము పిహెచ్.డి. పట్టాకు అర్హముగా నిర్ణయించ బడింది. 1965లో అరిపిరాల విశ్వంగారు ఆధునిక కవిత్వము నందలి మానవుడు -ప్రకృతి అనే విషయం మీద పిహెచ్.డి. పట్టా సంపాదించినారు. ''విజయనగర యుగమునందలి ఆంధ్రవాఙ్మయముపై - ప్రధానంగా తాళ్లపాక కవులపై - వైష్ణవ ప్రభావము'' అనే అంశంపై వేటూరి ఆనందమూర్తిగారు పిహెచ్.డి. పట్టాను 1966లో పుచ్చుకొన్నారు. తెలుగు జానపద గేయగాథల మీద నాయని కృష్ణకుమారిగారి పిహెచ్.డి. సిద్ధాంత వ్యాసం 1970లో వచ్చింది. ఆంధ్రవ్యాకరణ వికాసం అనే అంశంమీద నా పిహెచ్.డి. సిద్ధాంతవ్యాసం 1971లో వచ్చింది. ఈ సిద్ధాంత గ్రంథాలన్నీ ముద్రితాలు కావడమే కాక ఆయా విషయాల మీద ప్రామాణిక గ్రంథాలుగా పేరు సంపాదించడం గమనార్హమయిన విషయం. లక్ష్మీరంజనంగారి దగ్గర చిట్టచివరగా పిహెచ్.డి. పట్టాకోసం సిద్ధాంతవ్యాసాన్ని సమర్పించినవారు కొకుంట్ల రామకృష్ణశర్మగారు. తెలుగు క్రియాపదాల మీద వారి పరిశోధన సాగింది.

''ఆంధ్ర చరిత్ర భూగోళ సర్వస్వం'' అనే పేరుతో శ్రీ లక్ష్మీరంజనంగారు మరో విజ్ఞా సర్వస్వమును ప్రారంభించి మూడు సంపుటములను ప్రకటించినారు. అది పూర్తికాక మిగిలినపోయిన వారి చివర ప్రాజెక్టు.

ఆచార్య లక్ష్మీరంజనంగారు అచ్చమయిన కర్మయోగి. ఆయన ఆరోగ్యం

అంతంతమాత్రమయిందే. అయినా ఆయన కృషికి అది అంతరాయం కలిగించలేదు. ఆర్థికంగా ఆయన ధనవంతుడు కాదు. అయినా ఆయన కార్యక్రమాలేవీ ధనంలేక ఆగిపోలేదు. నిజ జీవితంలోను దైన్యమనేది దరిదాపులకు రానీయని గంభీర స్వభావం ఆయనది.

ఆ మహామనీషిని గూర్చి యీవ్యాసం వ్రాసే భాగ్యం కలిగించినందులకు నేను నిర్వాహకులకు ప్రధానంగా ఆచార్య పరిమి రామనరసింహంగారికి కృతజ్ఞతను తెలుపుతున్నాను.

*****

శైవవాఙ్మయ పరిశోధకుడు -

# బండారు తమ్మయ్య

- ఆచార్య ఎస్వీ రామారావు

శైవ వాఙ్మయ పరిశోధకులుగా, విమర్శకులుగా ప్రసిద్ధి గడించిన మహాను భావులు బండారు తమ్మయ్యగారు. శివకవుల కావ్యాలను వెలుగులోకి తెచ్చి అపరిమితమైన పరిశోధనోత్సాహాన్ని ప్రదర్శించిన శైవవాఙ్మయ సేవాపరులు వారు. శివకవుల గురించి, శైవమతాన్ని గురించి సాధికారికమైన, ప్రామాణికమైన రచనలు వెలువరించారు. అందుచేతనే "He is an authority on what he writes" అని గిడుగు రామమూర్తి గారి ప్రశంసలను అందుకొన్నారు.

1914 లో కృష్ణా పత్రికలో వ్యాస రచనతో (నాచన సోమన, రఘునాథ రాయలు మొ॥) వారి సాహితీ వ్యాసంగం ప్రారంభమైంది. ఆంధ్ర పత్రిక ఉగాది సంచికలో పాల్కురికి సోమన పై వెలువరించిన వ్యాసం (1922) ఆ మహాకవిపై తమ్మయ్యగారి పరిశోధనకు శ్రీకారం చుట్టింది. వారి సూచనల ననుసరించి కాశీనాథుని నాగేశ్వరరావు గారు బసవపురాణం (1929), పండితారాధ్య చరిత్ర (1941) లను ముద్రింపజేశారు. అయితే - వాటి పీఠికలలో వేటూరి ప్రభాకర శాస్త్రిగారు, చిలుకూరి నారాయణరావుగారు వెలిబుచ్చిన అభిప్రాయాలతో తమ్మయ్యగారు ఏకీభవించలేదు. వాటితో పాటు వేదము వేంకటకృష్ణశర్మ 'శతక వాఙ్మయ సర్వస్వము' లోని అభిప్రాయాలను కూడా ఖండిస్తూ 'త్రిలింగ' పత్రికలో వ్యాసం వ్రాశారు. పాల్కురికి సోమనాథుడు మొదటి ప్రతాపరుద్రుని కాలానికి చెందినవాడని నిర్ధారిస్తూ 'పరిశోధన' పత్రికలో మరొక వ్యాసం వెలువరించారు.

ఈ పరిశోధనానుభవంతో 1948లో వెలువరించిన 'పాలకురికి సోమనాథకవి' ఆ మహాకవిపై ఏకైక విమర్శనా గ్రంథంగా పేర్కొనదగింది. సోమనాథుని జీవిత, కవిత్వ విశేషాలు ఇందులో శాస్త్రీయ పద్ధతిలో సహేతుకంగా పరామర్శితమైనాయి. సమకాలీన పండిత పరిశోధకులు భావించినట్లుగా సోమన ఆరాధ్య బ్రాహ్మణుడు కాడని, వీర శైవ జంగమ కులానికి చెందినవాడని, రెండవ ప్రతాప రుద్రుని కాలంలో జీవించాడని ఆయన నిరూపించారు. అనంతరకాలంలో సోమన కృతులపై పిహెచ్.డి. పరిశోధన సల్పిన కీ.శే. వేనరెడ్డి (చేతనావర్తన కవి) కూడా తమ్మయ్య గారి అభిప్రాయాలనే నిర్ధారించాడంటే ఆయన నిశిత పరిశీలనా దృష్టి ద్యోతకమవుతుంది. ప్రఖ్యాత విమర్శకుడైన కట్టమంచి రామలింగారెడ్డిగారు "Your great book 'Palkuriki Somanatha Kavi' is by far the best book on one of our greatest poets." అని ఈ గ్రంథాన్ని ప్రశంసించారు. సికింద్రాబాదు శివధర్మ గ్రంథమాల వారు ప్రచురించిన

---

ఈ గ్రంథం 1956 లో ద్వితీయ ముద్రణ పొంది విశ్వవిద్యాలయ స్థాయిలో పాఠ్య గ్రంథంగా గణన కెక్కింది.

వీరశైవ మత ప్రవర్తకుడైన బసవేశ్వరుని సిద్ధాంతాలకు పాల్కురికి సోమన భాష్యకారునిగా ప్రసిద్ధి గడించినట్లుగా సోమన వాఙ్మయానికి వ్యాఖ్యాతగా తమ్మయ్య వినుతికెక్కారు. వారి పరిశోధనా ప్రతిభను గుర్తించిన వావిళ్ళ వారు బసవపురాణం, అనుభవసారం కృతులను ఆయన పరిష్కరణ తో ముద్రించారు. చతుర్వేదసారం, సోమన లఘుకృతులు కూడా ఆయన పరిష్కరణలోనే (1965) ప్రచురితమైనాయి. వృషాధిప శతకానికి హృద్యమైన టీకను (1969) కూడా ఆయన వెలువరించారు.

సోమనాథునిపై ఎంత అభినివేశమో, శ్రీనాథునిపై కూడా ఆయనకు అంతే అభిమానం. ''శ్రీనాథమహాకవి తరువాత నన్ను మిక్కిలిగా ఆకర్షించిన కవి పాలకురికి సోమనాథుడు'' అని స్వీయచరిత్ర (పు.50)లో పేర్కొన్నారు. వేటూరి ప్రభాకరశాస్త్రి 'శృంగార శ్రీనాథము' (1923)లోని అభిప్రాయాలను విమర్శిస్తూ 'సారస్వత సర్వస్వం' పత్రికలో వ్యాసం వెలువరించిన (1924) తమ్మయ్యగారు తర్వాత 'రెడ్డి సంచిక'లో (1938) శ్రీనాథునిపై విపులమైన పరిశోధనా వ్యాసం ప్రచురించారు. ఈ వ్యాసాలే విస్తృతరూపాన్ని పొంది 'శ్రీనాథ మహాకవి' పేరుతో (1968) రాష్ట్ర సాహిత్య అకాడమీ ఆర్థిక సాయంతో ప్రకటితమైనాయి.

శ్రీనాథుని జీవిత విశేషములు, వైదుష్యము, రసజ్ఞత, మతము, శీలము, కవిత్వము, ఛందోవ్యాకరణ విశేషములు మొ॥ శీర్షికలతో కూడిన ఈ గ్రంథంలో కవిసార్వభౌముని కవిత్వంలో ప్రధానగుణం 'సరసత్వము' (వక్రత, ధ్వని) అని తమ్మయ్య ప్రతిపాదించారు. ''శ్రీనాథునిపై వెలువడిన సమగ్ర గ్రంథం ఇది ఒకటియే'' అని భారతి పత్రికా సమీక్ష (1968 డిసెంబర్) ప్రశంసించింది. శ్రీనాథుని శివభక్తి తత్పరతను చాటిన ఈ గ్రంథం అతడు శృంగారి అన్న వాదం మళ్లీ తలెత్తకుండా చేసిందని నిడదవోలు వెంకటరావు గారు దీని పీఠికలో పేర్కొన్నారు. శ్రీనాథుని భీమేశ్వర పురాణం, క్రీడాభిరామం కూడా బండారు తమ్మయ్య పరిష్కరణలో వావిళ్ళవారు ప్రచురించారు.

తమ్మయ్య విశిష్ట విమర్శ పంథకు మరొక నిదర్శనం 'వేమన చరిత్ర' (1970). రెడ్డి రాణి పత్రికలో వెలువడిన (1932-34) వ్యాసాల విస్తృతరూపమైన ఈ గ్రంథానికి రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మ పీఠికను సమకూర్చారు. చరిత్రాంశములతో పాటు వేమన కవితా వైశిష్ట్యం వివరించిన ఈ గ్రంథంలో వేమన వీరశైవుడని తమ్మయ్య ప్రతిపాదించారు.

సమకాలీన పత్రికలో - ఆంధ్ర సాహిత్య పరిషత్ పత్రిక, కళ, సమదర్శిని, విభూతి, శ్రీశైల ప్రభ మున్నగు వాటిలో వెలువరించిన పరిశోధనాత్మక - విమర్శనా

త్మక వ్యాసాలు 21 'వ్యాసావళి' పేరుతో రెండు భాగాలుగా (1968, 69) ప్రకటిత మైనాయి. ''వీరి వ్యాసములు పరిశోధనమునకు పట్టుగొమ్మలు. పాండిత్యమునకు పాథోనిధులు. విజ్ఞానమునకు నిధులు'' అని దివాకర్ల వెంకటావధాని ఉగ్గడించారు. తమ్మయ్య గారు తాను పరిష్కరించిన కావ్యాలకూ, ఇతరుల పరిశోధన రచనలకూ విశి ష్టమైన పీఠికలు సమకూర్చారు. వానిలో తొమ్మిది పీఠికలను 'బండారు తమ్మయ్య పీఠికలు' పేరుతో (1990) తెలుగు విశ్వవిద్యాలయం వారు ఆయన శతజయంతి సందర్భంలో ప్రకటించారు.

తమ్మయ్యగారు స్వయంకృషితో సంస్కృత, కన్నడ భాషలు కూడా అభ్య సించి వాటిలో పాండిత్యం గడించారు. కాళిదాస మహాకవి కావ్యాలను వచన రూపంలో ఆంధ్రీకరించారు. రఘువంశ కథనము (1930), కుమార సంభవము (1965) నిర్దుష్టము, శ్రవణ సుభగము అయిన గద్యశైలితో కూడి పాఠ్యగ్రంథాలుగా ప్రశస్తి కెక్కాయి. వీరశైవ తత్త్వావగాహన కొరకు కన్నడ సాహిత్యాన్ని అధ్యయనం చేసి తమ అనువాద రచనల ద్వారా శైవమతతత్త్వాన్ని సువిదితం కావించారు. వారణాసి జంగమ మఠం ప్రచురణ అయిన 'శక్తివిశిష్టాద్వైతము' వీరశైవమత స్వరూపాన్ని విశదం చేస్తుంది. ఇంకా 'వీరశైవ దర్శనము (1959)', 'ఆంధ్ర వీరశైవ వివాహవిధి' అన్న గ్రంథాలు కూడా కన్నడం నుంచి తెనిగించారు. సంస్కృతంలో విరచితమైన మలయరాజస్త వము, శ్రీశైల మల్లికార్జున స్తవములను ఆంధ్రీకరించారు. బసవ పురాణం, పండితా రాధ్యచరిత్ర, ప్రభులింగ లీలలు ఆధారంగా 'మడివాలు మాచయ్య చరిత్రము' (1969) వెలువరించారు. ఈ విధంగా ''శైవసారస్వత సిద్ధాంత సారవత్సంపదకు సార్వభౌమ పట్టము కట్టుకొన్నవారు తమ్మయ్యగారు'' (దివాకర్ల).

బండారు తమ్మయ్య తూర్పు గోదావరి జిల్లా గంగలకుర్తి అగ్రహార వాస్తవ్యులు. 1981 సెప్టెంబర్ 24వ తేదీన అమలాపురం లోని మాతామహుల ఇంట్లో జన్మించారు. వ్యవసాయ వృత్తిపరులైన లింగబలిజ కుటుంబీకులు - చిట్టెమ్మ, లింగయ్య ఆయన తల్లిదండ్రులు. తండ్రి మరణం (1907) తర్వాత మెట్రిక్యులేషన్ పరీక్ష పూర్తి చేసిన తమ్మయ్యగారు 1910లో అమలాపురం తాలూకాఫీసులో గుమాస్తాగా చేరి అంచె లంచెలుగా ఉన్నత పదవులు పొంది కలెక్టరాఫీసులో హెడ్ అకౌంటెంట్‌గా 1946 లో పదవీ విరమణ చేశారు.

ఉద్యోగ విరమణ తర్వాత తమ్మయ్యగారు ఐదు సంవత్సరాలు కిర్లంపూడి ఎస్టేట్ మేనేజర్‌గా (1946-51) ఉన్నారు. జమీందారీల రద్దుతో ఆ బాధ్యత కూడా తొలగి అప్పట్నుంచీ తమ విశ్రాంత జీవితాన్ని శైవసారస్వత సేవకే వినియోగించారు. తాను జీవించివున్న కాలంలోనే అనేక బిరుదులూ, సన్మానాలూ పొందిన గౌరవం వారికి లభించింది. 1962 నుంచి ప్రభుత్వం చేత నెలకు ఏభై రూపాయల పండిత పారి తోషికం పొందారు.

తమ్మయ్యగారు కాకినాడ ఆంధ్ర సారస్వత పరిషత్తు కార్యవర్గ సభ్యులుగా వుండి శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి తరువాత 1966లో దానికి అధ్యక్షులుగా నియమితులైనారు. పరిషత్తు ఆధ్వర్యంలోనే వారి షష్టిపూర్తి సన్మాన సభ (1956 మే) జరిగి ప్రత్యేక సంచిక (పండిత బండారు తమ్మయ్య షష్టిపూర్తి సన్మాన సంచిక) వెలువడింది. తర్వాత కాకినాడ ఆంధ్రకళా పరిషత్తు వారు 1960 లో సప్తత్యుత్సవాన్ని నిర్వహించి 'సప్తతి సమ్మానోత్సవ సంచిక' ప్రకటించారు. 1965 సెప్టెంబరులో గుడివాడ తాలూకా పామర్రులో 75వ జన్మదినోత్సవాలు ఘనంగా జరిగాయి. తమ్మయ్యగారు 80వ ఏట 1970 డిసెంబరు 15వ తేదీన శివైక్యం చెందారు. చివరి దశలో వారు రచించిన 'స్వీయచరిత్ర'ను అభిమానులు (కాకినాడ శైవసేవాసమితి) 1972లో వెలుగులోనికి తెచ్చారు. ఆయన జీవిత విశేషాలనూ, సాహిత్య కృషినీ తెలుసుకోవటానికి ఈ గ్రంథం ఎంతో ఉపకరిస్తుంది.

ఆంధ్ర సారస్వత పరిషత్తు చేత 'విమర్శకాగ్రేసర' బిరుదు పొందిన (1925 - బాపట్ల) తమ్మయ్యగారు శ్రీశైలం వాగీశ పండితారాధ్య స్వాములవారిచే 'ఐతిహాసిక సమ్రాట్' బిరుదును (1952 - గుంతకల్) కూడా అందుకొన్నారు. షష్టిపూర్తి సన్మాన సందర్భంలో వీరశైవ సమాజంవారు 'శివశరణ' బిరుదుతో (అనంతపురం), వారణాసి విశ్వేశ్వర శివాచార్యులు 'ధర్మభూషణ' (1951) బిరుదుతో సత్కరించారు. సప్తతి సన్మానోత్సవంలో ఆంధ్రకళాపరిషత్తు వారు 'శైవసాహితీ సార్వభౌమ' (1960) బిరుదునొసగి వారిపట్ల తమ గౌరవ భావాన్ని చాటుకొన్నారు. పాల్కురికి సోమనపై వారి పరిశోధనకు ప్రతిగా 'సోమసాహిత్యాచార్య' బిరుదు (1969 - బెంగుళూరు) లభించింది. వారి సాహితీ శేముషిని గుర్తించిన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ విశిష్ట సభ్యత్వ గౌరవాన్ని (1968) కల్పించింది. ఆ సందర్భంలో ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు చేసిన 'విశిష్టసభ్య ప్రశంస' బండారు తమ్మయ్యగారి బహుముఖీన ప్రతిభకు నిలువెత్తు దర్పణం. ఆ ప్రశంసలోని వాక్యాలతో నా ప్రసంగ పత్రాన్ని ముగిస్తాను .

''వారు శివచరణ పరివస్యా పరాయణులైనను సత్త్వగుణ సంపన్నులు. విద్యావిజ్ఞాన విరాజమానులైనను వినయ వారాన్నిధులు. వయోవృద్ధులైనను భాషావధూటీ విలాస లాలసులు. కపటమెరుంగనివారు - కీర్తకాంక్షలేనివారు.

వారు పై అధికారుకులకు తనలోని నాలుక. క్రింది యుద్యోగులకు మచ్చరము లేని నెచ్చెలి .... కార్యాలయాంతరమున నుద్యోగులు. గృహాంతరమున సారస్వతోపాసకులు.''

*****

తెలుగులో తొలితరం పరిశోధకులు -

# శ్రీ నిడదవోలు వేంకటరావుగారు

- నిష్ఠల వెంకటరావుగారు

తెలుగులో తొలితరం పరిశోధకులలో శ్రీ నిడదవోలు వేంకటరావుగారు ఒకరు. వీరు 07-01-1903, స్వస్తిశ్రీ శుభకృత్ నామ సంవత్సర పుష్య.శు.రేవతీ నక్షత్రయుక్త (23-16) బుధవారం (అ. 21-28) తెల్లవారు ఝామున 3 గంటలకు కోడుగంటి వారి వీధిలో కోటపల్లి శ్రీనివాసరావు పంతులుగారి ఇంట్లో జన్మించారు. తండ్రి సుందరం పంతులుగారు, తల్లి జోగమ్మ. వీరు ఆరువేల నియోగులు. నిడుదవోలు వారి వంశంలో వేంకటరావుగారికి ముందు ఏడు తరాలుగా కవి పండితులున్నారు. సుందరం పంతులుగారు ప్రాచీన సాహిత్యంపైన ఆదరం గలవారు కనుక వేంకటరావుగారి జననానికి ముందే దాదాపు ఆరువేల ముద్రితా ముద్రిత గ్రంథాలు సేకరించారు.

వేంకటరావుగారి చిన్ననాటి చదువు విజయనగరంలోను, ఉన్నత పాఠశాల చదువు విశాఖపట్నం సి.బి.యమ్ హైస్కూల్‌లోను, ఎఫ్.ఎ (ఇంటర్‌మీడియట్) విశాఖపట్నం మిసెస్. ఎ.వి.యమ్.కళాశాలలోను, బి.ఎ. విజయనగరం మహారాజా కళాశాలలోను జరిగింది. 1941లో మద్రాసు విశ్వవిద్యాలయం నుండి ఎమ్.ఎ. తెలుగు పట్టభద్రులయ్యారు. విజయనగరం, విశాఖపట్నం పండిత ప్రకాండుల పుట్టినిండ్లే, కావున ఇల్లుకూడా సరస్వతీ మందిరమే గనుక వేంకటరావుగారికి చిన్ననాటి నుంచే సాహిత్యాభిరుచి కలిగింది. పద్యాలు కంఠస్థం చేయడం, అర్ధ ప్రతిపత్తి కలిగేటట్టు చదవడం ఆయనకు పట్టుబడ్డాయి. ఆయన ధారణ కూడ గొప్పది. ఒక్కసారి చదివితే చాలు. మెదడులో ముద్రితమైనట్టు అంకితమయిపోయేది.

వేంకటరావుగారికి ఇంటర్‌లో తెలుగు ఉపాధ్యాయులు కేతవరపు వేంకట శాస్త్రిగారు, బి.ఎ.లో కోరాడ రామకృష్ణయ్యగారు, మేడేపల్లి వేంకట రమణాచార్యులు, అడిదం రామారావుగార్లు. వేంకటరావుగారిని తమ గురువులు ఎంతో ప్రోత్సహించేవారు. పట్టభద్రులయిన వేంకటరావుగారికి పోషించవలసినవారు ఎక్కువ వుండడంవల్ల సాహిత్యాభిలాష వున్నా ఉద్యోగం విధిగా చేయవలసివచ్చింది. విజయనగరంలో ఇంపీరియల్ బాంకు (స్టేట్ బాంకు ఆఫ్ ఇండియా)లో గుమాస్తాగా పన్నెండున్నర సంవత్సరాలు చేశారు. బాంకులో ఆలస్యం కాకుండా వుంటే సాయంకాలం బాంకు దగ్గరగా వుండే ''కల్యాణి'' పత్రికా కార్యాలయయానికి వెళ్ళేవారు. అక్కడ గంటి సూర్యనారాయణ శాస్త్రిగారితో సాహిత్యంపై ముచ్చటలు జరిపేవారు. 1936లో ఇంపీరియల్ బాంకు విజయనగరం బ్రాంచి నుండి వేంకటరావుగారు కాకినాడ బ్రాంచికి

బదిలీ అయినారు. ఇది వారి జీవితంలో మొదటి మలుపు. ఒక శుభముహూర్తాన పిఠాపురం రాజావారు వేంకట కుమార సూర్యారావు బహద్దూర్ కాకినాడలోని తమ బంగళాకు వేంకటరావుగారిని ఆహ్వానించిరి. ఇంతలో పిఠాపురం ఆస్థాన పండితులు ఓలేటి వెంకటరామశాస్త్రులుగారు ప్రవేశించి ''డబ్బాటు'' పదమునకు ప్రయోగము చూపించెదరా''? అని ప్రశ్నింప తడువుకోకుండా శాస్త్రులవారి రచననుండే పద్యము చదివి ప్రయోగించారు. రాజావారు మంత్రముగ్ధులై బాంకు గుమాస్తా గిరి నుండి తప్పించి కళాశాలలో పండిత పదవి లభింపజేసిరి. ఆ కళాశాలనుండి మద్రాసు విశ్వవిద్యాలయాంధ్ర భాషాశాఖలో పరిశోధక ఉపన్యాసక పదవి కెక్కించినది సూర్యరాట్ప్రభువుల చలవే.

కాకినాడ రాజావారి కళాశాలలో వున్నప్పుడు శ్రీయుతులు, బోయి భీమన్న, కరటూరి సత్యనారాయణ, మహ్మద్ ఇస్మాయిల్, రాంషా, సరోజినీ రేగాని, ఎల్. మాలకొండయ్య, సి.యస్.రావు (చలన చిత్రనటుడు) వక్కలంక లక్ష్మీపతిరావు శిష్యులయినారు.

కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి, వారి సోదరులు సుబ్బయ్యశాస్త్రి, వెంపరాల సూర్యనారాయణ శాస్త్రి, చిలుకూరి పాపయ్యశాస్త్రి, కొత్తపల్లి సూర్యారావు, దాసరి లక్ష్మణకవి, ఈయుణ్ణి వేంకట వీరరాఘవాచార్యులు కాకినాడలో వేంకటరావుగారి సాహిత్య బంధువులు.

సమకాలీకులు, సాహిత కోవిదులైన హరికథాపితామహ ఆదిభట్ల నారాయణదాసు, వఝల చిన సీతారామశాస్త్రి, భోగరాజు నారాయణమూర్తి, పూడిపెద్ది వేంకట రమణయ్య, దేవగుప్తాపు వెంకటరమణ కవి, పిలకా గణపతిశాస్త్రి, యామిజాల పద్మనాభస్వామి, శ్రీరంగం నారాయణబాబు, చొప్పల్లి సూర్యనారాయణ భాగవతార్, జోస్యుల శ్రీరామమూర్తి (దొడ్డమ్మ), ద్వారం వేంకస్వామి నాయుడు, వి.ఆర్.చిత్ర, కోడి రామూర్తి నాయుడు గార్లతో వీరికి స్నేహముండేది.

పీఠికలు :

నిడుదవోలు వేంకటరావుగారి కాపురం పీఠికాపురమని గంటి సూర్యనారాయణ శాస్త్రిగారు చమత్కరించారు. వావిళ్ళవారి సగం పుస్తకాలకు వేంకటరావుగారు ప్రత్యక్షంగానో, ఇతరుల పేర్లతోనో పీఠికలు రచించారు. ఒక్కొక్కసారి వారి పీఠికలు మూలగ్రంథాన్ని మింగేసేలా వుంటాయి. సమగ్రంగా ఎక్కువ పుస్తకాలకు పీఠికలు వ్రాసిన వారిలో వేంకటరావుగారే మొదటివారు. ఆయనకు రచయిత మీదకంటే రచనమీదే ఎక్కువ మక్కువ. ఆ కారణం చేతనే ఆయన పీఠికలు సమగ్ర విషయ

ుధ సంబంధురపేటిక. మలిముద్రణ గ్రంథాలకైనా ''వడ్డించిన విస్తళ్ళ'' లాంటి
బు వ్రాసేవారు. అడిగిందే తడవుగా సానపెట్టిన మాణిక్యాల్లాంటి పీఠికలు వ్రాసి
వారు. సాహిత్యాన్ని ఆపోసన పట్టిన వారికి పీఠికారచన నల్లేరు మీద బండినడక.
ారి పీఠికలలో మచ్చుకు కొన్నిటిని పరిశీలిద్దాం.

## పరవస్తు చిన్నయసూరి జీవితం

చిన్నయసూరి ఆంధ్రవాఙ్మయంలో నవయుగ నిర్మాతలలో ఒకడై నియంతగా వాడనే విషయం ప్రస్ఫుటం కాకపోయినందువల్ల ఈ పీఠిక వ్రాయవలసి ందని వారు చెప్పుకున్నారు. కుల మత భేదాలు లేకుండా పీఠికా రచన చేసినవారు ంరావుగారు. 'త్ర్యే కోదాహరణ' అనే క్రైస్తవ మత గ్రంధానికి ఆయన వ్రాసిన సేని ఉదాహరణ లక్షణాలను తెల్పడం, పాల్కురికి సోమనాథుని బసవోదాహరణముతో ారణ వాఙ్మయం ప్రారంభమైందని చెప్పడం. ఇంకొక విశిష్ఠ గుణం ఏమిటంటే ు ఉదాహరణములుండడం 'కుమారోదాహరణములో సార్వవిభక్తికానికి రచయిత ిఠికలు వ్రాయడం ఇలా ఇంతకు మునుపెవ్వరూ వ్రాయలేదు. ఇది ఉదాహరణ మానికే ఒక నూత్నోదాహరణం. చారుచర్య, ఉపగుప్త, శివమహిమ్న స్తోత్రం, ారాయణ చరిత్రము, సూర్యశతకము కాకుండ 65 వివిధ గ్రంథాలకు పీఠికలు ు. ఆయన పీఠికలు సాహిత్యభోక్త కవి మృష్టాన్నపు విస్తళ్ళు.

'మించుపల్లె' మొదలగు కవితలు-33 దాకా వ్రాశారు. 'మౌలిక పరిశోధనా లు'-20, మౌలిక పరిశోధనా వ్యాసాలు-186, సాధారణా వ్యాసాలు-41, లు-86, పరిష్కృత గ్రంధాలు-14, సామూహిక సంపాదకత్వం-20 వ్రాశారు ు.

**ఉదాహరణ కావ్యోద్ధరణ :** ప్రాచీన ఉదాహరణ కావ్యప్రక్రియ నిడుదవోలు ంరావుగారి కృషివల్లనే ఉద్ధరింపబడి, పునరుజ్జీవనం పొందిందని సిద్ధాంతం.

వేంకటరావుగారు లింగధారులుకారు. కాని వేంకటరావుగారి తండ్రి సుందరం లుగారు ప్రతిదిన పార్థివలింగ పూజా దురంధరులు. పరమనిష్ఠాగరిష్ఠులు. భూతీ రుద్రాక్షమాలికాధారులు. వారిల్లు శైవ మహాజనులకు జోగి జంగములకు ు ద్వారం. సుందరం పంతులుగారు వేలాది తాళపత్ర గ్రంధ సేకరణ కర్తలు. ్వ ముద్రిత గ్రంథ సరస్వతీ భాండాగార స్థాపకులు. ఏవం విధగుణ గరిష్ఠులైన రం పంతులుగారి పెద్ద కుమారుడు వేంకటరావు గారికి శైవమత గ్రంథాభినివేశం ంలో ఆశ్చర్యం లేదు. కుటుంబ వాతావరణం, తండ్రి సుందరం పంతులుగారి ఙ్మయోద్ధరణ దీక్ష వేంకటరావు గారిపై బాగా ప్రభావితం అయ్యాయి. ఇంట్లో

పండితారాధ్య చరిత్ర పరిష్కరణ, నన్నెచోడుని కుమారసంభవం, పాల్కురికి సోమన బసవ పురాణం ముద్రిత ప్రతులు అప్పుడే వెలువడటం సహజంగా శైవ వాఙ్మయ పఠనాభిలాషులైన వేంకటరావు గారికి మరింత ఉత్సాహాన్ని కలుగజేసాయి. విద్యార్థి దశలోనే నన్నెచోడ పాల్కురికి సోమనాథుల కాల నిర్ణయాలపై చర్చలు జరుపుతూ వ్యాసాలు వ్రాసారు, విజయనగరంలో ఇవటూరి నందికేశ్వరుల వీరశైవ సంపుటాల్లో ప్రమాణాష్ట కాభరణానికి పీఠక వ్రాశారు. తొలి భారతి పాల్కురికి సోమనాథుని గురు ప్రశంస, వృషాధిప శతకం, ఆంధ్రపత్రిక సారస్వతాను బంధంలో బసవనామ శబ్ద నిర్వచనం మొదలయిన వ్యాసాలు ప్రచురించారు.

బండారు తమ్మయ్యగారితో వేంకటరావుగారి మైత్రివల్ల శివకవులకు మర్యాద దొరికింది. శివకవులు ప్రామాణికులని విశ్వసించి ఆంధ్ర విశ్వవిద్యాలయం వారు తెలుగు ఎం.ఎ, కోర్సులోని వాఙ్మయ చరిత్రలో "శివకవియుగాన్ని" అంగీకరించారు. వెంకటరావుగారి శివకవుల భాషా ప్రయోగ నైపుణ్య నిరూపణ అన్నీ శివకవులకు ప్రత్యేక స్థానాన్ని సంపాదించి పెట్టాయి. వేంకటరావుగారికి శైవ గ్రంథాలతో పాటు ఇతరాంధ్ర కావ్యాలు కూడా జిహ్వాగ్రం మీద ఉండేవి. సూర్యరాయాంధ్ర నిఘంటు ఆస్థాన పండితులు అడిగినదే తడవుగా ప్రయోగాలు నందించటంలో వేంకటరావుగారు తమ గౌరవ ప్రతిష్టలను నిలబెట్టుకో గలిగారు. ఇంకో విశేషం. వేంకటరావుగారు సాహిత్యంతో పాటు తెలుగు దేశ చరిత్రను బాగా చదివినారు. కావ్యాలలాగే శాసనాలుకూడా ఆయన తలపునకు చట్టున తడుతూ వుండేవి. భారతిలో శైవ వాఙ్మయంపై, భాషపై పుంఖాను పుంఖంగా ఆయన వ్యాసాలు విరామం లేకుండా వెలువడ్డాయి. సోమన బసవపురాణానికి ద్వితీయ ముద్రణను ప్రచురించారు. ఆ గ్రంథానికి వేంకటరావుగారు వ్రాసిన బృహత్తర పీఠిక రాబోవు విద్యార్థులకు విద్వాంసులకు పట్టుకొమ్మ అయింది.

నిఘంటు రచన : నిఘంటు రచనల్లో వేంకటరావుగారు యావదాంధ్ర సాహిత్యాన్ని అగస్త్యుని వలె అవపోసనం పట్టిన దిట్టలు. సాహిత్యంలో దొరకని కొన్ని ప్రయోగాలను శాసనాలనుండి ఆయన గ్రహిస్తారు, కావ్య ప్రయోగాన్ని బలపరచవలసి వచ్చినపుడల్లా శాసనాల్లో ఆ ప్రయోగం చూపి ఇది శిలాక్షర మంటారు. మద్రాసు స్కూల్ బుక్ అండ్ లిటరేచర్ సొసైటీ వారు 1885లో మొదటిసారిగా శబ్దరత్నాకరం అచ్చువేశారు. 1912, 1922, 1929, 1937లో వరుసగావారు పునర్ముద్రిస్తూ వచ్చారు. 816 పుటల మూల గ్రంథానికి వేంకటరావుగారు 122 పుటల అనుబంధాన్ని చేర్చారు. 1969లో తిరిగి వేంకటరావుగారి సంస్కరణ ముద్రణే అచ్చు అయింది. ఈ అనుబంధంవల్ల వేంకటరావుగారి ప్రయోగ సేకరణ ఎంత ప్రామాణికమైనదో తెలుస్తుంది. వారి విద్వత్తునకు పండితలోకం జోహారులర్పించింది.

వేంకటరావుగారు ఇంకా శబ్దరత్నాకరంలో చేరనివి, శబ్దరత్నాకరంలో ప్రయోగ సహితం కానివి రెండు వేల పదాలు సేకరించి కార్డులపై వ్రాసి భద్రపరిచారు.

నిడుదవోలు వేంకటరావుగారి మరొక మౌలిక పరిశోధన గ్రంథం' ఆంధ్ర వచన వాఙ్మయం'. ఇది మొదట ఆంధ్రపత్రిక ఖరసంవత్సర (1951-52) ఉగాది సంచికలో (41-58) పుటలు బృహద్వ్యాసంగా ప్రచురితమై పిదప పరివర్ధితమై 1954లో పుస్తక రూపంగా వెలువడింది. 1962లో మద్రాసులో తెలుగు భాషాసమితి వారు ఈ గ్రంథానికి బహుమతి ఇచ్చారు. వచన రచనపై వెలువడిన సాధికార, ప్రామాణిక గ్రంథమిది. అంతకు ముందిట్టి గ్రంథాన్ని రచించిన వారులేరు. ఈ గ్రంథ ముద్రణ తరువాత విశ్వవిద్యాలయాల్లో పరిశోధన ప్రారంభమయింది. ఒక సిద్ధాంతగ్రంథానికి వేంకటరావుగారు న్యాయనిర్ణేతగా ఉండడం విశేషం. 1977లో వేంకటరావుగారు ఆంధ్రవచన వాఙ్మయ గ్రంథాన్ని పుష్టిగా, తుష్టిగా పునర్ముద్రించారు. నిడుదవోలు వేంకటరావుగారు అవతారికలో సంస్కృతంలో గద్యవచనాలకు భేదం ఉండదని, వచనం సామాన్య వ్యవహారపు మాటలయితే గద్యం ఛందోబద్ధం కాని హృద్యమైన పదసముదాయమని తెలిపారు.

1946 త్రిపురాంతకోదాహరణ పీఠికాకారుని విద్వత్తకు పరిశోధనా పాటవానికి నీరాజనంగా నిలిచింది. తెలుగు ప్రధానంగా అభ్యసించే విశ్వవిద్యాలయ విద్యార్థులకు త్రిపురాంతకోదాహరణం పాఠ్యాంశంగా ఉండడం వల్ల నిడుదవోలు వేంకటరావుగారి ప్రతిభ, పేరు ప్రతిష్ఠలు విద్యల్లోకానికి తెలియవచ్చాయి. ఆయన విద్వత్తంతా ఉదాహరణలకు వాఙ్మయంలో ఉన్న స్థానాన్ని నిరూపించడం మార్గ-దేశి కవితా స్రవంతుల సమ్మేళన ఉదాహరణ అని తెలపడం, తెలుగు కవిత ఏకపదమై ద్విపదమై, త్రిపదమై చతుష్పద పరిణతి చెందినట్లు నిర్ధారించడం. ఉదాహరణకూ, సంగీత-సాహిత్యాలకూ సంబంధం, సప్తవిధ విభక్తి పరిణామ నిరూపణ, సాధారణాంధ్ర ప్రబంధ ఆశ్వాసాంత పద్య విభక్తి రచన షష్ఠ్యంతాల అంతరార్థ వివేచన, దేశీయ ఛందోవికాసం, సంస్కృతోదాహరణల ప్రసక్తి మొదలయినవాటి గురించి వివేచించటం - ఈ విమర్శనలు ఆనాటి దండి పండితులను అవుననిపించాయి.

1961లో వేంకటరావుగారు పూనా వెళ్ళి అక్కడ తెలుగు లింగ్విస్టిక్స్‌పై పరిశోధన చేశారు. దీని ఖర్చు యు.జి.సి. భరించింది. హైదరాబాద్‌లోని ఆర్కివ్స్ శాఖకు సలహా సభ్యులుగా వుండేవారు. ఇక్కడ ప్రభుత్వ ప్రాచ్యలిఖిత గ్రంథాలయం ఏర్పడడానికి వేంకటరావుగారు చేసిన కృషి మరువరానిది.

విద్యారత్న : కోన వెంకటరాయ శర్మ, ఉయ్యూరు జమిందారులు శ్రీ వేంకటరంగ అప్పారావు బహద్దూర్ వారి అధ్యక్షతన జరిగిన పండితసభలో

నరసారావుపేటలో ఆంధ్రసారస్వత పరిషత్తువారు ఇచ్చిన బిరుదు 'విద్యారత్న' నిడుదవోలు వేంకటరావుగారికి ఈ బిరుదు మొదటిది.

పరిశోధన పరమేశ్వరులు : శ్రీ విశ్వనాథవారు, వేంకటరావుగారు పరిశోధక పండితులని తెలియబట్టి వారిని 'పరిశోధనా పరమేశ్వరా' అని సంభోదించారు. ఈ బిరుదు ఏ సంస్థవారో ఇచ్చినది కాదు. ఉదాహరణవాఙ్మయ చరిత్రను విశ్వనాథవారి అభిప్రాయం కోసం పంపితే వారు చదివి ఉత్తరం ద్వారా ఉదాహరణ కావ్యరహస్యాన్ని తెలుపుతూ చివరి పంక్తిలో ''పరిశోధన పరమేశ్వరులు'' అని కీర్తించారు.

ఆంధ్రసారస్వత పరిషత్ వారు నరసారావుపేటలో కోన వెంకటరాయశర్మ, వుయ్యూరు జమిందారులు శ్రీ వేంకటరంగ అప్పారావు బహద్దూర్ వారి అధ్యక్షతన జరిగిన పండిత సభలో పరోక్షంగా 'విద్యారత్న' బిరుదు నిచ్చినట్టు ప్రకటించారు.

ప్రయోగవమూషిక మార్జాలం : వేంకటరావుగారు ప్రాచీనాంధ్ర సాహిత్యంలోని చాలా గ్రంధాలు వల్లె వేయటమే కాకుండా ఛందో వ్యాకరణ శాస్త్రాలకు పనికి వేచ్చే విశిష్ట ప్రయోగాలను గుర్తుపెట్టుకునేవారు. సూర్యరాయాంధ్ర నిఘంటు కార్యాలయాల్లో విశ్వనాథవారి స్వరూప దీపికపై చర్చల సందర్భంగా వేంకటరావుగారికి ప్రయోగాల మీద వుండే అధికారం వ్యక్తమయింది. ఎలక కోసం పిల్లి పొంచి వుంటుంది. ఒక్కొక్కప్పుడు దానికి ఆయుష్షు వుంటే దాటి పోతుంది. ఇక్కడ వేంకటరావుగారు వెతకడంకాని, పొంచి వుండడంకాని చేయరు. ప్రయోగం అనే ఎలక దొరకగానే టప్పున పట్టుకోగలరు. ధారణలో వుంచుకుని సమయం వచ్చినపుడు పుస్తకం చూడకుండానే చెప్పగలరు.

జంగమ విజ్ఞాన సర్వస్వం : తెనాలి తాలూకా పెదపూడి పాఠశాలలో అభ్యుదయ రచయితలు సభను జరిపినప్పుడు వెంకటరావుగారు వేదికపైన ఒక పక్కగా కూచుని ఏది ఎవరు మరచినా ఏ పద్యాన్ని ఒక చరణం చదివి విడిచినా ఆ విషయాన్ని ఆమూలాగ్రంగా చెప్పటమే కాకుండా పూర్తి పద్యాన్ని చదివి వినిపించేవారు. వేంకటరావు గారిని ఆనాటి వారు జంగమ విజ్ఞాన సర్వస్వం అని ప్రశంసించేవారు.

కళాప్రపూర్ణ : 29-10-1978వ తేదీన రాష్ట్ర గవర్నర్ (అప్పటి) ఖండూభాయ్ దేశాయ్ సమక్షంలో జరిగిన ఆంధ్ర విశ్వవిద్యాలయ స్నాతకోత్సవ సభలో వేంకటరావుగారిని 'కళాప్రపూర్ణ' బిరుదుతో విశ్వవిద్యాలయం వారు సన్మానించారు.

శ్రీ వేంకటరావుగారు కేవలం విమర్శకులే కాదు. కవులు కూడా. వీరి కార్య నిర్మాణ కేశలమున ఉదాహరణముగ 'మించుపల్లి'యను కావ్యమును గైకొనవచ్చును. వీరు గావించిన వాఙ్మయ సేవకలరి కొందరు మనీషి పుంగవులు వీరికి సువర్ణ ఘంటా

కంకణమును బహూకరించిరి. మద్రాసు రేడియోకేంద్రం నుండి 200 ప్రసంగాలు, 15 ఆంగ్ల వ్యాసాలు, మెకంజీ ఆంగ్లానువాదం చేశారు వేంకటరావుగారు. ఈయనే తెలుగు భాషలో ఏ మూల ఏమున్నదో చూపగల జగదివిటీ. వేంకటరావుగారు తెలుగు సాహిత్యంలో చదివి మరచిందిలేదు. ఒడలు మరచి చదవంది లేదు ఈ పరిశోధనా పరమేశ్వరుని చూపు సజ్జన సాహిత్యంమీదనూ పడింది. అచ్చ తెలుగులో ఆరి తేరినవారు గనుక, విద్యార్థి దశనుంచే కైత చెప్పగలిగేవారు. ''మించుపల్లె'' ''తెలుగుపొలుపు''లను ఆంధ్రనలందా శతకము, శ్రీరామగీతామృతము, శ్రీరామలింగేశ్వర శతకము, గాంధీ సాహిత్యము మున్నగు కృతులు చెప్పారు. చాటు పద్యాలు వందలు.

నిడుదవోలు వారికి వైయక్తికంగాను, సాహిత్యదృష్టితోను మంచి అలవాట్లున్నాయి. తాము చూచినవీ, తమకు తోచినవీ చిన్న నోటు బుక్కులో ఎప్పటికప్పుడు గుర్తుపెట్టు కోవడం అలవాటు. అలా గుర్తు వేసుకున్నవాటిలో సూక్తులు చాలా వున్నాయి. ''ఆంధ్రులకు ఐకమత్యం యతిలోనే గాని, మతిలో లేదు'', బలిదానం వల్ల అడుగున పడిపోతే, పొట్టి శ్రీరాములు బలిదానం వల్ల పొడుగైనాడు, ''మన విద్యావిధానం 'కా' గుణింతంతో ప్రారంభమై కాన్వకేషన్‌తో ముగుస్తుంది.'' ''మనకిప్పుడు రెండే పనులు – మరపని – మరుపని;'' ''దేశభాషలందు తెలుగు లెస్స'' అన్నది ప్రాతమాట, ఇలగలుగు భాషలందెల్ల తెలుగులెస్స అన్నది నేది మాట, ఇలాంటివి ఎన్నో సూక్తులు.

నిడుదవోలు వారిని దర్శించినపుడు, తలచుకొన్నప్పుడు నాకు శృంగార గ్రంథ మండలి స్థాపకులు గంటి సూర్యనారాయణ శాస్త్రిగారు తరచు అంటున్నమాట – ''నీకు తెలియకపోతే నిడుదవోలు వారినడుగు'' అనేది జ్ఞాపకం వచ్చి ధారణావతారమైన ఈయన ఎడల గౌరవం ఇనుమడిస్తుంది.

రాష్ట్రేతర ప్రాంతంలో ముఖ్యంగా దక్షిణదేశంలో విస్తరిల్లిన తెలుగు సాహిత్యాన్ని పరిశీలించి, పఠించి, నిడుదవోలు వెంకటరావుగారు సమగ్ర సాహిత్య చరిత్రను వ్రాసి తెలుగు ప్రజలకు అందజేశారు. తెలుగు సాహిత్య చరిత్రలో ఒక నూతనోధ్యాయాన్ని వారు తెరిచారు.

''తను కావించిన సృష్టి తక్కొరుల చేతంకాద'' నిపించారు. కవి చరిత్రలు చదివి కవుల పుస్తకాల పేర్లు తెలిసిన విద్యార్థులు, కావ్య పరిష్కర్తల పీఠికలు చదివి కళాశాల పోటీ పరీక్షలలో నెగ్గిన వారున్నారు.

కవి కృతావతారికలను మాత్రమే చదివిన చారిత్రకులున్నారు.

రసభావాలంకార ఛందోవ్యాకరణ కావ్యవస్తు విమర్శకులున్నారు. కాని కావ్యాది శ్రీకారం నుండి కావ్యాంత మంగళ మహాశ్రీ వరకు అక్షరాక్షరం చదివి మనఃఫలకముపై

ప్రతిష్ఠించి, వలసినప్పుడు జిహ్వాగ్రానికి తెచ్చుకుని ప్రదర్శించ గల శక్తి ఒక్క నిడుదవోలు వేంకటరావు గారికే వుండేది.

ఒక్క తెలుగు సాహిత్యమే కాదు. సంస్కృత శ్లోకాలు కూడా వారికి కంఠోపాఠాలే. మయూరుని క్లిష్ట సంస్కృత పదభూయిష్ఠమైన సూర్యశతక స్రగ్ధరా వృత్తాలను నూరింటిని నూరి, ఔపాసనం పట్టిన అగస్త్యులు వారు.

పరిశోధనా పరమేశ్వరులు అని విశ్వనాథవారు ఏతాదృశ లక్షణ భూషితులైన వేంకటరావు గారు విశ్వవిద్యాలయ ఆంధ్ర శాఖలో పనిచేసిన అధ్యాపకులలో వారు కావించిన కృషి అనిదం పూర్వం - అనన్య సామాన్యం - అద్వితీయం.

1. సరస్వతీ భండాగారం వారి ఇల్లు.
2. సాహిత్యోద్ధారకులే కాక సరసకవితా దురంధరులు వారి తండ్రిగారు.
3. కవిపండితులతోనే వారి సాహచర్యం.
4. ధారణ, శ్రావ్య శబ్ద పఠనం వారి పూర్వార్జిత జన్మఫలం.
5. అభినవాంధ్రభోజులు పిఠాపుర రాజు ప్రభువు
6. ఆంధ్రసాహిత్య పరిషత్, సూర్యరాయాంధ్ర నిఘంటు కార్యస్థానం వారి మేధను మెరుగు పెట్టిన రంగాలు.
7. మద్రాసు విశ్వవిద్యాలయ ప్రాచ్య పరిశోధన సంస్థ వారి పీఠం.
8. అక్కడి ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారం వారి అంకస్థితార్థపేటి
9. భారతి, ఆంధ్రపత్రిక, ఉగాది సంచికలు వారి విద్వత్ ప్రకాశకాంతులు.
10. ప్రాచీన సాహిత్య ముద్రణాలయం 'వావిళ్ల' వారి పీఠికాపురం. ''దశదిశాభరణాంకు''లు వారు.

మదరాసులో అలంగతపిళ్లై గృహంలో ఉన్నప్పుడే కళత్ర వియోగం (04-04-1949) సంభవించింది. వేంకటరావుగారికిది మానసికమైన పెద్దదెబ్బ.

అసలు అనే పదాన్ని ఊత పదంగా తెగవాడుతూ వచ్చేవారు వేంకటరావుగారు. బాగా వార్ధక్యం వచ్చిన తరువాత ''స్మ'' అంటూ పలికేవారు. ఆయనతో వ్యక్తిగతంగా సంభాషిస్తే కాస్త కుతూహలం ఉన్నవారు ''అసలు'' పద బాహుళ్యం గుర్తుపడతారు. విశ్వవిద్యాలయంలో ఒక ప్రొఫెసర్ జోక్ చేస్తూ ''వేంకటరావుగార్కి పదాల మధ్య కాస్తచోటు కనబడితే ''అసలు''తో ఆచోటు నింపుతారు. వైస్ ఛాన్సరల్ అనవలసి వస్తే వైస్ అసలు ఛాన్సలర్ అనడానికి ఆయన తడబడరని'' అన్నారు.

కడపలో కలక్టరుకు అసిస్టెంటుగా చేరి అనేక ప్రభుత్వశాఖల్లో జీర్ణాంధ్ర సాహిత్య సామ్రాజ్యాన్ని పునఃసృష్టి కావించి తన సర్వస్వం ఆంధ్రసరస్వతి సన్నిధిలో సమర్పించి చివరకు లండన్ విశ్వవిద్యాలయంలో 'తెలుగు ప్రొఫెసర్' పదవిని అందుకున్న ఛార్లెస్ ఫిలిప్ బ్రౌన్ దొరవారికి, ఇంపీరియల్ బాంకు విజయనగరంలో గుమాస్తాగా చేరి అహో రాత్రులు అస్థిచర్మం బాంకు ఉద్యోగానికి ధారపోసి నిరంతర సాహిత్య పరిశోధనలో రాటుదేలి చివరికి మద్రాసు విశ్వవిద్యాలయం తెలుగు ప్రొఫెసర్ అయిన నిడుదవోలు వేంకటరావుగారికి ఒకటే సామ్యం.

తాళపత్ర గ్రంథ సేకరణ, సంస్కరణ, కవిప్రయోగ సంగ్రహం, దీక్షాదక్షత, నిఘంటు రచన, జంగమ వాఙ్మయాభిమానం ఇద్దరికీ సమానమే. ఆవేశంలో, ధారణలో ఏది ప్రస్తావించినా ''అదికాదయ్యా'' (బ్రౌన్-నో-నో) అని ప్రసంగాన్ని ప్రారంభించడం ఇద్దరిలో కనిపించే గుణాలే, బ్రౌన్ వేంకటరావుగారిగా అవతరించారేమో! అదోభ్రాంతి.

శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు కొనఊపిరి వున్నంతవరకు సాహిత్యరచన కొనసాగించారు. నిడుదవోలు వేంకటరావు అన్న శుభనామధేయాన్ని యావదాంధ్ర దేశంలో మారుమ్రోగించి అక్షయ పుణ్యలోక సంప్రాప్తులయ్యారు 15-10-1982లో.

తరువాత నేను కొత్తపల్లి వీరభద్రరావుగారి పర్యవేక్షణలో ''నిడుదవోలు వేంకటరావుగారి జీవితం - వాఙ్మయ సూచిక'' అనే సిద్ధాంతవ్యాసాన్ని హైదరాబాద్ విశ్వవిద్యాలయం వారికి సమర్పించి 1985లో ఎమ్.ఫిల్. పట్టాను పొందాను. తదుపరి ''కళాప్రపూర్ణ నిడుదవోలు వేంకటరావుగారి రచనలు - పరిశోధన'' అనే అంశాన్ని ఎన్నుకొని ఆచార్య జి.వి.సుబ్రహ్మణ్యంగారి పర్యవేక్షణలో ఈ సిద్ధాంతగ్రంథాన్ని వ్రాసి పి.హెచ్.డి.లో పట్టాని పొందాను. ఈ సిద్ధాంత గ్రంథ ప్రచురణ కోసం ఆర్థిక సహాయ మందించిన వారు పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం వారు. నిడుదవోలు వేంకటరావుగారికి ఐదుగురు కుమారులు, ఇద్దరు కుమార్తెలు. జ్యేష్ఠ కుమారుడు శివసుందరేశ్వర రావు తండ్రికి దీటైనవాడు 'పుత్రే దిచ్ఛే త్పరాజయం' నానుడిని సార్థకం చేశాడు. రెండవ, మూడవ కుమారులు 'ఎయిర్ ఫోర్స్'లో పనిచేసి నప్పటికి సాహిత్యంలో సంబంధమున్నవారే. నాల్గవకుమారుడు సర్వేశ్వరరావు వివేకవర్ధిని కళాశాలలో తెలుగు హెడ్ ఆఫ్ ది డిపార్ట్మెంటుగా పనిచేస్తూ, కె.జె.ఏసుదాసు పాడిన అయ్యప్పస్వామి భక్తిగీతాల రచయిత, ఇంకా ఎన్నో భక్తిగీతాలు, లలితగీతాల రచయితగా ఆంధ్రదేశమంతటా పేరు పొందేరు. వేంకటరావుగారి పెద్దకుమార్తె జోగాబాయి. వీరి అమ్మాయి (వేంకటరావు గారి మనమరాలు) చలనచిత్ర రంగంలో తారాస్థాయినందు కొంది జయసుధ. ఇక ఐదవ అబ్బాయి సూర్యనారాయణ మహారాష్ట్రలోని పర్లీ వైద్యనాథ్ కళాశాలలో రీడర్‌గా ఇంగ్లీషు డిపార్ట్మెంటులో పనిచేశారు. ఆంగ్ల కవితలు ఎన్నో వ్రాశారు.

ఆఖరి అమ్మాయి లక్ష్మి హైదరాబాద్‌లోనే వుంది. నిడుదవోలు వేంకటరావుగారి సంతానమందరు సాహిత్యంతో సన్నిహిత సంబంధమున్నవారే.

నిడుదవోలు వేంకటరావుగారి కుటుంబ సభ్యులు, నేను కలసి ఒక కమిటీగా ఏర్పడి ఆయన పేరు పేరెన్నికగన్న కవులకు పండిత సత్కారం చేయాలని నిర్ణయించుకున్నాం, 'కిన్నెర' సంస్థతో కలసి ''కిన్నెర-నిడుదవోలు వేంకటరావు'' అవార్డును సగౌరవముగా క్రింది కవులకు ఇవ్వడం జరుగుతోంది.

ఇంతవరకు వరుసగా

1. శ్రీ కొత్తపల్లి వీరభద్రరావు గారు
2. శ్రీ తిరుమల రామచంద్ర గారు
3. శ్రీ నండూరి రామకృష్ణమాచార్య గారు
4. శ్రీ అక్కిరాజు రమాపతిరావు గారు
5. శ్రీ బూదరాజు రాధాకృష్ణ గారు
6. శ్రీ భ. రా. గో. గారు
7. శ్రీ ఉప్పల సత్యనారాయణ గారు

పరిశోధనా పరమేశ్వర వేంకటరావుగారి సాహిత్య వ్యాసంగాన్ని కవిత, వ్యాసాలు, పీఠికలు, రేడియో ప్రసంగాలు, గ్రంథ పరిష్కరణలు, గ్రంథ విమర్శలు, సాహిత్య విమర్శ ఇతర ప్రవృత్తులు అని వెంగడించి ఆయనకున్న అసాధారణ మేధాశక్తిని కూడా పై వాటితో కలుపుకుంటే పరమేశ్వరుని అష్టమూర్తిత్వం గోచరిస్తుంది.

*****

# పరిశోధకునిగా చిలుకూరి వీరభద్రరావు

- ఎ. రవీంద్రబాబు

చారిత్రక పరిశోధకునిగా, పత్రికా సంపాదకునిగా, చారిత్రక నవలా కారునిగా, సాహిత్యకారునిగా చిలుకూరి వీరభద్రరావు ప్రసిద్ధులు. ఏ వ్యక్తి సాధించిన నవ్యతకు ఆవ్యక్తి కాలం నాటి సామాజిక పరిస్థితులు చాలా వరకు కారణాలు అవుతాయి అన్నది చారిత్రక సత్యం. వీరభద్రరావు జన్మించే నాటికి దేశ, రాష్ట్ర పరిస్థితులు ఆయన పై ఎంతో ప్రభావాన్ని చూపాయి. ఆనాటి సమాజంలోని సంస్కరణోద్యమం, జాతీయతా భావం, అన్నిటికి మించి వీరభద్రరావుగారి స్వతంత్ర వ్యక్తిత్వం ఆయన జీవిత విధానానికి కారణాలు అయ్యాయి.

ఆ కాలంలో రాజా రామమోహనరాయ్ బెంగాలులో ప్రారంభించిన సంస్కరణోద్యమం, ఆంధ్రదేశంలో కందుకూరి వీరేశలింగం పంతులుగారు చేపట్టిన సంస్కరణ కార్యక్రమాలు, వారి రచనల ప్రభావం ప్రజలపై ఎక్కువుగా ఉండేది. వీటి ప్రభావము వీరభద్రరావుగారి జీవితం తొలి రోజులలో ఎక్కువుగా ఉంది.

వీరభద్రరావు 1872 అక్టోబర్ 17వ తేదీన పశ్చిమ గోదావరి జిల్లా నరసాపురం తాలూకా లోని పెనుమదమ గ్రామంలో జన్మించారు. వీరి తల్లిదండ్రులు సీతమాంబ, వీరరాజులు. ఏకైక సంతానమైన వీరు నియోగి బ్రాహ్మణులు. తర్వాత వీరి కుటుంబం తణుకు తాలూకాలోని రేలంగి గ్రామానికి మారింది. వీరి విద్యాభ్యాసం అక్కడే జరిగింది (1880 - 86). వీరు స్కూలు ఫైనల్ వరకు చదివినా సంస్కృతాంధ్ర భాషల్లో మంచి పాండిత్యం సంపాదించారు.

ఆ రోజుల్లో వీరేశలింగం పంతులు గారి సంస్కరణోద్యమ కార్యక్రమాలైన వితంతు పునర్వివాహం, స్త్రీ విద్యాభ్యాసం, అనాధాశ్రమాల నిర్మాణం మొదలైన వాటి ప్రభావం వీరభద్రరావు గారిపై కూడా పడింది. పై అంశాలను చర్చిస్తూ కందుకూరి వారు చేసిన రచనలు కూడా వీరిని బాగా ఆకర్షించాయి.

ఆ ప్రభావంతో 1892లో వీరేశలింగం గారి జీవిత చరిత్ర రాసి, గ్రంధ విమర్శనము చేసి 'ఆంధ్ర ప్రకాశిక' పత్రికలో ప్రకటించారు. తర్వాత ఏలూరు వెళ్లి 1896లో 'దేశోపకారి' పత్రికకు సహాయ సంపాదకునిగా చేరారు. 1896లోనే 'విభుద రంజని' పత్రికకు సంపాదకులయ్యారు. పత్రికా వ్యాసంగం మీద వీరికున్న అభిమానంతో ఒక ముద్రణాలయాన్ని స్వతహాగా కొని, దానికి 'విద్యా సాగరమని' పేరుపెట్టారు. దీని ద్వారా 'దేశోపకారి' పత్రికను మరికొంత కాలం ప్రచురించారు.

1905లో ఆర్థిక ఇబ్బందుల వలన రాజమండ్రి వెళ్లి వీరేశలింగం పంతులు గారి 'చింతామణి' ముద్రణాలయానికి అధికారి అయ్యాడు. 'సత్యవాదిని' పత్రికా సంపాదకులలో ఒకరిగా నియమింప బడ్డారు. ఈ సంతోషంతో వీరభద్రరావు గారు పత్రికా వ్యాసంగాన్ని మరికొంతకాలం ఉత్సాహంతో కొనసాగించారు. కానీ వీరేశలింగం గారికి, వీరభద్రరావుగారికి అభిప్రాయ భేదాలు వచ్చాయి. ప్రజలలో 1905 నాటికి స్వాతంత్ర్యాభి మానము, జాతీయతా భావము వీరేశలిగం గారిపై అంతగా ప్రభావాన్ని చూపలేదనే చెప్పాలి. ఆ కాలంలోనే వైశ్రాయి కర్జన్ చేసిన బెంగాలు విభజన ప్రజలలో జాతీయ చైతన్యాన్ని ఎక్కువ కావడానికి కారణం అయింది. వీరభద్రరావు గారు వీటివైపు ఎక్కువ ఆకర్షితులు అయ్యారు. జాతీయోద్యమ ప్రభావితుడైన వీరభద్రరావు గారు ముఖ్యంగా సంఘ సంస్కరణాభిలాషి అయిన వీరేశలింగం పంతులు గారి పత్రికా ఉద్యోగం నుండి తప్పుకోవలసి వచ్చింది.

కానీ కొద్ది కాలంలోనే వీరేశలింగం గారి 'చింతామణి' ముద్రణాలయాన్ని సత్యవోలు గున్నేశ్వరరావు గారు కొన్నారు. వారి కోరికతో వీరు మరలా కార్య నిర్వహణాధికారి అయ్యారు. గున్నేశ్వరరావు గారి 'ఆంధ్ర కేశరి' పత్రికకు సంపాదకునిగా చేరారు. ఈ కాలంలో వీరు దేశంలో రాజకీయ ఉద్యమం వ్యాప్తి చెందుటకు పత్రిక ద్వారా తనవంతు కర్తవ్యాన్ని నిర్వహించారు.

ఒక జాతి క్లిష్ట పరిస్థితులను అనుభవిస్తున్నప్పుడు లేదా కీర్తి ప్రతిష్ఠలకు దూరంగా ఉన్నదన్న భావన కలిగినప్పుడు గత చరిత్ర ఔన్నత్యాన్ని కీర్తించు కొంటుంది. దీని వలన జాతి చైతన్యం పొందుతుంది. అప్పటి ఆంధ్రదేశ పరిస్థితులను అర్థం చేసుకున్న వీరభద్రరావు గారు ఆంధ్రుల ఔన్నత్యాన్ని జాతికి తెలియజేయాలనే ఉద్దేశంతో ఆంధ్రుల చరిత్ర రాయాలని నిర్ణయించుకున్నారు. అందువల్ల పత్రికా రచనకు స్వస్తి చెప్పి 1909లో మద్రాసు వెళ్ళారు.

దేశ చారిత్రక అంశాలతో పాటు ప్రాపంచిక అంశాలను కూడా ప్రజలకు తెలిపి, చైతన్య వంతులు చేయడానికై 1906లో మద్రాసు నందు కొమర్రాజు వెంకటలక్ష్మణరావు గారు 'విజ్ఞాన చంద్రికా గ్రంథమాల'ను స్థాపించారు. వీరభద్రరావు గారికి వీరితో సాన్నిహిత్యం ఏర్పడింది. అధిక శ్రమకోర్చి 'విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి' వారు 1910లో 'ఆంధ్రుల చరిత్ర' ప్రథమ భాగాన్ని, 1912లో రెండవ భాగాన్ని ముద్రించారు. ఈ గ్రంథములు ఆనాటి ప్రజలలో జాతీయ అభిమానాన్ని పెంచుటకు దోహదపడ్డాయి. ఈ విధంగా వీరు ఆంధ్రోద్యమానికి కృషి చేశారని చెప్పవచ్చు.

వీరు రాసిన 'ఆంధ్రుల చరిత్ర' రెండవ భాగంలోని కొన్ని విషయాలతో గ్రంధమండలి పోషకులు విభేదించారు. దీనివలన వీరభద్రరావు గారికి, ప్రచురణ సంస్థకు అభిప్రాయ భేదాలు వచ్చాయి. కొమర్రాజు లక్ష్మణరావు గారితో విభేదాలు, ఆంధ్ర సాహిత్య పరిషత్తు ప్రకటించిన లక్ష్యాలు, తెలుగు అకాడమీ ఉద్యోగ ప్రయత్నం విఫలం కావడంతో వీరభద్రరావు గారు మద్రాసు నుండి మరలా రాజమండ్రి చేరుకున్నారు. పై అంశాలను వీరే స్వయంగా 'ఆంధ్రుల చరిత్ర' రెండవ భాగంలో చెప్పుకున్నారు.

వీరభద్రరావు గారు మరలా రాజమండ్రిలో 'ఇతిహాస తరంగిణీ గ్రంధ మాల'ను నెలకొల్పి, 1916లో గ్రంధమాల ప్రథమ పుస్తకంగా 'ఆంధ్రుల చరిత్ర' మూడవ భాగాన్ని ప్రకటించారు. తర్వాత రాజమండ్రిలో 1925లో వీరు, భావరాజు వేంకట కృష్ణారావు, మల్లంపల్లి సోమశేఖరశర్మ గారు కలిసి 'ఆంధ్రేతిహాస పరిశోధక మండలి'ని స్థాపించారు. వీరు చారిత్రక ఆధారాలతో ఆంధ్రుల చరిత్రను 12సంపుటాలుగా రచించాలని సంకల్పించారు. కానీ 'ఆంధ్రేతిహాస పరిశోధక మండలి' వారు కాకతీయ సంచికను ప్రకటించ సంకల్పించారు. అందులో భాగంగా వీరభద్రరావు గారు తన చరిత్ర రచనలో ఐదవ భాగమైన 'కాకతీయాంధ్ర రాజయుగ చరిత్రము'ను 1936లో ప్రకటించారు. ఈ భాగాన్ని అప్పటికి కీర్తి శేషులైన కొమర్రాజు లక్ష్మణరావు గారికి అంకితమిచ్చి తన స్నేహాన్ని వెలిబుచ్చారు.

1928లో నంద్యాలలో జరిగిన ఆంధ్రమహాసభకు సర్వేపల్లి రాధాకృష్ణ గారు అధ్యక్షత వహించారు. ఆ సభలో వీరభద్రరావు గారిని 'ఆంధ్రచరిత్ర చతురానన' అనే బిరుదుతో సత్కరించారు. ఈ సంఘటనను వారి చరిత్ర పరిశోధకునిగా చేసిన సేవకు నిదర్శనం.

వీరభద్రరావు గారు 'ఆంధ్రుల చరిత్ర' వంటి చారిత్రక పరిశోధనలే కాక చారిత్రక నవలలు, వివిధములైన సారస్వత, సాంస్కృతిక రచనలూ చేశారు. వీరు ప్రథమంగా రాబర్ట్ స్యూయల్ రచించిన 'Forgotton Empire' ఆధారంగా 'జీర్ణకర్ణాట రాజ్యచరిత్రము' రచించారు. 1916లో 'కర్ణ సామ్రాజ్యము', 'నాయకురాలి దర్పము' అనే చారిత్రక నవలలు రాశారు. 1917 - 18ల మధ్య కాలంలో 'తిమ్మరుసు', 'తిక్కన సోమయాజి', 'శ్రీనాథ కవుల' జీవిత చరిత్రలను రచించారు. అంతే కాకుండా, రాజమహేంద్రపుర చరిత్రము, నవరసిక మనోల్లాసిని, హాస్య తరంగిణి, సుమిత్ర, వరలక్ష్మీ విలాసము, స్వయం సహాయము, హిందూ గృహము, హిందూ సంసారములు మొదలైన చారిత్రక, సాంస్కృతిక రచనలు చేశారు. 1930లో వీరు ప్రకటించిన 'అలియ

రామరాయలు' ముఖ్యమైన చారిత్రక రచన. 1937లో వీరు శ్రీ కల్లూరి వేంకటరామ శాస్త్రి గారి జీవిత చరిత్రను రాశారు. ఈ రచనలో శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి గారికి, కల్లూరి వారికి జరిగిన సారస్వత వివాదాలను వివరించారు.

ఈ విధంగా జీవితంలోని ప్రతి నిముషము చారిత్రక, సారస్వత పరిశోధనకు కృషి చేసిన చిలుకూరి వీరభద్రరావు గారు 17 మే 1939న కీర్తి శేషుడయ్యారు.

జీవితాంతము పరిశోధనలో మునిగి తనకు తెలిసిన సత్యాలను ప్రకటించిన ధీశాలి వీరు. చరిత్ర ఆధారాలతో నిర్మింపబడేది. అప్పటికి లభించిన ఆధారాలతో పరిశోధకులు చరిత్ర రాస్తారు. తర్వాతి కాలంలో దొరికిన ఆధారాల వలన పూర్వం రాసిన చరిత్ర కొంత మార్పులకు, చేర్పులకు లోనవుతుంది అన్నది చరిత్ర సత్యం.వీరభద్రరావు గారు 'ఆంధ్రుల చరిత్ర' రచన వలన తనపై వచ్చిన వ్యతిరేకతకు సమాధానమిస్తూ ఈ విషాయాన్నే చెప్తారు. 'ఆంధ్రుల చరిత్ర' మూడవ భాగం అవతారిక ఈ విషయం చెప్పారు.

'మిత్రులారా! నా గ్రంథములో లోపములుండవని గాని నా గ్రంథము సమగ్రమైనదని గాని నేనెన్నఁడును దలంచి గర్వము పడువాఁడను గాను. ఉపకరణములసంపూర్ణములుగాను వివాదాస్పదములు గాను నున్నంత వఱకుఁ జరిత్ర రచనము నాకే కాదు కొమ్ములు తిరిగిన వానికైన భ్రమ ప్రమాదములతోఁ గూడిన దోషములు లేక సమగ్రమైన ప్రమాణమై యుండునట్లు చేయుట సాధ్యము గాదు. ఆంధ్రదేశ చరిత్రాంశములను గూర్చి భావి పరిశోధకులకుఁసమన్వయ జేసి యొకరీతి చరిత్ర మాలను గాలక్రమ యుక్తముగా సమన్వయముఁ దోడ్పడు నట్లుగా సంపుటీకరణము చేయుటయె ప్రస్తుతము నేను చేయుపని. నా గ్రంథమంత దోషభూయిష్ఠమను కొన్నను దేశమునఁ జరిత్ర పరిశోధనమునకై పెక్కండ్రను బురికొలుపక మానదు. నా యభిప్రాయము లెన్నఁడు నితురలను బంధించునవి కావు. అసూయాపిశాచగ్రస్తులు గాక సత్యాన్వేషణ పరులై యెవ్వరైనను సహేతుకముగా నా యభిప్రాయములను ఖండింప వచ్చును. దాన నా కొకింతయు నపయశంబు కలుగఁబోదు. విమర్శ మూలముననే సత్యము తేటపడి పరిశుద్ధమైన చరిత్రము వెల్వడు ననుటకు లేశమాత్రమును సందియములేదు.'

చరిత్ర రచనా కారునికి వీరభద్రరావు గారి మాటలు భవిష్యత్ దృష్టిని తెలియ జేస్తాయి. వీరి రచనా కాలం నాటికి వీరికి లభించిన ఆధారాలను బట్టి వీరు 'క్షత్రియులకూ, రెడ్లకూ: వెలమలకూ, రెడ్లకూ సంబంధ బాంధవ్యాలు' ఉన్నాయని ప్రకటించారు. ఈ అంశమే ఎక్కువ మంది కోపమునకు కారణమైంది. పై అంశాన్ని ప్రకటించ వద్దని వేదం వేంకటరాయ శాస్త్రి గారు కూడా

్చరించారట. కానీ వీరభద్రరావు గారు దానిని లెక్క చేయ లేదు. అందువలననే
। మద్రాసు నుండి రాజమండ్రి రావలసి వచ్చింది.

వీరేశలింగంపంతులు గారితో అభిప్రాయ భేదాలు వచ్చినా, విజ్ఞాన
ధికా గ్రంధమండలి వారు 'ఆంధ్రుల చరిత్ర' మూడవ భాగమును ప్రకటించడానికి
కరించినా, చివరకు 'ఆంధ్రేతిహాస పరిశోధక మండలి' లో ఎక్కువ కాలం
సాగక పోయినా తను నమ్మిన సత్యాన్ని ప్రకటించడానికి ఎన్నడూ వెనుకాడని
వీరభద్రరావు గారు. అప్పటి కృష్ణాపత్రికలో 8 ఫిబ్రవరి 1941న చెళ్ళపిళ్ళ
ట శాస్త్రి గారు వీరి గురించి ఇలా రాశారట.

"వీరు సత్యవాక్పరులు. ఈయనకు దొరికిన ఆధారాల బట్టి ఎంత
వలసి వస్తుందో అంతా, కుండ పగలగొట్టినట్లు వ్రాయటమే కాని, వారు
నుకుంటారో అన్న సందేహం వీరికి లేశమున్నా ఉన్నట్లు లేదు..... రావుగారు.....
నికి తాను నమ్మిన సత్యాన్ని తెలియజేయుటకు వెనుదీయ లేదు." ఈ విధమైన
్యక్తిత్వమే 'ఆంధ్ర భాషా సాహిత్య'కు, 'తెలుగు అకాడమీ' మేనేజరు పదివికి
। దూరం చేసింది.

వీరు రాసిన 'కల్లూరి వెంకట రామశాస్త్రి జీవిత చరిత్ర' 20వ శతాబ్దపు
ు భాగంలోని సాహిత్య సమాజ సాంస్కృతిక విషయాలను తెలియజేస్తుంది.
విధంగా 'శ్రీనాధుని జీవిత చరిత్ర'లో అంతవరకు పండితలోకంలో వున్న
ధుని బోగలాలస జీవితాన్ని పూర్తిగా ఆధారాలతో ఖండించారు. 'జీర్ణ కర్ణాట
రాజ్య చరిత్ర' విజయ నగర సామ్రాజ్య చరిత్రను తెలియజేస్తుంది. చరిత్ర
లో వీరు రాసిన కొన్ని అంశాలను తర్వాత మార్పులు చేయవలసి వచ్చింది.
నా ప్రధమంగా వీరి పరిశోధనా కృషిని తప్పక ప్రశంసించ వలసిన అవసరం
।.

వీరభద్రరావు గారి 'చారిత్రక పరిశోధనా విజ్ఞానము, నిశిత నిర్ణయ
్శనా నైపుణ్యము, ఉద్రేక భూయిష్ఠ రచనా విధానము'లు గొప్పవి. ఇన్ని
తలు ఉన్న వీరభద్రరావు గారికి చెప్పుకోదగిన గుర్తింపు రాలేదు అన్నది
ం. అదే విధంగా వీరి రచనలకూ పూర్తి గుర్తింపు రాలేదన్నదీ వాస్తవం. దీనికి
ాలు చెప్తూ అక్కిరాజు రమాపతిరావు గారు చెప్పిన మాటలు అక్షర సత్యాలు.

"తెలుగు వాళ్లు సంస్థా నిర్మాతలు కారు. స్థిరంగా నిలిచే పనులకు
్సహకులు కారు. ఐకమత్యమూ, ఉదారదృష్టి వాళ్ళకు తక్కువ. అందువల్ల ఎందరో
ావంతుల యోగ్యత నుంచి జాతి పొందవలసిన మేలు పొందలేక పోయింది."

---

## ఆధార గ్రంథాలు

1. రంగనాథా చార్యులు. కె. కె. 1990. తెలుగు సాహిత్యం చారిత్రక భూమిక. ఆంధ్ర సారస్వత పరిషత్తు. హైదరాబాదు.

2. రమాపతి రావు, అక్కిరాజు. 1991. ప్రతిభా మూర్తులు. జ్ఞాన దీపిక. హైదరాబాదు.

3. వీరభద్రరావు, కొత్తపల్లి. 1986. తెలుగు సాహిత్యంపై ఇంగ్లీషు ప్రభావం. శివాజి ప్రెస్. సికింద్రాబాదు.

4. వీరభద్రరావు, చిలుకూరి. - . ఆంధ్రుల చరిత్రము - 2.

5. వీరభద్రరావు, చిలుకూరి. 1916. ఆంధ్రుల చరిత్రము - 3. మనోరమా ముద్రాక్షరశాల. రాజమహేంద్రవరము.

6. సీతారామయ్య. కురుగంటి. 1994. నవ్యాంధ్ర సాహిత్య వీధులు. తెలుగు విశ్వవిద్యాలయం. హైదరాబాదు.

7. సౌభాగ్యమ్మ. ఎన్. హెచ్. - . మనం మన పాత్రికేయులు. ఎస్. హెచ్. ప్రచురణలు. తిరుపతి.

8. తెలుగు వైతాళికులు, సంపుటము - 3. 1979. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ. హైదరాబాదు.

9. విజ్ఞాన సర్వస్వము - 2. 1988. విజ్ఞాన సర్వస్వ కేంద్రం. తెలుగు విశ్వవిద్యాలయం. హైదరాబాదు.

# తొలితరం నాటక పరిశోధకులు

- చుండూరు మాణిక్యరావు

తెలుగులో ప్రౌఢ సాహిత్యం క్రీ.శ. 11వ శతాబ్దిలో ప్రారంభం అయింది. నన్నయ మహాభారతం తెలుగులోని తొలి ప్రౌఢగ్రంథం. నాటి నుంచి సంస్కృతం లోని ఇతిహాస, పురాణ, కావ్యాలు అనేకం తెలుగులోకి అనువదించబడ్డాయి. కొన్నినాటకాలు కూడా అనువదించారు. అవి తెలుగులో కావ్యరూపం అవతరించినవే కానీ నాటక రూపంగా రాలేదు. ఆంగ్ల సాహిత్య ప్రభావం తెలుగు సాహిత్యం మీద పడేంతవరకు తెలుగులో సంస్కృత నాటకాలకు యథాతదంగా కానీ ఆ తరహాలో నాటకాలు కానీ వెలువడ లేదు. కారణాలు ఏమైనప్పటికీ ఇంచుమించుగా భారతీయ భాషలన్నింటనూ ఇది సమాన ధర్మమే.

తెలుగు నాటక రచన క్రీ.శ.1860 ప్రాంతాలలో ఆరంభం కాగా, నాటక ప్రదర్శనం 1880 లో ప్రారంభం అయింది. నాటక దశకు ముందు మనకు యక్షగానం రూపంలో ప్రదర్శనలు ఉండేవని శ్రీనాధుని భీమేశ్వరపురాణం ఆధారంగా తెలుస్తుంది. భరతుని నాట్యశాస్త్రం ఆధరంగా చేసుకుని నాటకానికి సంబంధించిన అనేక విషయాలను రూపక లక్షణాలను పేర్కొంటూ నాటకాలను రాశారు.

1860 లో శ్రీ కోరాడ రామచంద్ర శాస్త్రి 'మంజరీమధుకరీయం' నాటకాన్ని రచించి ప్రధమాంధ్రనాటక కర్తలయినారు. 'నరకాసుర విజయ వ్యాయోగము' ను రచించి సంస్కృత నాటకాను వాదానికి కొక్కొండ వెంకటరత్నం పంతులు గారు నాంది పలికారు.ఈ విధంగాతెలుగు నాటకం ప్రారంభం అయింది. ఇక తెలుగులో నాటక పక్రియపై తొలి తరంపరిశోధకులను పరిశీలిద్దాం.

తెలుగులో నాటక రంగంపై అధికంగా తొలితరంలో పరిశోధన చేసినవారు ఆచార్య పోణంగి శ్రీరామ అప్పారావు గారు , ఆచార్య మొదలి నాగభూషణ శర్మ గార్లను చెప్పవచ్చు. కానీ అసలు నాటకం పై పరిశోధన ప్రారంభించినవారు అచార్య దివాకర్ల వేంకటావధాని గారు ఉన్నారు. అయితే తొలి తరంలో రచయితలపై వచ్చిన పరిశోధనలో నాటకం ప్రస్తావించినప్పటికీ నాటకాన్ని పూర్తిగా పరిశోధనాంశంగా తీసుకున్నవారు లేరు .అందుకే పైన పేర్కొన్న ముగ్గురూ పరిశోధకులను నాటకరంగంలో తొలితరం పరిశోధకులుగా పరిగణించవచ్చును.

డా.దివాకర్ల వేంకటావధానిగారు

ఆధునికాంధ్ర సాహిత్యాచార్యులు దివాకర్ల వేంకటావధానిగారు 1937లో ఆంధ్ర విశ్వవిద్యాలయం లో ఎం.ఎ ఆనర్సు పట్టాకోసం 'ఆంధ్రనాటక పితామహుడు'

---

తెలుగులో తొలితరం పరిశోధకులు-జాతీయసదస్సు,
తెలుగుశాఖ, హైదరాబాదు విశ్వవిద్యాలయం-నవంబరు 7-9,2005

అనే పరిశోధన (సిద్ధాంత)వ్యాసాన్ని రాశారు. తరువాత ఇది గ్రంధరూపం దాల్చింది.

దివాకర్ల వేంకటావధాని గారు పశిమగోదావరిజిల్లా ఆకుతీగపాడులో 1912జూన్ 23 వతేదీన జన్మించారు. ఈయనది అసలు గ్రామం యండగండి. దివాకర్ల విద్యాభ్యాసం యండగండి, ఉండి, బందరు, విశాఖపట్నంలలో కొనసాగింది. 1934 లో విశాఖపట్నంలో తెలుగు పండితునిగా వృత్తి ప్రారంభమయిన దివాకర్ల ఉస్మానియా విశ్వవిద్యాలయలో ఆచార్యునిగా, డీన్‌గా పదవీ బాధ్యతలు నిర్వహించారు. దివాకర్ల తెలుగు సాహిత్యంకు చేసిన సేవ చూస్తే పద్య కావ్యాలు, వచనకావ్యాలు, విమర్శకావ్యాలు అనేకం. నాటకంపై తొలి రచన మాత్రమే .

దివాకర్ల వేంకటావధానిగారు రాసిన ఆంధ్రనాటక పితామహుడు గా ప్రఖ్యాతి గాంచిన ధర్మవరం రామకృష్ణమాచార్యులు నాటక రంగంలో చేసిన కృషిని వివరించారు. రామకృష్ణమాచార్యులు గారు ముప్పై కిపైగా నాటకాలు రాశారు. చిత్రనళీయము, విషాద సారంగధర, దుకాపట్టాభిషేకము మొదలయిన14 నాటకాలనుఅవధానిగారు ఈవ్యాసంలో వివరించారు. వ్యాసంలో 13 భాగాలను పేర్కొన్నారు .ఆంధ్ర నాటకాల ఆరంభ దశను మొదటి విభాగంలో, ధర్మవరంవారి నాటక వస్తువులకు ఇతిహాస పురాణ ప్రబంధాలని రెండో భాగంలో తెలిపారు. మూడో భాగంలో పాచ్యాత్య విషాదాంత నాటక లక్షణాలను, బేధాలను తెలిపి అభిజ్ఞాన మణిమంతము, పాదుకాపట్టాభిషేకము విషాదసారంగధర నాటకాలను ఆ ధృక్పధంతో దివాకర్ల వివరించారు.

ధర్మ వరంవారి నాటాకాల్లో వస్తు నిర్మాణ సంవిధానాన్ని, మూలభిన్న కల్పనలు వాటి ప్రాయోజనాలను నాలుగవ భాగంలో వివరించారు. ఆరోభాగంలో పూర్వ రంగాదుల విషయంలో అనుసరించిన ప్రాచ్య పాశ్చాత్య పద్ధతుల సమీక్ష, నాటక సమయయములు 7వ భాగములోనూ, 8వ భాగములో పాత్రపోషణ గూర్చి,రచనా విశేషాలను గూర్చినపరిశీలన 9వ భాగములోనూ తెలిపారు. 10, 11 భాగాలలో మానవ జీవితం పట్ల ధర్మవరం వారికి ఉన్న అవగాహన, 12వ భాగంలో ధర్మవరం వారి నాటకాలలో హాస్యం, 13వ భాగంలో ఆంధ్ర నాటక పితామహుని వ్యక్తిత్వాన్ని సందర్శించడం సమీక్షించారు. ఈ విధంగా ఆంధ్ర నాటక ఆరంభదశను సూక్ష్మంగానూ, రామాకృష్ణమాచార్యులు గారి నాటకాలను ప్రత్యేకంగానూ పరిశీలించి దివాకర్ల వెంకటావధాని గారు తెలుగులో నాటక ప్రక్రియపై తొలి పరిశోధన (సిద్ధాంత) వ్యాసం రాశారు.

శా.పోణంగి శ్రీరామ అప్పారావు.

నాటక రంగం పై అవిరళ కృషి చేసిన డా.పోణంగి శ్రీరామ అప్పారావు. 'తెలుగు నాటకవికాసం' పేరుతో వంద సంవత్సరాల నాటక చరిత్రను పరిశోధన గ్రంధములో పొందు పరిచారు. డా.పి.యస్.ఆర్. అప్పారావు గారు గూర్చి క్లుప్తంగా పరిచయం చేసి, తరువాత తెలుగు నాటకంపై ఆయన పరిశోధన పరిశీలిద్దాం. 1923 జులై 21 వ తేదీన పశ్చిమగోదావరి జిల్లా కొవ్వూరు తాలూకా బందపురం గ్రామంలో శ్రీరారమమూర్తి, లక్ష్మీనరసమ్మ లకు అప్పారావు గారు జన్మించారు. ఈయన కొవ్వూరు, విజయవాడ, విశాఖపట్నం(ఆంధ్రా), హైదరాబాదు (ఉస్మానియా) లలో విద్యాభ్యాసం చేశారు. భీమవరం, రాజమండ్రి, కడప, శ్రీకాకుళం, మద్రాసు ప్రెసిడెన్సీ కళాశాలలో పనిచేసారు. అంతర్జాతీయ తెలుగుసంస్థలవ్యవస్థాపకడైరెక్టరుగా, సాంస్కృతిక వ్యవహారాలఅధ్యక్షుడిగా కూడా డా.పి.యస్.ఆర్.అప్పారావు పనిచేశారు. ఈయన మలేషియా, సింగపూరు, అమెరికా తదితర దేశాలు పర్యటించారు. ఈయన సంపాదకత్వంలో శ్రీకాళహస్తీశ్వర మహాత్మ్యం, విషాద సారంగధర, Historical Tables (History of Andhra pradesh as main Entry-1983),Antonyms and Synonyms (English to telugu), మానవల్లి కవి రచనలు తదితరలు వెలువడ్డాయి.

డా.పి.యస్.ఆర్ అప్పారావు రచనలు పరిశీలిస్తే తాజ్‌మహల్(నాటిక), విశ్వభారతి (నవల), నాట్య శాస్త్రం(భరతమునినాట్య శాస్త్రమునకు సమగ్రానువాదం, దీనికి ఉత్తమ గ్రంధకర్తగా 1961 లో జాతీయ బహుమతి లభించింది)తెలుగు నాటక వికాసం పరిశోధనా గ్రంధం, ధర్మవరపు రామకృష్ణాచార్య (జీవితం రచనలు), నృత్యకళా - తెలుగుదేశం, భారతీయ నాటక రంగం (ఆద్య రంగాచార్య ఆంగ్ల గ్రంధాను వాదం), ప్రధమాంధ్ర నాటక కర్తలు వంటి రచనలతో పాటు అనేక నాటక, నాట్య, సాహిత్య సంబంధ మయిన గ్రంధాలు అనేకం రచించారు.

నాటక స్వరూప స్వభావాలను, రూపక కళ పుట్టు పూర్వోత్తరాలను, తెలుగు నాటకోత్పత్తి వికాస విశేషాలను సమగ్రంగా సమీక్షించి డా.పి.యస్.ఆర్. అప్పారావు గారు తెలుగు నాటక వికాసమున పరిశోధనా గ్రంధం రాశారు. ఇందులో 1860 నుంచి 1960 వరకు వందేళ్ళ తెలుగు నాటక వికాసాన్ని సమగ్రంగా సమీక్షించారు. ఇంతపెద్ద ఎత్తున నాటక ప్రక్రియ పై పరిశోధనా గ్రంధం రావడం ఇదే మొదటిది. "నాటక రంగంలో భావి పరిశోధకులకు ఈ నా పరిశోధన పునాది కాగలదని విశ్వసించుచున్నాను" అని డా.పి.యస్.ఆర్. అప్పారావు గారు తెలుగు నాటక వికాసం ప్రస్తావన (పుటxiv) లో పేర్కొన్న మాట అక్షర సత్య మయింది.

ఈ పరిశోధనా గ్రంధములో అయిదు భాగాలున్నాయి. మొదటి భాగంలో ఆంధ్ర నాటక పూర్వ రంగం, నాట్యకళ విశిష్టస్వరూపాన్ని , ప్రాచ్య పాశ్చాత్య రూపక స్వరూప స్వభావాలను, ప్రాచీనాంధ్ర దేశంలో నృత్య నాట్య వికాస విశేషణ వివరాలు వివరించారు. ఇందులోనే తెలుగు కళలయిన బొమ్మలాటలు, యక్షగానాలు, కొరవంజి, పగటివేషాలు మొదలగు దేశి దృశ్య కళారూప లక్షణాలను తెలిపారు.

ద్వితీయ భాగంలో ఆధునికాంధ్ర నాటకాల ఆరంభ వికాసాలను వివరించారు. ఇందులో 1860 నుంచి1886 వరకు గల ఆంధ్ర నాటక రచనా విధానం, ప్రదర్శన ప్రారంభ దశలను పరిశీలించారు. కోరాడ శ్రీరామచంద్రశాస్త్రి, కొక్కొండ వెంకటరత్నం పంతులు, పరవస్తు వెంకట రంగాచార్యులు, వావిలాల వాసుదేవశాస్త్రి, కందుకూరి వీరేశలింగం పతులు, గురజాడ శ్రీరామమూర్తి, కొండుభట్ల సుబ్రమణ్యశాస్త్రి, వడ్డాది సుబ్బారాయుడు, నాదెళ్ళ పురుషోత్తమ కవి రచించిన నాటకాలను విపులంగా సమీక్షించారు. రెండో భాగంలోనే ద్వితీయ అధ్యాయం లో 1886 నుంచి1900 వరకు తెలుగు నాటక రచన ఏ విధంగా బహుముఖాలుగా వికసించిందో వివరించారు. ధర్మవరం, చిలకమర్తి, వేదం, గురజాడ, కోలాచలం, పానుగంటి వంటి ప్రముఖ నాటక కర్తల నాటాకాలను పరిశీలించారు. తృతీయ అధ్యాయంలో 1900 నుంచి 1920 వరకు శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి, తిరుపతి వెంకటకవులు, బలిజేపల్లి లక్ష్మీకాంత కవి, కాళ్ళకూరి నారాయణ రావు తదితరులు నాటక రచన ప్రయోగానికి, విస్తృతికి చేసిన కృషిని వివరించారు. 1920 నుంచి 1944 వరకు నాటక రచనలో వచ్చిన కొత్త ప్రయోగాలు నాల్గవ అధ్యాయంలోనూ, నాటకాలు ,ఏకాంకికల వికాసం ప్రసిద్ధ నాటక కర్తల కృషి అయిదవ అధ్యాయంలో చెప్పారు. 1944 తరువాత నాటక చరిత్రను కొన్ని పక్రియలను రేఖామాత్రంగా నిరూపించడం ఆరవ అధ్యాయంలో జరిగింది.

ఈ గ్రంధములో ఆంధ్రనాటకచరిత్ర సింహావలోకనం, ఇతివృత్త వ్యాస రూపాను గుణంగా నాటకరచన సమీక్షించడం, తెలుగు నాటక విమర్శను అవలోకించడం, సమస్యలను పమీక్షిండం జరిగింది. సంస్కృత, ఆంగ్ల రూపకాను వాదాలు, స్వతంత్ర, విషాధ రూపకాలు, ప్రహసనాలు, ఏకాకికలు, పద్య నాటికలు, గేయ నాటికలు, రేడియో నాటికలు, మూడవ భాగంలో ప్రస్తావించారు.

4, 5 భాగాలు అనుబంధాలకు సంబంధించినవి. మొదటి అనుబంధం రచనలు (నాటిక, నాటకాలు) విమర్శలు, రెండవ దానిలో రచయితల జాబిత, మూడవ దానిలో ప్రసిద్ధ నటులు - నాటక సమాజాల పేర్లు, నాల్గవ దానిలో ఉపయుక్త

గ్రంధాలు, ఐదవ దానిలో ముఖ్య పదానుక్రమణికాలు సూచించ బడ్డాయి. ఇందులోనే విమర్శకులు, పోషకులు, నటీనటుల చిత్రాలు చేర్చబడ్డాయి.

డా. పి. యస్. ఆర్. అప్పారావు గారి తెలుగు నాటక రంగంపై పరిశోధనా పటిమకు, వైదుష్యానికి, విజ్ఞాను రక్తికి, విమర్శనా నైపుణ్యానికి, రచనా సారళ్యానికి ఈ పరిశోధనా గ్రంధం పతాక సదృశ్యం. అలంకార శాస్త్రానికి, భరతుని నాట్యశాస్త్రములా ఆంధ్రనాటక పరిశోధనకు ఈ తెలుగు నాటక వికాసము అంతే ప్రాధాన్యము సంతరించుకున్నది.

డా. మొదలి నాగభూషణ శర్మ

తెలుగు నాటక పరిశోధనలో మరో ప్రముఖ వ్యక్తి డా. మొదలి నాగభూషణ శర్మ. ఈయన సంపాసకత్వములో ఆచార్య ఆత్రేయ, నూరేళ్ళతెలుగు నాటక రంగం, నాట్యకళ తెలుగు నాటక రంగ శతజయంతి సంచికలు వచ్చాయి. 'కన్యాసుల్కం -నూరేళ్ళ సమాలోచనం' లో కన్యాసుల్కం పై వివిధ దృక్కోణాలలో మొత్తం 183 వ్యాసాలు ప్రముఖ విమర్శకులు రాసిన నాటక విమర్శ వ్యాసాలు కన్యాసుల్కం - నూరేళ్ళ సమాలోచనంలో పొందు పరిచారు. చిలకమర్తి లక్ష్మీనరసింహం నాటాక రంగంలో తనస్థానం, విమర్శన దృష్టి, నాటక రచనా విధానం, వస్తు వైవిధ్యం మొదలయిన అంశాలను ప్రస్తావిస్తూ 'నాటక కర్త చిలకమర్తి' విమర్శనా గ్రంధం రాశారు. అంతే కాకుండా విషాదాంతం, రాజా ఈడిపస్, మన్మధుడుమళ్ళీపుట్టాడు వంటి నాటకలు రాసి ప్రశంసలు పొందారు. తెలుగు సాహిత్యం - గాంధీజీ ప్రభావం, Ballari Raghava-Prince of players, The Flute and Drum - Essays on SarijiniNaidu, The Master and Disciple, The Shadow Puppet Theatere of Andhrapradesh, Acarya Atreya మొదలయిన విమర్శనా గ్రంధాలు రాశారు .

డా. మొదలి నాగభూషణ శర్మ ఉస్మానియా విశ్వ విద్యాలయంలో స్నాతకోత్తర నాటక విభాగం అధ్యక్షులుగా పనిచేశారు. ఈయన రాసిన రాజా ఈడిపస్ నాటకం ప్రఖ్యాతగ్రీకు రచయిత 'సోఫోక్లిస్' నాటకానికి స్వేచ్ఛానువాదం. ఈ అనువాద నాటకంతో పాటుగా గ్రీకు నాగరికత, గ్రీకు నాటక ఆవిర్భావం, విషాద నాటకం (ట్రాజడి) లను తెలుగు వారికి పరిచయం చేశారు. సాటిర్ నాటకం - సాటిర్ విషాద నాటకం అని , సాటిర్ అంటే నాటక జీవితం అని అరిస్టాటిల్ అభిప్రాయం (సాటిర్ అనగా అరణ్య దేవత అని అర్ధం). నాటక పోటీలు , రంగ స్థలం ప్రేక్షకాగారం (Stage and Auditirium) మొదలయిన విషయాలను వివరించారు.

మన్మధుడు మళ్ళీ పుట్టాడు నాటకంలో "మనిషి వేరే మనిషి కాడు. పైకి వ్యక్తం చేయ లేని భావాలకు ప్రతిరూపం, కళ్యాణి పైకి మాట్లాడే ప్రతి మాట తను మాట్లాడే విధంగా కాక 'మనిషి' మాట్లాడే విధంగా ఉంటే ఎలా ఉంటుందని బేరీజు వేసు కోవడం ద్వారా Realistic Form లో ఈనాటకాన్ని చూడ్డానికి ప్రేక్షకుడు ప్రయత్నిస్తాడు." అని డా. చాట్ల శ్రీరాములు గారి అభిప్రాయం. డా. మొదలి నాగభూషణ శర్మ నాటక రచన, పరిశోధనతో పాటుగా పలు నాటకాలకు దర్శకత్వం, నటన కూడా చేశారు.

ఈ విధంగా తెలుగు నాటక రంగలో తొలి తరం పరిశోధకులుగా డా. దివాకర్ల వేంకటావధానిగారు, డా.పోణంగి శ్రీరామ అప్పారావుగారు, డా.మొదలి నాగభూషణ శర్మ గార్లను చెప్పవచ్చు.

ఇది కాకుండా నాటక ప్రక్రి యా పరంగా మరికొన్ని పరిశోధనలు అనేక కోణాలలో వెలువడ్డాయి అవి సూచన ప్రాయంగా పరిశీలిస్తే -

తెలుగులో విషాద రూపకలు - కస్తూరి ఉదయభాస్కర లక్ష్మి(ఉస్మానియా 1977)
తెలుగులో ప్రహసనాలు - జి.శేషారెడ్డి(మద్రాసు1978)
తెలుగులో గేయ నాటికలు - తిరుమల శ్రీనివాసాచార్య(ఉస్మానియా 1978)
ఆంధ్రమున ప్రబంధరూపము నొందిన సంస్కృత నాటకములు
శ్రీమతి సి.రాజేస్వరి(బెంగుళూరు1978)
కన్యాసుల్కం ఒక విమర్శ - శ్రీప్రభాకర్ ఫణిరాజ(1980)
డా.జి.వి.కృష్ణారావు నాటికాసాహిత్య సమాలోచన - మంగళగిరి ప్రమీలాదేవి (నాగార్జున 1981)
విశ్వనాధవారి నర్తన శాల ఒకపరిశీలన - ఆర్ కమల(హైదరాబాదు1982)
కవిరాజు త్రిపురనేనిరామస్వామి చౌదరి నాటకాలలో హేతువాద ధృక్పధం
కొండపల్లి సుదర్శన్ రాజు(హైదరాబాదు1983)
ఆంధ్రనాటక రంగ చరిత్ర - మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి(వ్యాసం-1954-55)
(ఇది తెలుగు భాషా సమితి జాతీయ అవార్డు పొందింది.)
ఆంధ్ర సారస్వతము నందలి వీర రసము - జి.వి.సుబ్రమణ్యం(వ్యాసం 1959-60)

వీటితో పాటుగా ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమి తదితర వ్యాసాలు వెలువడ్డాయి. ఇవి కాకుండా సాంఘిక, పౌరాణిక, చారిత్రక రసాధారంగా,వస్తువు ఆధారంగా, ఒకనాటకం ఆధారంగా, సామాజిక అంశం ఆధరంగా అనేక పరిశోధనలు తెలుగు నాటక ప్రక్రియలో వచ్చాయి. వస్తున్నాయి.

## ఉపయుక్త గ్రంధసూచి

కుమార స్వామి నాయుడు, గోళ్ల. దివాకర్ల వేంకటావధాని జీవితం - సాహిత్యం.
నాగభూషణ శర్మ, మొదలి. నాటక కర్త చిలకమర్తి.
నాగభూషణ శర్మ, మొదలి. నూరేళ్ల తెలుగు నాటక రంగం.
నాగభూషణ శర్మ, మొదలి. రాజా ఈడిపస్ (నాటకం).
నాగభూషణ శర్మ, మొదలి. మన్మధుడు మళ్ళీపుట్టాడు. (నాటకం).
నాగభూషణ శర్మ, మొదలి. ప్రశాద్, ఏటుకూరి. కన్యాశుల్కం - నూరేళ్ళ మాలోచనం.
మూర్తి, డి. ఎస్. ఎన్. తెలుగు సాహిత్యంలో నాటిక రచన. (వ్యాసం).
రామకృష్ణారావు, గోవిందరాజు. నూరేళ్ల తెలుగు నాటక రంగం - సింహావలోకనం. ్యాసం)
వేంకటవధాని, దివాకర్ల. ఆంధ్రనాటక పితామహుడు.
). శ్రీరామ అప్పారావు, పోణంగి. తెలుగు నాటక వికాసం
1. శ్రీరామ అప్పారావు, పోణంగి. నాట్యశాస్త్రం (విశ్లేషణాత్మక అధ్యయనం)
2. శ్రీరామ అప్పారావు, పోణంగి. తెలుగులో నాటక రచనా శిల్పం. (వ్యాసం).
3. శ్రీరాములు, చాట్ల. తెలుగు నాటకంపై పాశ్చాత్య నాటక ప్రభావం. (వ్యాసం)
4. శ్రీనివాసాచార్య, తిరుమల. తెలుగులో పరిశోధన నాటక ప్రక్రియ (వ్యాసం)
5. సాంబశివ రావు, కందిమళ్ళ. తెలుగు నాటకరంగం నూతన ధోరణులు - ్రయోగాలు.

# తొలితరం కథా పరిశోధకులు

- డా॥ తుమ్మల రామకృష్ణ

ఆధునిక వచన సాహిత్య ప్రక్రియలలో కథానిక ఒకటి. కథ చెప్పడం భార యుసంప్రదాయంలో అతిప్రాచీన కాలం నుంచి ఉంది. ఆధునిక కథానిక ల్ప ప్రధానమైంది. సమకాలీన జీవితం లోంచి వస్తువును గ్రహించి రచయిత నదైన నేర్పుతో కథగా తీర్చిదిద్దుతాడు. వస్తువు ఎంత గొప్పదైనా శిల్పం బాగాలేకుంటే థ నిస్సారంగా తయారవుతుంది. కథారచనలో వస్తు శిల్పాలు రెండూ ముఖ్యం.

పాలగుమ్మి పద్మరాజు రాసిన 'గాలివాన' కథ తెలుగు వాళ్ళకి అంతర్జాతీయ ర్తిని ఆర్జించి పెట్టింది. జాతీయ స్థాయిలో తెలుగు కథకులు విశిష్ఠ గౌరవాలను ొందారు. ప్రధానంగా కాళీపట్నం రామారావు, మధురాంతకం రాజారాం, కేతు విశ్వ ాథరెడ్డి లాంటి కథకులు.

ఈ పత్రంలో స్థూలంగా కథా రచనకు సంబంధించిన ప్రాథమిక అంశాలను వరించి, ఆ తర్వాత తొలితరం కథా పరిశోధకుల కృషిని తెలియజేయడానికి ప్రయ త్నిస్తాను.

పెట్టుబడిదారీ సమాజం మానవ ప్రపంచానికి అందించిన అపురూపమైన ానుకల్లో కథానిక లేదా కథ ఒకటి.

''కథానిక తెలిపైన పాఠకుడు ఏకాంత సమయంలో చదువుకొనే వచన సాహిత్య ప్రక్రియకు'' సంబంధించినది.

ఆధునిక కథలో శిల్పం ముఖ్యం. వస్తు శిల్పాలు రెండూ పొందిగ్గా అమరిన థలే ఉత్తమ కథలుగా గౌరవింపబడతాయి. వస్తువు రచయిత జీవితానుభవం మీద ఆధారపడి ఉంటుంది. శిల్పం రచయిత అధ్యయనం, అవగాహన, ఆలోచన మీద ఆధారపడి ఉంటుంది. సాధారణంగా కథా రచన ఒక పాత్ర మీదనో, ఒక సంఘటన మీదనో, ఒక భావం మీదనో ఆధారపడి ఉంటుంది. కథా రచనకు సంబంధించి వస్తు నియమాలు ఏమీలేవు. మానవ జీవితానికి సంబంధించిన ఏ అంశం మీద అయినా కథ రాయవచ్చు. అయితే రాసే అంశం మీద రచయిత మంచి అవగాహన కలిగి ఉండాలి. రచయితకు సమాజ సంబంధమైన అవగాహన చాలా అవసరం. మానవ సమాజం ఏకశిలా సదృశ్యం కాదు. సమాజం విభిన్న వ్యక్తుల, కులాల, మతాల, జాతుల, భావాల, విశ్వాసాల, సంస్కృతుల, ఆలోచనల అభిప్రాయాల, విలువల, సంబంధాల, వైరు ధ్యాల, వైవిధ్యాల సంక్లిష్ట సమాహారం. ఈ మానవ సమాజాన్నీ సాంఘిక, సాంస్కృతిక, ఆర్థిక, రాజకీయ శక్తులు నడిపిస్తూ ఉంటాయి. వ్యక్తి సమాజంలో అంతర్భాగం. వ్యక్తి తన

గురించి తాను తెలుసుకుంటూ తన చుట్టూ ఉన్న సమాజాన్ని గురించి, దాన్ని నడిపించే శక్తుల గురించీ తెలుసుకునే ప్రయత్నం చేస్తూ ఉంటాడు. వ్యక్తి చైతన్యవంతమయ్యే కొద్దీ అనేక సవాళ్ళు ఎదురవుతూ ఉంటాయి. వాటన్నిటి అధిగమించడానికి వ్యక్తి మరింత చైతన్యవంతం కావల్సి ఉంటుంది. వీటన్నిటిపట్ల రచయిత లేదా రచయిత్రి మౌళికమైన అవగాహన కలిగి ఉండాలి. విభిన్న శాస్త్రాలస్థూల అవగాహన కలిగి ఉండాలి. జీవితం పట్ల, సమాజం పట్ల తనదైన ఆలోచన, దృక్పథం, అవగాహన కలిగి ఉండాలి. ఏది మంచో ఏది చెడో నిష్పాక్షికంగా చెప్పగల్గిన జ్ఞానం కలిగి ఉండాలి. ముఖ్యంగా సాహిత్యం పట్ల గౌరవం, నమ్మకం కలిగి ఉండాలి. సాహిత్యం సమాజ అభివృద్ధికి తోడ్పడుతుందనే బలమైన విశ్వాసం కలిగి ఉండాలి.

కథలు రాయాలనుకొనే వ్యక్తి మొట్టమొదట విరివిగా కథా సాహిత్యం చదవాలి. వచనంపై పట్టు సంపాదించాలి. కథా నిర్మాణానికి సంబంధించిన క్లుప్తత, అనుభూతి ఐక్యత, సంఘర్షణ, ఎత్తుగడ, కథనం, పాత్రచిత్రణ, కంఠస్వరం, నేపధ్య చిత్రణ, స్థల కాలాల వర్ణన మొదలైన ప్రాథమిక అంశాలపట్ల స్పష్టమైన అవగాహన కలిగి ఉండాలి.

చెప్పాలనుకున్న అంశాన్ని సూటిగా, స్పష్టంగా, సరళంగా, పాఠకుల హృదయాలకు హత్తుకొనేలా చెప్పే నేర్పు కలిగి ఉండాలి. పేరును అచ్చులో చూసుకోవడం కోసమో, కీర్తికండూతి కోసమో, మరేదో స్వప్రయోజనం కోసమో రచనకుపక్రమిస్తే, అలాంటి వాళ్ళ రచనల్లో కాగితపు పూలు లాంటి కథలు తప్ప, ప్రకృతి సిద్ధమైన పరిమళ భరితమైన పువ్వుల్లాంటి కథలు కనిపించవు.

ఆధునిక తెలుగు కథకు గురజాడ అప్పారావు (1910 దిద్దుబాటు) ఆద్యుడు. అయితే ఇటీవల ఆచంట వేంకట సాంఖ్యాయన శర్మ 1903లో 'లలిత' అనే కథ రాశాడనే వాదన ఉంది. ఆయకంటే ముందు 1902 లోనే బండారు అచ్చమాంబ 'స్త్రీవిద్య' అనే కథ రాసిందని 'నూరేళ్ళపంట' సంకలన కర్త భార్గవీ రావు చెపుతున్నారు. 'లలిత', 'స్త్రీవిద్య' కథలు సమగ్ర ఆధునిక కథానికా లక్షణాలు ఏమేరకు కలిగి ఉన్నాయో పరిశోధకులు దృష్టి సారించాల్సిన అవసరం ఎంతైనా ఉంది.

గత వంద సంవత్సరాల్లో దాదాపు రెండు లక్షల కథలు వెలువడినట్లు తెలుస్తోంది. కథకుల సంఖ్య కూడా తక్కువేమీ కాదు. 500 మంది కథా రచయితలు ఉన్నట్లు ఒక అంచనా.

తెలుగు కథను తీర్చి దిద్దిన ప్రసిద్ధ కథకులు – గురజాడ, చింతాదీక్షితులు, శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి, గుడిపాటి వెంకటాచలం, మునిమాణిక్యం నరసింహారావు, కొడవటిగంటి కుటుంబరావు, బుచ్చిబాబు, గోపీచంద్, రావిశాస్త్రి, చాసో, కాళీపట్నం

రామారావు, మధురాంతకం రాజారాం, మాగోఖలే, కరుణ కుమార, పాలగుమ్మి పద్మరాజు, పురాణం సుబ్రహ్మణ్యశర్మ, బుర్రా సుబ్రహ్మణ్యం, అవసరాల సూర్యారావు. కేతు విశ్వనాథ రెడ్డి, అల్లం శేషగిరిరావు, ముళ్ళపూడి వెంకటరమణ, భానుమతీ రామకృష్ణ, అబ్బూరి ఛాయా దేవి, ఇల్లిందలి సరస్వతి, కళ్యాణ సుందరీ జగన్నాథ్, సత్యవతి ... ఇలా ఎందరెందరో తెలుగు కథా వికాసానికి తమవంతు కృషిని అందించి ఉన్నారు.

1987 లో వెలిదండ నిత్యానంద రావు వెలువరించిన 'విశ్వవిద్యాలయాల్లో తెలుగు పరిశోధన' ఆధారంగా చూస్తే కథానిక సాహిత్యం మీద విశ్వవిద్యాలయాల్లో పరిశోధన 1964 నుంచి మొదలైనట్లు తెలుస్తోంది.

1977 లో పోరంకి దక్షిణామూర్తి ఆచార్య సి. నారాయణరెడ్డి పర్యవేక్షణలో ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగు శాఖలో ''తెలుగు కథానిక - స్వరూప స్వభావాలు'' అనే అంశం మీద పరిశోధన చేసి పట్టాపొంది, ఆ సిద్ధాంత గ్రంథాన్ని 1988 లో ప్రచురిస్తూ 'స్వగతం' లో అన్న మాటలు గమనించదగ్గవి.

''ఈ ప్రక్రియకు సంబంధించిన సాహిత్యశాస్త్రం అంతగా రూపొందలేదు. చెదురు మదురుగా వెలువడిన సమీక్షాత్మక వ్యాసాలు కొత్తగా కలం పట్టేవాళ్ళకు ప్రోత్సాహం ఇవ్వడానికి ఉద్దేశించిన మూడు నాలుగు సంగ్రహ రచలు తప్ప సమగ్రమై పరిశీలనాత్మక గ్రంథం ఏదీ ఇంతవరకూ వెలువడలేదు. దీన్ని దృష్టిలో ఉంచుకొని కొంతలో కొంతైనా కృషి చేసే అవకాశం లభించినందుకు ఆనందిస్తూ ఈ గ్రంథం రాశాను'' అంటారు.

ఈ మాటలు ముమ్మాటికీ నిజం. పోరంకి దక్షిణామూర్తికి ముందు 1964లో మద్రాసు విశ్వవిద్యాలయంలో నిడుదవోలు వేంకట్రావు పర్యవేక్షణలో సి. విజయలక్ష్మి 'తెలుగులో కథా సాహిత్యం' అనే అంశం మీద పరిశోధన చేసి ఎం.లిట్. పట్టా పుచ్చుకొన్నారు. 1969 లో ఢిల్లీ విశ్వవిద్యాలయంలో కె. వీరభద్రరావు పర్యవేక్షణలో సి.హెచ్. శారద 'తెలుగు కథానిక అవతరణ వికాసాలు' అనే అంశం మీద పరిశోధన చేసి పట్టా పొంది ఉన్నారు. ఈ రెండు పరిశోధనా గ్రంథాలు వెలువడినట్లు లేదు.

గురజాడ అప్పారావు రాసిన 'దిద్దుబాటు' కథ 1910 అచ్చయింది. ఆధునిక తెలుగు కథకు గురజాడ ఆద్యుడని విమర్శకులు, పండితులు ఒప్పుకున్నారు. కాబట్టి కథా రచన 1910 లో మొదలైందని ప్రస్తుతానికి భావిద్దాం.

ఈ దృష్టితో చూసినట్లయితే తెలుగు కథ దాదాపు నూరేళ్ళ సాహిత్య చరిత్ర కలిగి ఉంది. ఈ చరిత్రని రెండుగా మన సౌలభ్యం కోసం విభజించుకొంటే 1910 నుంచి 1955 వరకు ఉన్న కాలాన్ని తొలితరంగా, 1955 నుంచి 2005 వరకు ఉన్న కాలాన్ని మలితరంగా వింగడించి చూడవచ్చు.

తొలితరంలో కథ లేదా కథానికకు సంబంధించి సమీక్షలు, విమర్శనాత్మక వ్యాసాలు, పరిశోధన వ్యాసాలు రాసినవాళ్ళు చాలా తక్కువ. కథానికా సాహిత్యంపై ఉన్న మక్కువ వల్లనో, అభిమానం వల్లనో, ఆధునిక ఆలోచనల వల్లనో, వచన సాహిత్యంపై ఉన్న గౌరవం వల్లనో, దాన్ని విస్తరింప జేయవలెనన్న ఆశ వల్లనో రచనలు చేసినవారే తప్పా వాళ్ళు ఏ డిగ్రీలు, పట్టాలు ఆశించి ఈ పని చేయలేదని స్పష్టమవుతోంది. అలాంటి వారిలో ప్రధానంగా పేర్కొనదగినవారు -

## డి.ఎ. నరసింహం

ఈయన 1928 లో భారతి మాసపత్రికలో 'గద్యకథానకములు' పేరుతో వ్యాసం ప్రచురించినారు. వ్యాసం మొదట్లోనే ''దేశకాల పరిస్థితులననుసరించి సారస్వతము లోని జాతులును, రీతులును మారుచుండును. ఆంగ్ల సారస్వత ప్రోద్బలం వలన యాంధ్ర వాఙ్మయమున జనించిన సారస్వత జాతకములలో గద్యకథానకములు ఇప్పుడు ప్రాముఖ్యము నొందుచున్నవి. ఇవి వినోదమునొన గూర్చటమే కాక సాంఘి కములగు ఆచార వ్యవహారములను, వ్యక్తుల వింత పోకడలను, జీవితమును చీకాకు చేయు క్లిష్టసమస్యలను, మనస్సును దిగ్భ్రమ నొందించు దైవ విపాకములను సేర్పుతో ప్రదర్శించి చదువరులను వివేకవంతులనుగా జేయుటకు తోడ్పడుచున్నవి'' అని కథా నిక లక్ష్యాలను స్పష్టం చేసినాడు. బహుశా అప్పటికి కథానిక అనే మాట రూఢిగా ఏర్పడినట్లు లేదు. అందువల్లే డి.ఎ. నరసింహం గారు 'గద్య కథానకములు' అనే సంబోధించినారు. తన వ్యాసంలో భారతి, ఆంధ్రపత్రిక, అభ్యుదయ మొదలైన పత్రి కల్లో అచ్చైన కథల్ని ఆయన చర్చించినాడు. అందులోనే కథానికకు సంబంధించిన పేర్లు - కథానకము, కథిక, చిన్నకథ, పెద్దకథ, నవల వీటి మధ్య ఉన్న భేద సాదృశ్యా లను వివరించినాడు. నవలలో జీవితపటం విశాలంగా ఉంటుందనీ, కథానికలో అట్లా ఉండదనీ, కథానికలో ఒకేవొక అంశం ప్రాధాన్యత కలిగి ఉంటుందని చిన్న కథలో కథాంశం ఉత్కంఠతను రేకెత్తించాలని చెప్పాడు. దానికి ఉదాహరణగా 'శివరామా' కథను విశ్లేషించి చూపినాడు. అట్లే కథాంశం సులభ గ్రాహ్యంగా, స్పష్టంగా ఉండాలంటాడు. కథలో చమ త్కారాలు ఉండాలంటాడు. ఇందుకు జన్మాంతర సంబంధం, దయ్యాల కొంప, ఋణం తీర్చుకున్నా, నా మిత్రుని జీవిత చరిత్ర కథల్ని విశ్లేషించి చూపినాడు. వీరి పరిశీలనలో రాయసం వెంకట శివుడు రాసిన పులికూన, నాగరత్నం, గౌతమి స్వీయచరిత్ర, వేలూరి శివరామ శాస్త్రి రాసిన పద్మాక్షి, అతిథి దేవుడు కథలు, భాస్కరమ్మ రాసిన 'కైక', 'ప్రభావతి' కథలు చోటుచేసుకున్నాయి. అంతేగాక చిలకమర్తి లక్ష్మీనరసింహ రాసిన కథలు, పురాణం సూర్యనారాయణ తీర్థులు రాసిన కథలు, వాసుదేవరావు రాసిన కథలు, భమిడిపాటి సోమయాజుల కథలు, శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి కథలు, అడవి బాపి

రాజు కథలు చోటుచేసుకున్నాయి. ఎక్కువగా త్యాగం, వినోదం, ఔదార్యం, ప్రేమ, చారిత్రక, అద్భుత విషయాలు, హాస్య విషయాలు ఈ కథల ఇతివృత్తాలైనాయి.

తెలుగులో కథానిక పేరు స్థిరపడడానికి దోహదం చేసిన వ్యక్తుల్లో ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి ప్రముఖులు.

## ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి

1936 లో నవ్య సాహిత్య పరిషత్ నిర్వహించిన 'ప్రతిభ' పత్రికలో 'కథానిక' అనే శీర్షికతో ఒక వ్యాసం రాశారు. ఆ వ్యాసంలో చాలా మంది కథానిక ఆంగ్ల సాహిత్య ప్రభావంతో వెలువడిందని అపోహ పడుతున్నారనీ, ఇంగ్లీషులోని షార్టుస్టోరీ అనే మాటకు తెలుగులో సమానార్థక పదాలుగా హ్రస్వ కథ, చిన్నకథ, కథానకము, అనే మాటలు వాడుతున్నారనీ, అకిరాజు ఆంజనేయశర్మ లాంటివారు షార్టుస్టోరీ అనే మాటకు సరైన తెలుగు పదం లేనందువల్లా 'హ్రస్వకథ', 'చిన్నకథ' అనే మాటలు వాడవచ్చునన్నాడనీ, వీటి మూలాలు వైదిక వాఙ్మయంలో, పంచతంత్ర హితోపదేశాల్లో, భేతాళ పంచవిశతిలో ఉన్నాయని చెప్పినట్లు పేర్కొన్నాడు. అంతేగాక ''పాశ్చాత్యుల Short Story వారి Novel నుంచి పుట్టి యుండవచ్చు. ఇక మన 'చిన్న కథ' బ్రాహ్మణాదుల నుంచి పరంపరగా అభివృద్ధికి వచ్చిన కథాకావ్యముల నుండి ఎన్నో కొత్త అందాలను తీర్చుకొని ప్రత్యేక రచనగా ఏర్పడింది గాని సరాసరిగా వాటినుంచి రాలేదు. మన పూర్వులే కథా ప్రవృత్తిని ప్రస్తరించి చిన్న కథను లక్షణాలతో నిర్వచించారు. దీనికి మన సాహిత్య శాస్త్రంలో 'కథానిక' అనే పేరు సిద్ధమై ఉంది'' అని తెలిపారు. అంతేగాక తల్లావఝ్ఝుల శివశంకర శాస్త్రి 'ఏకాదశి' పీఠికలో మనకు 'కథ, కథానకము, ఆఖ్యానము, ఆఖ్యాయిక' అనే గద్య విభాగాలు ఉన్నట్లు పేర్కొన్నాడని వివరించారు.

చాలా కాలం తను చిన్న కథ చరిత్రను కుమర్చేవడానికి చేసిన పరిశోధనలో ఎవరూ ప్రస్తావించని విషయాలు కొన్ని దొరికాయని, ఆ విషయాలు ఆంధ్రప్రముఖుల ముందుకు తీసుకురావటానికి ఈ వ్యాసం రాశాను పేర్కొన్నాడు. ఆ విషయాలు ఏమిటంటే '' భారతీయ సాహిత్యానికి విజ్ఞాన సర్వస్వాలైన పురాణాలు, అద్భుత విషయ భాండారాలు. వాటిలో ఒకటైన అగ్నిపురాణం సమూలకాషంగా సాహిత్య మీమాంస చేసింది. 337 అధ్యాయపు కావ్యాదీ లక్షణ నిరూపణ సందర్భంలో గద్య కావ్య విభాగం గురించి ఇట్లా ఉంది.

శ్లో॥ ఆఖ్యాయికా కథా, ఖండకథ, పరికథ, తథా
కథానికేతి మన్యంతే గద్యకావ్యం చ పరిచథా

1. ఆఖ్యాయిక 2. కథ, 3. ఖండకథ, 4. పరికథ, 5. కథానిక అని గద్య కావ్యాలు ఐదు రకాలు

ఇందులో కథానికే మన చిన్న కథ'' అని స్పష్టం చేసినారు.

ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి గారి అభిప్రాయం ప్రకారం 'కథానిక' భారతీయ గద్యకావ్య పరిణామంలోంచి పుట్టుకొచ్చింది. స్థూల దృష్టికి ఈ అభిప్రాయం సబబుగా ఉందనిపించినా సూక్ష్మదృష్టితో చూస్తే ఈ అంశం మీద మరింత పరిశోధించాల్సిన అవసరం ఉందనిపిస్తుంది. ఎందుకంటే వచన సాహిత్య ప్రక్రియలు విరివిగా పుట్టుకొచ్చిందీ, విస్తరిల్లిందీ విజ్ఞాన శాస్త్రాల వెలుగులో అది కూడా 19, 20 శతాబ్దాలలో. అగ్నిపురాణంలో దాని ప్రస్తావన ఉన్నా అప్పట్నుంచి 20వ శతాబ్దం ప్రారంభం వరకు కథానికలు ఎందుకు పుట్టుకురాలేదో హనుమచ్ఛాస్త్రిగారు వివరించలేదు.

హనుమచ్ఛాస్త్రి గారు కథానికా లక్షణ పరామర్శ చేస్తూ –

''శ్లో॥ భయానకం, సుఖపరం, గర్భేచ, కరుణో రసః
అద్భుతేంతే సుక్లప్తార్థానోదాత్తా సా కథానికా''

అనే శ్లోకం ఉదహరించి – కథానిక బాహ్యలక్షణాలు రెండు అన్నాడు.

1. కథ సుదూరంగా సాగిపోక పొందికగా ఉండాలి.
2. పెద్ద సమాసాలు వర్ణనలతోను కథ శరీరం బిగిసిపోకూడదు.

అభ్యంతర లక్షణాలు మూడు.

1. పఠితను భయ సంభ్రమాశ్చర్యాల్లో ముంచే విచిత్ర సంఘటనలు ఉండాలి.
2. కథా గర్భంలో హృదయం కరిగించే సన్నివేశం కూర్చాలి.
3. పాఠకుడు అనుకోని కొత్త మలుపుతో కథ తమాషాగా ముగిసిపోవాలి. ఇది కథానిక స్వభావం.''

అని కథానిక లక్షణాలను స్పష్టం చేసినాడు. ఆధునిక కథలో ఈ లక్షణాలు అన్నీ కాకపోయినా కొన్ని కడబడతాయి. ఆధునిక కథలో కథ ఎత్తుగడ, ముగింపు, కథనం, పాత్రచిత్రణ, సన్నివేశ కల్పన, కంఠస్వరం, దృష్టికోణం, నేపథ్యచిత్రణ, స్థల కాలాల చిత్రణ ఇలా మరెన్నో అంశాలు ప్రాధాన్యం వహించాయి.

లభిస్తున్న ఆధారాల్నిబట్టి డి.ఎ. నరసింహం, ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి, ఎం. నాగేశ్వరరావు, తల్లావఝ్ఝల శివశంకర శాస్త్రి, బూర్గుల రంగనాథరావు. అక్కిరాజు రమాకాంతమ్ మొదలైన వ్యాసకర్తల్ని తొలితరం కథా పరిశోధకులుగా గుర్తించవచ్చు. తొలి తరం కథా పరిశోధకులు కథానికకు సంబంధించి దాని స్వరూప స్వభావాలు, దాని లక్ష్య లక్షణాలకే ఎక్కువ ప్రాధాన్యత ఇచ్చినట్లు కనబడుతోంది.

## ఆధార గ్రంథాలు

1. చినవీరభద్రుడు, 'వందేళ్ళ తెలుగు కథ' జనవరి 2001, ఎమెస్కో బుక్స్, విజయవాడ.

2. నరసింహారావు అత్తలూరి, భరాగో, 'నేనెందుకు వ్రాస్తున్నాను' (సంకలనం), ఫిబ్రవరి, 1980, నవజ్యోతి పబ్లికేషన్స్, విజయవాడ - 2.

3. నిత్యానందరావు వెలుదండ, 'విశ్వవిద్యాలయాల్లో తెలుగు పరిశోధన', హైదరాబాదు - 60

4. రాంబాబు వేదగిరి, 'కథానికా లక్ష్యము - లక్షణాలు' (సంకలనం), పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం. హైదరాబాదు - 4.

5. రామారావు కాళీపట్నం, 'కథాకథనం', జనవరి 1990, స్వేచ్ఛాసాహితి, విజయవాడ.

6. వెంకట సుబ్బయ్య వల్లంపాటి, 'కథాశిల్పం', జనవరి 1995, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, హైదరాబాద్ - 1.

7. వేణుగోపాల్, ఎన్. 'కథా సందర్భం', నవంబరు 2000, స్వేచ్ఛా సాహితి, హైదరాబాదు.

## ENGLISH BOOKS

1. MEHTA P.P., 'THE SHORT STORY' A Study in form, Prakash Book Dept, Bara Bazar, Bareilly, U.P.

2. THORNLY, R. WILSON, 'SHORT STORY WRITING', November 1976, Bantam Books, New York.

# తొలితరం తెలుగు పాత్రికేయులు
# (1871-1950)

- జి.రేవతి, ఇ.శిరీష

## I. పత్రిక ఆవిర్భావం

తెలుగులో ఆధునిక సాహిత్య ప్రక్రియలు అయిన కథ, నవల, వ్యాసం, ఆత్మాశ్రయ కవితలలాగే పత్రికా రచన కూడా పాశ్చాత్య ప్రభావంతో వచ్చిన సారస్వత ప్రక్రియ.

విద్యావ్యాప్తి అవుతున్న తొలిరోజుల్లో - అదీ అచ్చు యంత్రాల ఆవిర్భావంతో - తెలుగు జనంలో పుస్తక పఠనాసక్తి పెరిగింది. దీనితో సంప్రదాయ వాదుల్లో ప్రాచీన కావ్యాల మీద అభిరుచి ఎక్కువైంది. ఇక సామాన్యుల్లో కూడా చదువుకోవడానికి ఏదో ఒకటి కావాలన్న తపన ఆరంభమయింది. దీనితో 'పుస్తకాల గుజిలీ' ఒకటి ఏర్పడింది. కొత్తగా అచ్చు యంత్రాలు పెట్టిన వాళ్ళు 'గుజిలీ' గ్రంథాల ప్రచురణ ఆరంభించారు. ఆదిలో భారత రామాయణాది కావ్యాలను వచనంలో అనువదించి గుజిలీకి అందించడం మొదలైంది. ఈ కొత్త ప్రక్రియల ఆవిర్భావం గుజిలీకి అవసరమైంది. ఆ దశలో వచ్చిన కథలు, చార్‌దర్వేషు లాంటివి. కొంతకాలం తర్వాత కల్పనా చమత్కృతి ఉన్న పెద్ద కథలు - క్రమంగా నవలల రూపంలోనూ, వ్యాసాలుగానూ; ప్రపంచపు వింతలు - విడ్డూరాల ప్రతిబింబాలుగా అవతరించి గుజిలీకి వచ్చాయి. ఈ దశలో తెలుగులో గ్రంథమాలలు వచ్చాయి.

వీటితోపాటే పత్రికారంగం కూడా ఆరంభమైంది. యూరప్‌లో రాచరిక వ్యవస్థకు పరిమితులు ఏర్పడి, పారిశ్రామిక నాగరికతా ప్రజాస్వామ్య భావాలకు పునాదులు పడినప్పుడు పత్రికలు ఆవిర్భవించాయి.

### ఎ. పత్రిక

పత్రిక అనే పేరు వార్తా పత్రికకు 'పత్రం' నుండి రూఢమై ఉంటుంది. శబ్దరత్నాకర నిఘంటువులో పత్రికకు అర్థం ''వ్యవహారము యొక్క చెల్లుబడికై యొకరొక వ్రాసికొనెడి పత్రము'' అని మాత్రమే ఉంది.

పత్రం అనే ఆరోపం దగ్గర ''వ్యవహారము యొక్క చెల్లుబడికై యొకరొకరు వ్రాసికొనెడి ఆకు'' అని అర్థం ఇచ్చారు. అదనంగా వార్తాపత్రిక అనే అర్థం కూడా ఇచ్చారు. తర్వాత యాభై సంవత్సరాలకు వెలువడ్డ సూర్యరాయాంధ్ర నిఘంటువులో కూడా పత్రిక అంటే 'వ్రాతకు ఆధారమగు తాటియాకు, కాగితము, వ్యవహారమున

పరస్పరము వ్రాసికొనెడి పత్రము' అని ఇచ్చారు. వార్తా పత్రిక అనే అర్థంలో కాని, పెళ్ళి పత్రిక అనే అర్థంలో కాని వివరణ ఇవ్వలేదు.

'లేఖ' అనే అర్థంలో పత్రిక అనే పదం మొట్టమొదటసారి ప్రభావతీ ప్రద్యుమ్నములో కనబడింది. ప్రభావతి పంపిన పత్రిక తీసుకుని శుచిముఖి ప్రద్యుమ్నుడికి చేర్చే సందర్భంలో తెలుస్తుంది (రామచంద్ర 1989:1).

తెలుగు ముద్రాక్షరశాలలు మద్రాసులో వెలసిన తరువాత పత్రికలు వెలువడటం మొదలైంది. అప్పట్లో తాళపత్ర గ్రంథాల సేకరణ, ప్రచురణలు ఒక్క పెట్టున మొదలైనాయి. అందువల్ల నాటి పత్రికలు సహజంగా భాషా సాహిత్య సాంస్కృతిక సాహిత్య విశేషాలకు పెద్దపీఠ వేశాయి.

బి. వార్త

వార్త అనేది వృత్తికి సంబంధించిన సమాచారము.

''వార్త యందు జగము వర్తిల్లుచున్నది
యదియు లేనినాడు యఖిల జనులు
అంధకార మగ్నులగుదురు గావున
వార్త నిర్వహింప వలయు బతికి'' - భారతం.

మహాభారతం నుండి నేటి పత్రికల వరకు వార్త విశిష్టత తెలియుచున్నది. జనాభ్యుదయానికి వృత్తులు మూలాధారాలైనపుడు ఆ వృత్తుల సమాచారం తెలుసుకోడానికి అటు పాలకులూ - ఇటు పాలితులూ తమతమ కారణాలతో ఆసక్తి చూపడం సహజం.

తెలుగు వార్తా పత్రికా సంప్రదాయం 16వ శతాబ్ది ఉత్తరార్థం చివరనే మొదలైంది. తొలి తెలుగు వార్తా పత్రిక విశ్వనాథ నాయకుని స్థానాపతి రచించిన 'రాయవాచకం'. ఇది కృష్ణరాయల సమాచారం తెలిపే ఆకరం (డైరీ). కాని దీనిని సంపూర్ణ వార్తా పత్రికగా చెప్పలేమని తిరుమల రామచంద్రగారు పేర్కొన్నారు

II. తొలి తెలుగు వార్తా పత్రిక

భారత దేశంలో అవతరించిన తొలి పత్రిక 1818 సంవత్సరములో వెలువడిన 'దిగ్దర్శన్'. ఆ తర్వాత మరి 14 సంవత్సరాలకు కాని తెలుగులో పత్రిక వెలువడలేదు.

1. 1831 - మద్రాసులోని లండన్ మిషన్ సొసైటీ ''తెలుగు జర్నల్'' అని ఆరుద్ర అభిప్రాయం.

2. 1832 - తెలుగులో మొదటి పత్రిక కర్నాటిక్ క్రానికల్ (మద్రాసు క్రానికల్) అని ఇది మద్రాసు నుంచి వెలువడేదని డా॥ జి.ఎన్. రెడ్డి గారు పేర్కొన్నారు. ఈ పత్రిక ప్రతులు లేవు.

1832 - పోర్టుసెయింట్ జార్జిగెజిట్ అనే పత్రిక ఉందని ఇందులో తెలుగు భాష ఎక్కువగా ఉందని డా॥ వి. సిమ్మన్న పేర్కొన్నారు.

3. 1835 - తెలుగు పత్రికల చరిత్రను చెప్పిన వారంతా ఇంతవరకు తొలితెలుగు వార పత్రికగా 'సత్యదూత' అని చెబుతూ వచ్చారు. ఇది మత ప్రచార పత్రికగా తెలుస్తుంది.

4. 1838 - అసందిగ్ధంగా తెలుస్తున్న తొలితెలుగు వార పత్రిక 'వృత్తాంతి'. ఇది మండిగల వెంకట్రాయ శాస్త్రి గారి సంపాదకత్వంలో వెలువడింది. దీనిలో ప్రచురించిన జాబులను బ్రౌను సేకరించాడు. గిడుగు రామమూర్తి పంతులు గారు ఈ పత్రికలోని లేఖను తన 'గద్య చింతామణి'లో ఉదాహరించారు.

(ఎక్కువ ఆధారాలతో లభించిన 'వృత్తాంతి'/ 'వృత్తాంతిని' తొలి తెలుగు పత్రికగా చెప్పవచ్చు.)

## తర్వాత వచ్చిన పత్రికలు

వర్తమాన తరంగిణి (1842), హితవాది (1848), శ్రీయక్షిణి (1863), సంవాద కౌముది (1852), దినవర్తమాని (1856) మొ॥ పత్రికలు వెలువడ్డాయి. సుజన రంజని (1864) భారత, రామాయణ, భాగవత, మనుచరిత్ర టిప్పణాలు భాషా సంబంధమైన సందేహాలకు సమాధానాలు, సాహిత్య చర్చలు ఈ పత్రికలో కొనసాగేవి.

## III. తొలితరం - పాత్రికేయులు

పత్రికా నిర్వాహకుడు లేదా వ్యవస్థాపకుడు, ప్రచురణకర్త, పత్రికా సంపాదకుడు, పత్రికా రచయిత వంటి వారు పాత్రికేయులుగా వ్యవహరింపబడుతూ ఉన్నారు. వీళ్ళు కాకుండా పత్రికా ఉపసంపాదకులు, పత్రికా విలేఖరులు, ఫోటోగ్రాఫర్లు, ముద్రాపకులు, కార్టూనిస్టులు, వంటి వాళ్ళు కూడా పాత్రికేయులుగానే వ్యవహరింపబడతారు.

పత్రికలకు నిర్దిష్టంగా ఒక ప్రత్యేక భాషలేదు. పండిత లోకానికి పరిమితమయిన సుదీర్ఘ సమాసాలతో కూడుకున్న వాక్యాలతో ప్రారంభమైన తెలుగు పత్రికల భాష క్రమంగా ఒక కొత్త ఒరవడిని సంతరించుకొని సులభశైలిలో సామాన్య పాఠకునికి కూడా అర్థమయ్యేలా మారింది. ఆనాటి పత్రికా రచయితలు తమ మేథతో, లోతైన భాషా పరిజ్ఞానంతో ప్రత్యేక వ్యాసాలు, పద్యాలు, వ్రాసేవారు. స్వాతంత్ర్యం వచ్చాక పత్రికల లక్ష్యంలో భాషకు ఎన్నో మార్పులు వచ్చాయి.

తొలినాళ్ళలో పత్రిక నిర్వాహకులూ, సంపాదకులూ, ఆఖరుకి, పాఠకులూ అందరూ పండితులై ఉండేవారు. అందువల్ల ఈ తొలితరం పత్రికల్లో భాషా సాహిత్య విషయాలూ, భాషా పరమైన వాదోపవాదాలు చోటు చేసుకున్నాయి.

## సంపాదకులు

### 1. కొక్కొండ వేంకటరత్నం పంతులు

1871 – 'ఆంధ్ర భాషా సంజీవని' మాస పత్రికగా వెలువడింది. 'ఆంధ్ర' అనే శబ్దం ఈ పత్రిక ద్వారానే మొదట ప్రకటించబడింది. ఈ పత్రికలో ప్రధానంగా సారస్వత విషయ చర్చలు, సాంఘిక రాజకీయ విషయాల, గ్రంథ సమీక్షలు, కవితలు ప్రచురింపబడేవి. ఈయన తన విమర్శలలో పాత్రోచిత భాషను ప్రవేశపెట్టారు. ఈ పత్రిక గ్రాంథిక భాషలో వెలువడేది.

### 2. ఉవూరంగ నాయకులు

1872 – 'పురుషార్థ ప్రదాయిని' పత్రికలో సాంఘిక, రాజకీయ, ఆర్థిక నైతిక విషయాలు మతపరమైన విషయాలు, శాస్త్ర సారస్వత చర్చ, విమర్శలు, సామెతలు, సమస్యాపూరణాలు, మొదలైనవి ప్రచురితమయ్యేవి.

### 3. ఓగిరాల జగన్నాథం

1873 – 'సుధీరంజని' సాహిత్య విలువలు కల్గిన పత్రికగా పేరు పొందింది.

### 4. కందుకూరి వీరేశలింగం పంతులు

1874 – 'వివేకవర్థిని' సంఘ సంస్కరణోద్యమంలో ప్రముఖ ప్రచార సాధనమైంది. దాదాపు ఇరవై సంవత్సరాలు సాంఘిక, రాజకీయ, మనదేశానికి ఎంతో సేవ చేసింది. తన కాలపు పత్రికలలో బహిర్గతం చేసేవారు. ఈ పత్రికను వజ్రాయుధంగా వాడినారు. సంఘసంస్కరణకు, విద్యావ్యాప్తికి ఇలా వాడిన సాహసికులు మరొకరు లేరు. ఈ పత్రిక ముఖ తిలకంగా భారతంలోని

'ఒరులేయవి యొనరించిన
నరవర యప్రియము తన మనంబున కగు దా
నొరులకు నవి సేయకునికి
పరాయణము పరమధర్మపథములకెల్లన్'

ఈ ఉన్నత లక్ష్యంతోనే వీరేశలింగం గారు పత్రికను నడిపారు. ఈ లక్ష్యాన్నే కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు తన ఆంధ్రపత్రికల ఆశయంగా పెట్టుకున్నారు.

తెలుగు పత్రికల ప్రచురణలో వివేకవర్ధిని ప్రచురణ కొత్త అధ్యయాన్ని ప్రారంభించింది. అప్పటి వరకు వెలువడిన పత్రికలు సాహిత్యానికి ప్రాముఖ్యం ఇస్తే వీరేశలింగం తన పత్రికల నుండి సామాజిక ప్రయోజనాన్ని ఆశించారు.

'వివేకవర్థిని' పత్రిక నడపడానికి ముందే వీరు 'గోదావరీ విద్యా ప్రబోధిని'కి 'పురుషార్థ ప్రదాయినికి' గ్రంథాలను రాసి పంపేవారు. కొక్కొండ ప్రచురించిన ఆంధ్రభాషా సంజీవనికి ఈయన రాయడం, కొక్కొండతో అభిప్రాయ భేదాలు రావడం వీరిలో పత్రిక ప్రచురణ వాంఛను ప్రేరేపించినట్లు కనిపిస్తుంది. వివేక వర్ధినిలో దాదాపు 200 వ్యాసాలు రాశారు.

నరసాపురంలో మీర్ హుయజ్ ఆలీఖాన్ అనే ఉత్సాహవంతుడైన ఒక ముస్లిం యువకుడు 'విద్వన్మనోహారిణి' అనే పత్రికను ప్రారంభించారు. వీరేశలింగం పంతులుగారితో ఖాన్‌కు 1874 నుంచి మంచి స్నేహం ఏర్పడి క్రమంగా వృద్ధి పొందుతూ కొంత కాలానికి విద్వన్మనోహారిణీ పత్రిక వివేకవర్ధినిలో విలీనం అయ్యింది.

**1875 హాస్య సంజీవని**

కొక్కొండ వారి 'హాస్యవర్థిని' పత్రికకు ప్రతిగా 'హాస్యసంజీవని' అనే పత్రికను అనుబంధంగా వెలువరించారు. ఈ పత్రికను నడిపి తెలుగు జర్నలిజంలో హాస్యానికి శ్రీకారం చుట్టారు. ఇందులో సంభాషణ రూపమున బ్రాహ్మవివాహమును (ప్రహసనం) రాసి కొంత భాగము ప్రకటించారు.

**1880 శ్రీచింతామణి**

ఈ పత్రికకు మొదట శ్రీవావిలాలా వాసుదేవశాస్త్రి గారు సంపాదకులు. దీనిలో వావిలాల ఉత్తర రామచరిత్ర, వీరేశలింగం గారి శాకుంతలం అనువాదాలు వచ్చాయి.

**1883 సతీహిత బోధిని**

సామాజిక రంగంలో స్త్రీలకోసం, వితంతువుల పునర్వివాహం కోసం, బాలల కోసం నిరంతర కృషి కొనసాగిస్తూనే మరోవైపు వీరికోసం పత్రికల్లోనూ కృషిచేశారు. ముఖ్యంగా స్త్రీజనోద్ధరణ కోసం అనేక ప్రహసనాలు రచించారు. మూఢ విశ్వాసాలను ఖండించి తెలుగు ప్రజలలో చైతన్యం పురిగొల్పారు. ఈ పత్రికలలో వినోదాత్మకమూ, విజ్ఞానాత్మకమైన కథలను, వ్యాసాలను ప్రకటించేవారు.

1887 సత్యవాది; 1889 జనానా పత్రికలను నడిపారు. వీటిలో శ్రుతి, స్మృతులను, ఉపనిషత్తులను, పురాణాలను పరిశోధించడమే కాక వీటిలో కొన్ని భాగాలను తెలుగులోకి అనువదించారు.

5. కృష్ణమాచార్యులు

1875 – జనవినోదిని పత్రికలో తెలుగు పత్రికా రచనలో నూతన ప్రయోగాలు చేసి ప్రజల మెప్పును పొందిన పత్రిక.

6. పూండ్ల రామకృష్ణయ్య

1885 – 'అముద్రిత గ్రంథ చింతామణి' కేవలం సాహిత్య పత్రిక. ఈ సీరియల్ పద్ధతిలో ప్రాచీన గ్రంథాల ప్రచురణం, గ్రంథ సమీక్ష, సమకాలీన రచనల ప్రచురణం, భాషాసాహిత్య విషయాలపై చర్చ వంటి విషయాలు ప్రచురితమయ్యేవి. ఈ పత్రికలో విమర్శ పద్ధతి వివిధ రూపాలలో వెలువడేది. అది కావ్య విమర్శలు, పీఠికలు, పాఠ అర్థ నిర్ణయం, శబ్ద సాధుత్వ చర్చ, కవి జీవితాంశాలు, మొ॥ ప్రాధాన్యత వహించేవి. మయూఖము అనే శీర్షికలో సాహితీ చర్చలు జరిగేవి.

7. A.P. పార్థసారథి నాయుడు

1885 – 'ఆంధ్రప్రకాశిక' నలభై ఐదు సంవత్సరాలు ప్రజల సేవలో నడిపిన రాజకీయ పత్రిక.

8. గురజాడ శ్రీరామమూర్తి

1891 – 'రాజయోగి' లో తొలి నవలా విమర్శనమైన రాజశేఖర చరిత్ర కొంత భాగం ప్రచురితం అయ్యింది. వీరి సంపాదకత్వంలోనే 1896లో రాజయోగికి అనుబంధంగా ప్రబంధ కల్పవల్లి పత్రిక వెలువడినది. ఇందులో కవి జీవితములు ప్రకటిత మయ్యాయి. 1910 – తెలుగు అనే పత్రిక సంపాదకత్వం వహించారు.

9. పనప్పాకం ఆనందాచార్యులు

1894 – 'వైజయంతి' మాస పత్రికలో కావ్య విమర్శ భాషాచర్చలు ప్రచురితమయ్యేవి.

10. గట్టుపల్లి శేషాచార్యులు

1894 – 'శశిలేఖ' వార పత్రికలో వాగ్యుద్ధములు గ్రంథ విమర్శలు కవి చరిత్రలు కొనసాగేవి.

11. మంత్రిప్రెగడ భుజంగరావు

1898 – 'మంజువాణి' మాస పత్రిక లో కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి 'మనువసు ప్రకాశిక', 'కాగడా' శబ్ద చర్చ పేర్కొనదగిన విమర్శలు. ప్రతాపరుద్ర నాటకముపై ఉత్తమ విమర్శకు ఈ పత్రిక బహుమతిని ప్రకటించుకుంది.

12. కొచ్చెర్లకోట వేంకట కృష్ణారావు

1898 – 'సరస్వతి' మాసపత్రికలో కృతి విమర్శలు పీఠికలు, కవి చరిత్రలు మొ॥వి ప్రచురితమయ్యేవి.

13. శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి

1899 – 'కలావతి' పత్రికలో సమకాలీన కావ్య నాటకముల విమర్శలు, కవి జీవితములు, గ్రంథ సమీక్షలు కలవు.

1907 – 'వందేమాతరం' వార పత్రిక

1908 – 'గౌతమి' వీరి సంపాదకత్వంలోనే వచ్చినవి. ఈ పత్రిక మొదటి తెలుగు దిన పత్రికగా వెలువడింది.

1920 – 'వజ్రాయుధం' పత్రికలో గిడుగు రామమూర్తి. ఈ పత్రిక మొదటి ప్రచారం కోసం తెలుగు పత్రికను ప్రారంభించారు. అదే సమయంలో గ్రాంథిక భాషను వ్యాప్తి చేయడానికి గ్రామ్య భాషను నిరసించడం వంటి విషయాలను ధ్యేయంగా పెట్టుకొని శ్రీపాద కృష్ణమూర్తి ఈ పత్రికను నడిపారు. ఇందులో అనేక సంపాదకీయ వ్యాసాలు రాశారు. సుజనరంజని పత్రిక గ్రాంథిక భాషను నిందిస్తూ వజ్రాయుధంలో ఒక వ్యాసం రాశారు. గాంధీని నైతిక విలువలు లేని వ్యక్తిగా విమర్శిస్తూ మరొక వ్యాసం రాశారు.

1922 – 'ప్రబుద్ధాంధ్ర' పత్రికను హిందీ ప్రచారోద్యమానికి వ్యతిరేకంగా ప్రారంభించారు. సరళ గ్రాంథికంలో సాగేది శ్రీపాదవారు ఈ పత్రిక ద్వారా మహత్తర ఆంధ్రాభిమానాన్ని తెలుగు ప్రజలలో పెంపొందించారు.

14. ముట్నూరి కృష్ణారావు

1902 – కృష్ణా పత్రిక ఆధునిక సాహిత్యంలోని ప్రక్రియా వైవిధ్యానికి ఎంతగానో తోడ్పడింది. బందరులో ముద్రణా సౌకర్యాలు పెద్దగా విస్తరించని కాలంలో ముట్నూరి కృష్ణారావు సంపాదకత్వం బాధ్యతలు స్వీకరించాకనే 'కృష్ణా పత్రిక' తెలుగు పాఠకులను ప్రభావితం చేసింది. విశ్వనాథ వంటి రచయితల నవలలు ఇందులో వచ్చేవి. సాంఘిక, రాజకీయ, ఆర్థిక, సాహిత్య శిల్ప కళా రంగాలపై విలువైన వ్యాసాలు వెల్లడిస్తూ కాలగతికి తమ సునిశిత పరిశీలనా శక్తితో శాస్త్రీయ వివేచనా దక్షతతో చక్కని వ్యాఖ్యానాలు రాశారు. ఆంధ్ర భాషాభివృద్ధికి, ఆంధ్ర జాతీయ కళాశాల స్థాపనకు కృష్ణారావు గారు ఎంతగానో కృషి చేశారు. పదే పదే తన పత్రికలో వ్యాసాలు, సంపాదకీయాలు ప్రచురిస్తూ నాటి భాషోద్యమాలకు, విద్యావ్యాప్తికి దోహదం చేశారు. గ్రాంథిక వ్యవహారిక భాషా వివాదాలను కూడా శ్రద్ధగా గమనించినట్లు వారి వ్యాసాల వల్ల అవగతం అవుతుంది.

అవటపల్లి నారాయణరావు గారి సాహచర్యం వల్ల పటుతరముగా భావ గాంభీర్యం ఉట్టిపడునట్లుగా చక్కని గ్రాంథిక భాషలో భీరులను సైతం ధీరులుగా తయారు చేయగల శక్తి సంపన్నత కల వ్యాసాలు రాయగల శైలి అలవర్చుకున్నాడు. పత్రికా సంపాదకీయాన్ని ఒక తపస్సులాగా నిర్వహించారు. కృష్ణా పత్రికలో ప్రకటింపబడిన ఏ వాక్యమయిన, ఏ వార్త అయిన సత్యమే అనే పవిత్ర భావం ప్రజలలో కల్గించారు. పత్రికాధిపతిగా స్వపరపక్ష భేదం లేకుండా నిర్మొగమాటముగా విమర్శనా దృష్టితో పవిత్ర భావంతో రాయుట నిత్యవిధిగా భావించారు. పత్రికాఫీసులో శ్రీకృష్ణరాయబార దర్బారును నిర్వహించేవారు. ఈ దర్బారులో కవుల పండితులు, నటులు, కళారాధకులు, గానకోవిదులు, రాజకీయవేత్తలు వివిధ విషయాల మీద చర్చలు సాగించేవారు. చర్చలను ప్రోత్సహించి కృష్ణారావుగారు జాగ్రత్తగా వింటూ ఉండేవారు. ఈ చర్చల పర్యవసానం సందర్భోచితంగా ఆ వారపు కృష్ణాపత్రికలో ప్రధాన వ్యాసంలో గాని, 'పన్నీటి జల్లు'లో కాని వచ్చేది.

కృష్ణారావుగారు జైలులో ఉన్నప్పుడు కోట సుబ్బారావు గారు కృష్ణాపత్రికకు సంపాదకీయాలు కృష్ణారావుగారి శైలిలో రాసేవారు. కృష్ణారావుగారు అప్పుడప్పుడు రాసిన 'లోవెలుగు' ఆయన వేదాంత ప్రవృత్తిని, ఆయనకు వేదాంత శాస్త్రంలో ఉన్న పాండిత్యాన్నీ విశదీకరిస్తాయి.

ఈయన తొలి సంచికలో రాజ్యపద్ధతులను, వానిలోపాలను, నివృత్తిచేయు మార్గాలను సంఘసంస్కరణ రీతులను, రసవాద ప్రకృతిశాస్త్ర విశేషములను, వ్యవసాయమును, చేతిపనులు మొదలగు విషయాలు వచ్చేవి.

## 15. కేసరి

1903 – గృహలక్ష్మి పత్రికను రాజామంత్రి ప్రెగడ భుజంగరావు, నందిరావు చలపతి రావులు ప్రారంభించి కొంతకాలం నడిపి ఆపివేశారు. తర్వాత 1927 లో డా॥ కె.యస్. కేసరి ఈ పత్రికా సంపాదకులైనారు. ఆనాటి మహిళల దీనావస్థే ఈ పత్రికకు మూల కారణం. అందుకనే ఈయన స్త్రీ జనోద్ధరణ కోసమే ఈ పత్రికను స్థాపించారు. విద్యాభ్యాసం చేస్తున్న స్త్రీల సహాయం కోసం ఆయన కాకుండా గృహలక్ష్మి స్వర్ణకంకణం ప్రదానాన్ని ఏర్పాటు చేశారు. సంగీత, సాహిత్యాలలోనూ, చారిత్రక రచనల విషయంలో ప్రావీణ్యం ఉన్న వారికి ఈ సత్కారం లభించేటట్లు చేశాడు. శారద లేఖలు అనే ప్రత్యేక శీర్షికకు కనపర్తి వరలక్ష్మమ్మ వ్యాసాలు రాసేది. ఈ పత్రికలో రచయిత్రులు, విదుషీమణుల జీవిత చరిత్రలు లోక వార్తలు గ్రంథ విమర్శలు, కథలు, కబుర్లు ఆసక్తికరమైన విషయాలు ఉండేవి.

## 16. కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు

1908 లో ఆంధ్ర పత్రిక వార పత్రికగా వచ్చి 1914 లో మద్రాసు నుండి దినపత్రికగా వచ్చేది. దేశ స్వాతంత్ర్యోద్యమ కాలంలో ముట్నూరి కృష్ణారావుగారి వార పత్రిక కృష్ణా పత్రికతో పాటుగా నాగేశ్వరరావు పంతులు గారి ఆంధ్రపత్రిక ఎంతో కృషి చేసింది. తన సహా పత్రికలైన వార పత్రిక, భారతి మాసపత్రిక, సంవత్సరాది సంచికల ద్వారా చేసిన సాహిత్య, సాంస్కృతిక సేవ అనన్యం. ఆంధ్ర పత్రిక సారస్వతానుబంధంలో పానుగంటి వారి సాక్షి వ్యాసాలు వెలువడ్డాయి.

''ప్రజలకు విద్యాభివృద్ధియూ, జ్ఞానాభివృద్ధియూ కావించుటయే'' మా ముఖ్య అభిప్రాయము అని పత్రిక తొలి సంచికలోనాగేశ్వరరావు గారు ప్రకటించారు. ఆంధ్రపత్రిక దినపత్రికగా మారిన తరువాత తెలుగునాట దైనందిన వార్తలను తెలుగులో చదివే అలవాటు మొదలై క్రమంగా వృద్ధిపొందింది.

మొదటి ప్రపంచ యుద్ధం అప్పుడే ప్రారంభం కావడం వలన ప్రజలలో ఎప్పుడు ఏం జరుగుతుందో తెలుసుకోవాలన్న ఆసక్తి కూడా పెరిగింది. చదివే అలవాటు ప్రజలలో పెంపొందించడానికి నాగేశ్వరరావు గారు చేసిన కృషి అసామాన్యమైనది. ఆ రోజులలో సుమారు ఎనిమిది వందల మందికి ఉచితంగా పంపిణీ చేసేవారు. అనేక గ్రంథాలయాలకు కూడా ఈ పత్రిక ఉచితంగా అందుతూ ఉండేది.

మహారాష్ట్ర, వంగదేశాలలో, రాజకీయ, సాంఘిక ఉద్యమాలను ప్రజల ప్రారంభవికాసాలను గమనించి, తెలుగులోనూ అటువంటి పరిణామాలు రావాలని కోరుకున్నారు. అలా ఆంధ్ర పత్రిక ద్వారా తెలుగు ప్రజలకు సేవ చేయాలని సంకల్పించారు.

1924 – భారతి అనే సాహిత్య పత్రికను నెలకొల్పారు. ఈ పత్రికలో శబ్ద చర్చలు తరుచు జరుగుతుండేవి. అనేక పాత శబ్దాల అర్థాలను దీపా పిచ్చయ్యా శాస్త్రి, వేటూరి ప్రభాకరశాస్త్రి ప్రభృతులు వ్యాసాలు రాస్తూ ఉండేవారు. మల్లంపల్లి సోమశేఖరశర్మ శాసనాల గురించి రాసేవారు. శర్మగారు శాసన సేకరణకోసం శిల్ప సందర్శనం కోసం చేసిన ''యాత్రలు'' పఠనీయమైనవి. ఆయన ఫోటోలు కూడా తీసి వ్యాసాలకు జోడించేవాడు.

ఆంధ్ర పత్రికలో రచనకు ఎక్కువ అవకాశాలు ఉండేవి. దైనిక పత్రికగా, అది ఎక్కువ వార్తలు ఇవ్వగల్గడం సహజమే. దైనిక వార్తలు అనేక విశేషాలకు సంబంధించి ఉంటాయి. కేవలం సాంప్రదాయిక సాహిత్య విశేషాలే కాక, ఆర్థిక, వైజ్ఞానికాది వివిధ వార్తలు కూడా వెలువడుతూ ఉండేవి. ఆ కాలంలో కాంగ్రెసు వారు

తమ విధానాలను పైఖరులను వివరించే రచనలు చేసుకునేవారు. వాటి అనువాదాలు వివిధ భాషల పత్రికలలో వెలువడినట్లే ఆంధ్రపత్రికలోనూ వెలువడేవి. ఆంధ్రపత్రిక వారపత్రికలో కథలు వగైరాలతో పాటు, ప్రముఖుల వ్యాసాలు, వ్యాఖ్యలు కూడ వెలువడేవి.

కొమర్రాజు వేంకట లక్ష్మణరావు ఐతిహాసిక వ్యాసరచనకు మంచి మలుపు ఇచ్చాడు. వివిధ శాస్త్రాలకు చెందిన వ్యాసాలు కూడా వెలువడసాగాయి. సాధ్యమైనంత సహజమైన తెలుగులో రచనలు రూపొందుతూ ఉండేవి. కొమర్రాజు వారి మూలంగా ఐతిహాసిక శాసనాలను గూర్చి వ్యాసాలు కూడా పత్రికలలో ప్రచురితమయ్యి పాఠకులకు ఇతిహాసం పట్ల ఆసక్తి వృద్ధికాసాగింది.

**17. గాడిచర్ల హరిసర్వోత్తమరావు**

1908 – 'స్వరాజ్య తెలుగు వారపత్రికను బోడి నారాయణరావు గారి సహకారంతో గాడిచర్ల వారు ప్రారంభించారు. తెల్లదొరల అక్రమ అన్యాయ చర్యలను తీవ్రంగా విమర్శిస్తూ రావుగారు వ్యాసాలు రాసేవారు. జాతీయోద్యమానికి పత్రికలు ప్రధాన సాధనాలు అని విశ్వసించివారు.

ఉదా : 1908 లో తిరునల్వేలిలో ఆష్ అనే ఆంగ్లేయ అధికారిని విప్లవకారులు కాల్చి చంపారు. ప్రజోద్యమాన్ని అణిచివేసేందుకు పోలీసులు జరిపిన కాల్పుల్లో ముగ్గురు అమాయకులు ప్రాణాలు కోల్పోయారు.

''రావుగారు 'విపరీతబుద్ధి' అన్న శీర్షికతో సంపాదకీయం రాస్తూ అధికారుల దమనకాండను తీవ్రంగా ఖండించారు. రాజద్రోహం నేరంపై మూడేళ్ళు కఠిన కారాగార శిక్ష అనుభవించారు.''

గాడిచర్ల వారు ప్రెస్ వర్కర్ల సంఘానికి అధ్యక్షులుగా ఉండేవారు. అంతేగాకుండా ఆంధ్ర పత్రిక సంపాదకులుగా కొంతకాలం పనిచేశారు. తాడిపత్రిలో 'మాతృసేవ' పత్రిక స్థాపనకు సంకటి కొండారెడ్డి గారిని ప్రోత్సాహించారు. శైవ సుబ్రహ్మణ్య శర్మగారితో పాటు 'కౌమోదకి' అనే పత్రికను స్థాపించారు. ఈ పత్రిక ద్వారా ఆయుర్వేద వైద్య ప్రచారం చేశారు. హిందూ పత్రికకు సమీక్షలు ఎన్నో చేశారు.

**18. ఆంధ్రసాహిత్య పరిషత్**

1912 – ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక త్రైమాసిక పత్రిక భాషా సాహిత్యముల విమర్శకు ఎక్కువ ప్రాధాన్యము ఇచ్చిన పత్రిక. కావ్య విమర్శలు, సమీక్షలు, పీఠికలు, శబ్దచర్చలు, పాఠపరిశీలనములు, భాషా విషయక వ్యాసములు, కవి జీవితములు, సాహిత్య చర్చలు, కవిత్వ లక్షణ వివేచనము మున్నగు విమర్శ ప్రక్రియలు ప్రముఖ

స్థానమును ఆక్రమించినవి. ఉత్తర రామచరిత్ర రసవిచారము, మహాభారత పరిశీలనము, అలంకారశాస్త్ర వివేచనములకు సంబంధించిన వ్యాసములు కూడ పేర్కొదగినవి.

ఆంధ్ర సాహిత్య పరిషత్ నిర్వాహకులైన జయంతీ రామయ్య పంతులు గ్రామ్య భాషా వ్యతిరేకి అగుటచే గ్రాంథిక భాషా సమర్థములైన వ్యాసములు ప్రచురితమయ్యేవి. ఆంధ్రేతరములైన తమళ, వంగ, ఉర్దూ భాషాసాహిత్యముల సమాలోచనము కూడా ఉండేది.

19. మద్దూరి అన్నపూర్ణయ్య

1922 - 'కాంగ్రెసు' వార పత్రికగా వెలువడింది.

20. కౌతు శ్రీరామమూర్తి

1923 - 'శారద' మాస పత్రికలో కాశీభట్ల, నడకుదుటి గొల్లపూడి శ్రీరామమూర్తి, దర్భాయజ్ఞేశ్వర సోమయాజులు మున్నగు వారి విమర్శలు ప్రచురితమయ్యేవి. ఉత్తమ కళా సాహిత్య పత్రికగా ఇది పేరుగాంచింది.

21. సురవరం ప్రతాపరెడ్డి

1925 - 'గోల్కొండ' పత్రికను హైదరాబాద్ సంస్థానంలోని తెలుగు ప్రజల విజ్ఞానానికి తెలుగులో పత్రికను ప్రారంభించాలని నిశ్చయించి రాజబహదూర్ గారి ఆశీస్సులతో ప్రారంభించారు. ఎవరికీ జంకక, ప్రభుత్వం ఒత్తిడికి లొంగక తాము సత్యమని నమ్మిన దానిని ప్రజల శ్రేయస్సు కొరకు ప్రకటించి ప్రచారం చేయడంలో ఈ పత్రిక ఎన్నడూ వెనుకాడలేదు. సురవరం ప్రతాపరెడ్డిగారు గోల్కొండ పత్రికలో వ్యాసాలూ, చర్చలు సమీక్షలు, లేఖలు, మొదలగు వివిధ విషయాలపై వేర్వేరు మారు పేర్లతో లెక్కలేనన్ని వ్యాసాలు రాసి ముద్రించారు.

గద్వాల్ సిద్ధాంతి, వెర్రివెంగళప్ప, చిత్రగుప్త, విశ్వామిత్ర, సంగ్రామసింహ, బహదూర్, జంగం బసవయ్య, హితదురి, భావకవి రామమూర్తి, యుగపతి అమృత కలశి అనే కలం పేర్లతో పెక్కు వ్యాసాలు రాశాడు.

వివాదాస్పదమయిన ఏదో ఒక విషయాన్ని ఎన్నుకుని దానిపై వాదోపవాదాలు లేవదీసి రెండు వైపులా తానే వాడిగా వేడిగా ఆసక్తికరంగా ఉత్కంఠభరితంగా ఉత్తమ వ్యాసాలు ఎన్నో రాశారు.

ఉదా : హిందువులు శాఖాహారులా?
జంగంలు బ్రాహ్మణులా?
శ్రీకృష్ణుడికి మీసాలున్నాయా?

ఆంధ్ర పత్రిక, తెలుగు తల్లి, మాతృసేవ, ప్రజాబంధు, ప్రబుద్ధాంధ్ర, సుజాత, కళ, శోభ, పినాకిని, మొదలైన పత్రికల్లో వీరి వ్యాసాలు ముద్రించబడ్డాయి. వీరి వ్యాసాలతో ఆయా పత్రికలు ప్రాముఖ్యతను సంతరించుకున్నాయి. 1951 లో ప్రజావాణి అనే దిన పత్రికను ప్రారంభించారు.

గోల్కొండ పత్రిక ఛాందస వాదాలను ఎదుర్కొని స్త్రీజనాభ్యుదయ వాదానికి కృషి చేసింది. స్త్రీలు రాసిన వ్యాసాలను ప్రధానంగా ప్రచురించేది. 1931 లో ఎల్లాప్రెగడ సీతకుమారి, రాసిన 'స్త్రీ ఆర్థిక స్వాతంత్ర్యం' వ్యాసాన్ని ప్రచురించారు.

ముడుంబా వెంకటరాఘవాచార్యులు తెలంగాణలో కవులు లేరు అని అన్నారట. అతనికి తగిన సమాధానం చెప్పడానికి సురవరం గారు నాలుగు నెలలో మూడు వందల యాభై కవుల జాబితా వివరాలను 'గోల్కొండ కవులు' అను గొప్ప సంచికను ప్రచురించారు.

1947 లో గోల్కొండ దినపత్రికగా అయిన తరువాత సంపాదకీయాలపై ప్రభుత్వం ఒక ఆంక్ష విధించింది. ఈ ఆంక్ష ప్రకారం ప్రతిరోజూ రాసే సంపాదకీయాలను మొదట సమాచారశాఖకు పంపి వారు సూచించిన మార్పులను చేయవలసి ఉండేది. కాని ప్రతాపరెడ్డి గారు ఆ ఆంక్షను ఒప్పుకోలేదు. అందుకు బదులుగా ప్రపంచ మహనీయులు అన్ని భాషలలో రాసిన సూక్తులను ముఖ్యంగా ప్రపంచ ప్రాథమిక సత్యాలకు సంబంధించిన సూక్తులను - సేకరించి ఒక్కొక్క రోజు ఒక్కొక్క సూక్తిని ప్రకటించేవారు. ఈ సూక్తులు ప్రభుత్వానికి సంపాదకీయాల కన్నా ఎక్కువ బాధ కలిగించేది. పత్రిక చరిత్రలో ఇది మరుపురాని సన్నివేశం.

## 22. పసుమాముల శర్మ

1927 - 'సుజాత' పత్రికలో విమర్శలు, శబ్దచర్చలు, భాషా వాఙ్మయ విమర్శలు, గ్రంథ సమీక్షలు మొదలగు వానికి ప్రాముఖ్యత వహించింది. తెలంగాణలో వెలువడిన సాహిత్య పత్రికలలో పేర్కొనదగినది.

## 23. విశ్వనాథ సత్యనారాయణ

1927 - 'జయంతి' పత్రికలో సృజనాత్మకమైన ఉపజ్ఞాయుతమైన ఉత్తమ సాహిత్య విమర్శలు ఇందు ప్రచురించబడేవి. అనేక మంది కవుల, విమర్శకుల వ్యాసాలు ఉత్తమ విమర్శ రచనకు ఒరవడి దిద్దినవి.

## 24. సింహాద్రి గోవిందాచార్యులు

1957 - ప్రజాబంధు, జన్మభూమి, చిత్రగుప్త మొదలగు అతివాద భావాలున్న పత్రికలు వెలువడ్డాయి. హిందూ సుందరి అను స్త్రీల పత్రిక, బాలమిత్ర అను పిల్లల పత్రిక, వ్యంగ్యధోరణితో కోణంగి, చిత్రాంగి పత్రికలను నడిపారు.

25. ఆంధ్రశేషగిరిరావు

1934 – ఆంధ్రభూమి వారపత్రికగా ఉండి తర్వాత దినపత్రిక అయ్యింది. శేషగిరిరావు గారు, భారతి, గృహలక్ష్మి పత్రికలకు వ్యాసాలు రాసేవారు. సాంఘిక భాషా సాహిత్య రాజకీయ రంగాలలో ఆంధ్రుల సర్వతో ముఖ వికాసమే లక్ష్యంగా పత్రిక నిర్వహించారు.

''భారత రమణుల ఔన్నత్యంనకైన ఉద్యమాభివృద్ధికి సముచిత సరణిని కృషిసల్పి మహిళల జీవిత సమస్యలకు సంబంధించిన విషయాలకు ప్రత్యేక వివరణము ఈ పత్రిక ఆశయములలో ఒకటి'' అని ప్రారంభ సంచికలో చెప్పుకున్నారు.

జీవితభీమా గురించి ప్రత్యేక శీర్షిక ప్రవేశపెట్టారు. ఈ జీవితభీమా మీద ఒక రెగ్యులర్ కాలం అప్పటి సమకాలీన పత్రికల్లో గాని, ఇప్పటి పత్రికల్లో గాని ఎక్కడా కనిపించదు.

ఈ రోజు పత్రికల్లో వ్యాసం కథ వేస్తున్నప్పుడు అందులోని రెండు మూడు వాక్యాలను పాఠకుల్లో ఆకర్షణ కోసం పెద్దగా ప్రచురించడం గమనిస్తాం. ఈ ప్రయోగం శేషగిరిరావు ఆ రోజులలోనే ప్రారంభించారు. 'సందేహాలు – సమాధానాలు' శీర్షిక పెట్టి పాఠకులను విజ్ఞానవంతులుగా చేయడంతో పాటు భాగస్వాములను చేశాడు. రచయిత సంతకాలను బ్లాక్ చేయించి వారి రచన దిగువ వేసేవారు. దీని వలన వారి చేతిరాత తెలిసేది. మహిళాలోకం శీర్షిక క్రింద పోర్చుగీసు, ఇటలీ, జర్మనీ దేశవిదేశాల లోను భారతదేశంలో భిన్న ప్రాంతాలలోని స్త్రీల స్థితిగతి సమస్యను వివరించే వ్యాసాలు ను ప్రచురించేవారు. ఆరోగ్యం గూర్చి ఎంతో విలువైన శీర్షిక వెలువడేది. సూక్తులు, సమీక్షలు, బెళుకులు సరేసరి ఉండేవి. వింతలూ – విడ్డూరాలు పేరుతో ఆశ్చర్యకరమైన నమ్మశక్యం కాని ఎన్నో విశేషాలు ప్రకటించేవారు.

ఉదా : అలహాబాదులోని లేడీ డెఫ్రిన్ హాస్పిటల్‌లో ఒక తల్లికి ఒక ఆడపిల్లతో పాటు అంటుకొని ఒక పాము పిల్ల కూడా బయటకు వచ్చిందట పిల్ల, పాముపిల్ల రెండూ చనిపోయాయట.

ఆంధ్రభూమి సంపాదకీయాలలో వ్యాసాలలో సునిశితత్వం, వ్యంగ్యం, విషయ విశ్లేషణ బాగా కనిపిస్తాయి.

ఉదా : అంతః సౌందర్యం కానీ బాహ్య సౌందర్యం కాదని పెళ్ళికొడుకులకు ఒక సంపాదకీయంలో సరసంగా హితవు చెబుతూ

''ఇంతకీ అందం అనే వస్తువు కొరుక్కుతినేది కాదు.
మోహినిని ముద్దు పెట్టుకున్నా, మొద్దును ముద్దుపెట్టుకున్నా

కలిగే మోదం ఒకటే. కొంత మన ఊపిరి గాలిలో కలిసి పోవడం కొంత మన ఉమ్మి ఖర్చు కావడం తప్ప విశేషప్రయోజనం లేదు.'' (ఆంధ్ర శేషగిరిరావు : 1938, ఆంధ్రభూమి జులై సంచిక.)

తన ఒక్క పేరుతో కాక వివిధ కలం పేర్లతో వ్యాసాలు రాసేవారు. సమకాలీన యువరచయితలకు ఎందరికో పత్రికలో అవకాశం కల్పించారు. ఆనందవాణి అనే పత్రికకు ఉపసంపాదకులుగా పనిచేశారు.

26. తాపీ ధర్మారావు

1936 – జనవాణి తెలుగువారికి రాజకీయంగానూ, ఇతర విధాలుగానూ, ఎంతో సేవచేసిన పత్రిక. వ్యవహారిక భాషను వాడుకలోనికి తీసుకొచ్చిన ఘనత తాపీ ధర్మారావు గారి 'జనవాణి' పత్రికకే దక్కుతుంది. సమదర్శిని పత్రిక జైళ్ళలో ఉండే కాంగ్రెసు వారికి సత్యాగ్రహ వార్తలను అందించే ఏకైక పత్రిక. పట్టాభి గారి వచన రచనలు కథలను ప్రచురించారు. పారిజాతపహరణానికి భావప్రకాశిక వ్యాఖ్య ఇందు లోనే రాశారు. తాపీ ధర్మారావు గారి వ్యాసాలను పరిశీలిస్తే భాష సరళ గ్రాంథికం అని తెలుస్తుంది. అనేక విషయాలకు సంబంధించిన ఛాయ చిత్రాలు కూడా ఈ పత్రి కలోనే అచ్చు అయ్యేవి.

ప్రజామిత్ర పత్రిక

ధర్మారావు గారు క్రొత్త పాళీ వ్యాసాలను, దేవాలయాల మీద బూతుబొమ్మ లెందుకు అన్న వ్యాసాలను ప్రజామిత్ర ప్రచురించింది. రచయిత పేరు చివరి దాకా తెలియకుండా వీటిపై విమర్శలను ఆహ్వానించి వాటిని ప్రచురిస్తూ ధర్మారావులో భావ పరివర్తనకు స్పష్టత వచ్చేలా చేసింది. ఆ రోజుల్లో ఈ పత్రికల్లో ఉన్న ప్రాచుర్యాన్ని అర్థం చేసుకోవడానికి రచయిత చిత్రకారుడు అయిన సంజీవదేవ్ వాక్యాలు సహకరి స్తాయి.

''ఎందరెందరో సాహితీ రథాలు, మహారథాలు అందులో రాస్తుండేవారు. వారిలో తాపీ ధర్మారావు రచనలు మాకెంతో ఆకర్షకంగా ఉంటూండేవి ...'' పత్రికా విమ ర్శనా రంగంలో కొత్త ఒరవడిని పెట్టింది. 'వారి ముచ్చిలి గుంటలో మూడు కన్నుంద'ని, 'స్థానం వారి కుంభకోణం', 'ధనవంతులకే ధర్మాసుపత్రులు మొ॥ వ్యాసాలు ఇందులో వచ్చేవి.'

భాష క్రమంగా కఠిన గ్రాంథికం నుండి, సరళ గ్రాంథికం వరకూ కనిపి స్తూండేది. భాష ఇదే విధంగా ఉండడానికి మరొక కారణం ఈ పత్రికల్లో చర్చించే సమ స్యలు కేవల విద్యాధికవృత్తికి చెందినవే అనడం కూడానూ. అందుకే ధర్మారావు రచ

నల్లో వచ్చిన వాటిని పరిశీలిస్తే ఈ ప్రభావమే కన్పిస్తుంది. తాను నడిపిన 'కొండెగాడు' లో సంస్కరణ - భాష వంటి సమస్యలును తీసుకున్న గ్రాంధికంలోనే రాశాడు. అయితే శైలి మాత్రం అప్పుడప్పుడే ప్రచారానికొస్తున్న వచనం - నాటకాల ఫక్కీలో ఉంది. భాష - భావంలో మార్పు తెచ్చారు.

పత్రికా రంగంలో అనువాద భాషకు మారుగా తేట తెలుగు భాషను ప్రవేశ పెట్టి ఒక కొత్త ఒరవడి దిద్దారు. పత్రికా రచనకు ప్రాణం క్లుప్తత. ఉపోద్ఘాతం ఏదీ లేకుండా నేరుగా విషయాన్ని ప్రస్తావించడం. ప్రధానమైన ప్రశ్నలకు క్లుప్తమైన సమాధానం వార్త ప్రారంభంలోనే ఉండాలి. మొదటి పద్యంలోని కావ్య బీజముండాలన్న మన అలంకారికుల మతం ఇలాంటిదే.

సారళ్యం, స్పష్టత, సూటిగా ఉండే వాక్యనిర్మాణ పద్ధతి ఇవన్నీ ధర్మారావు గారి పత్రికా రచనలో ఉంటాయి. పత్రికా భాషను బాగా పాలిష్ చేయడం, వచనంలో సాఫీగా సాగే శైలిని సృష్టించడంలో జనవాణీ పత్రిక పెట్టింది పేరు. వ్యావహారికంలో రాసిన రచనలనే అచ్చు వేసేదీ ఈ పత్రిక.

**1940 కాగడా**

పర్యాలోకనం శీర్షికలో ప్రపంచ రాజకీయ దృశ్యాలను సంపాదకుల దృష్టి నుండి సవిమర్శకంగా సమీక్షా రూపంలో పాఠకులకు అందించేవారు. వొట్లరున్న (?) నాటకాన్ని పాఠకులకు సవిమర్శకమైన భావాలతో జతచేర్చియు వార్తలనందించే వారు. ప్రత్యేకంగా వార్తలను విమర్శలను జోడించకుండా ప్రకటించడానికి 'యుద్ధం' అనీ 'యుద్ధశ్రవణం' అనీ శీర్షికలను నిర్వహించాడు. 'పిట్టచూపు' అనే శీర్షికలో భారతదేశపు రాజకీయ రంగాన్ని పాఠకులకు అందించేవారు.

విమర్శ కటువుగా కాకుండా మృదువుగా వ్యంగ్యంగా ఉంటుంది. 'పద్యభిక్ష' అన్న శీర్షిక క్రింద కొంతకాలం తెలుగు దేశంలోని ప్రజల జీవన పరిస్థితులను ఒక చిన్న గీతంలో గాని, నాలుగు చరణాల్లో గాని వివరించండని పాఠకులు కోరారు. ''శ్లోకార్థేన ప్రవాక్షామి యధుక్తం గ్రంధ కోటిభిః'' అన్న శ్లోకాన్ని గతంలో వీరు తాము నడిపిన 'కొంటెగాడు' పత్రికకు నినాదంగా కూడా వాడుకున్నారు.

**27. రామబ్రహ్మం**

ఈయన తాపీ ధర్మారావు గారితో కలిసి ప్రజామిత్ర, సమదర్శినీ పత్రికలకు సంపాదకత్వం వహించారు. వాణి అనే పత్రికలో కూడా రచనలో చేస్తుండేవారు. అప్పటికే ఒక రకంగా కమ్మ చరిత్ర అనదగ్గ 'గండికోట పతనం' నాటకం రాసి తెలుగు పాఠకుల్లో మంచి రచయితగా పేరు పొందారు. రామబ్రహ్మం సంపాదకత్వంలో 1932

నుండి ప్రజామిత్ర మద్రాసు నుండి రావడం ఆరంభమైంది. వీరిద్దరు ఉన్నచోట సాహిత్య వేదికలు జరుగుతుండేవి.

## 28. నార్ల వేంకటేశ్వర రావు

1938 – ఆంధ్రప్రభ గోయెంకా గారి రెండవ తెలుగు దిన పత్రిక. మొదట న్యాపతి నారాయణ మూర్తి సంపాదకత్వంలోనూ, పిదప నార్ల వేంకటేశ్వర రావు గారి సంపాదకత్వంలోను నడిచింది. తెలుగు సాహిత్యానికీ, సంస్కృతికి ఎంతో దోహదం చేసింది. 1960 – ఆంధ్రజ్యోతి వీరి సంపాదకత్వంలోనే వచ్చింది.

వార్తలలోనూ, సంపాదకీయలలోను మొత్తం వ్యావహారిక భాషను తీసుకు వచ్చి దానికి అనన్య ప్రచారం కల్పించినవారు నార్లవారు. ఆయన వాడుక భాషను ప్రచారం చేయడమే కాక, వార్తా రచనలో ఒకే విధమైన శైలిని నిర్బంధంగా ప్రవేశపెట్టారు. దీనివల్ల రచనలో ఒక క్రమశిక్షణ అలవడింది.

దిన పత్రిక సంపాదకీయలకు నార్లగారిదే ఒరవడి వస్తువులను ఎన్నుకోవడంలో, వింతపోకడలు పోవడంలో, వైదుష్య స్ఫోరకంగా, నార్లగారు వినూత్న ప్రయత్నాలు చేశారు.

ఉదా : వారానికి ఆరు రోజులలో ఆరు పేజీలను ఆరు శీర్షికలకి కేటాయించడం ఒక రోజు మహిళలకు, ఒక రోజు పాడి పంటలకు, ఒక్కొక్క పేజీలో ఒక్కొక్క శీర్షికను ప్రచురించేవారు. కాని ఎంత ఉపయోగకరమైన ఉత్తమ ప్రయోగంగా అయినప్పటికి ఉత్త ప్రయోగంగానే మిగిలిపోయి రాను రాను దానిని నిర్వహించడం కష్టసాధ్యమయి ఆపి సేయవలసి వచ్చింది.

'ఐక్యరాజ్య సమితి', 'అలీన విధానం', 'కాందిశీకులు', 'దిగ్బంధం' మొదలైన ఎన్నో పదాలను రూపొందించి జర్నలిజానికి, భాషకి కొత్త సౌష్ఠవాన్ని, సౌందర్యాన్ని ఉద్దీపింపజేశాడు. ప్రజల గొంతులలో ఉత్పన్నమయిన శబ్దాలకు ప్రచురణ గౌరవం కల్పింపజేశాడు.

ఉదా : ''తవ్వేడ, బడు ధాతువును ఉపయోగించేవాడు.

బడుద్దాయి అని, యొక్క లతో తెలుగు భాషకు డొక్క పొడవద్దని'' చమత్కరించాడు. ఆయన అప్పుడప్పుడు రాసిన వ్యాసాలలో 'కొత్త పాత', 'మాటామంతీ', 'లోకం పోకడ' మొదలైన తెలుగు వ్యాసాలను ప్రపంచ భాషల పరిధికి తీసుకుని వెళ్ళాడు. విద్యార్థిగా ఉన్నప్పుడే 1928 లో 'యువజన పత్రిక' అనే లిఖిత మాస పత్రిక కాకినాడ లో ప్రారంభించారు. కాంగ్రెసు పత్రికలో మారు పేర్లతో కొన్ని రచనలు చేశారు. భారతి ప్రజామిత్రులకు తరచు వ్యాసాలు రాసేవారు. ''స్వతంత్ర భారత్'' అనే

అజ్ఞాతంగా నడిచే పత్రికకు వ్యాసాలు రాసేవారు. 1933 ప్రభ పత్రిక బాధ్యతను నిర్వహించారు. కోట సుబ్బారావు గారు కృష్ణాపత్రికకు ఇన్‌చార్జి ఎడిటర్‌గా ఉండగా ఈ పత్రికలో నార్లవారు 'వింతలు – విశేషాలు' శీర్షిక నిర్వహించారు.

వార్తలు సేకరించి, వాటిని ఆకర్షణీయంగా ప్రచురించడంలో ఎంతో నైపుణ్యాన్ని ప్రదర్శించారు. మొదటి పుటలో వ్యాపార ప్రకటనలను వేయకపోవడం ఆంధ్రప్రభ చేసింది. ఆ విధంగా తెలుగు దిన పత్రికలో వార్తలను మొదటి పుటలో ప్రచురించిన కీర్తి నార్ల వారిదే.

ప్రచురణలో ఏ వార్తకు ఎంత ప్రాముఖ్యతనివ్వాలో ఏ శీర్షికను ఉంచాలో ఈ విషయాలన్నిట నార్లవారు ఎంతో శ్రద్ధ చూపారు. ప్రత్యేకించి పతాక శీర్షికలను పెట్టడం, కార్టూన్లు ప్రచురించడం మొదలైన విషయాలలో ఆంధ్రప్రభ తక్కిన తెలుగు దినపత్రికలకు ఒరవడి అయ్యింది. సంపాదకీయ రచనల్లో నార్లవారు తాను చెప్పదల్చుకున్న అభిప్రాయాలను చెప్పినప్పుడు చారిత్రక సంఘటనలను, రాజకీయ సంఘటనలను జరిగినప్పుడు నార్ల సంపాదీయాలు ఎంతో ఉత్తేజంగా భావస్ఫోరకంగా భాషకు, జర్నలిజానికి ఒరవడి పెట్టినట్టుగా సాగాయి. అవి తెలుగుజాతి చైతన్యాన్ని, వైజ్ఞానిక దృక్పథాన్ని కల్గించే విధంగా ఉన్నాయి.

ఆయన సంపాదకీయంలో విషయ పరిజ్ఞానమే కాక సాహితీ మర్యాదలను ఆమ్రేడితము చేసి చూపారు. సంపాదకీయాలు అధికంగా సాహిత్య శ్రేణికి చెందినవి. భాషా సాహిత్యం, సంస్కృతి, విజ్ఞానం, రాజకీయాలు, మహితాత్ముల వ్యక్తి చిత్రణల వంటి అనేక విషయాల మీద ప్రామాణిక వ్యాఖ్యానాలు వాటిలో లభిస్తాయి. శబ్దార్థాల రహస్యాలను హస్తగతం చేసుకుని, మేధకు హృదయానికి రసహేతువును నిర్మించిన మహా మనిషి. చిన్న చిన్న వాక్యాలతో చిన్న చిన్న పేరాలతో పొంకంగా రాయడం నార్ల వారి పద్ధతి. వ్యవహారిక వచనకు పునాదులు వేశారు. ఆయన భాషలో జాతీయాలు, సామెతలు అధికం. తెలుగు పలుకుబడి విస్తారం. సంస్కృత జటిలత్వం కన్పించదు. వాడుక భాష గాని పేలవం కాదు. దానిలో శ్రవణ మాధుర్యం ఉంటుంది. కాని శ్రవణ మాధుర్యానికి ప్రాధాన్యమివ్వక ఎక్కడ ఏ పదం వాడాలో అక్కడ ఆ పదం వాడారు.

నార్లకు పూర్వం తెలుగు జర్నలిజంలో ఆంగ్ల శబ్దాలకు అర్థ సామ్యాన్నే తీసుకొనేవారు. నార్ల భాషా స్ఫోరకతను గుర్తించి పదసృష్టి చేశారు.

ఉదా : Cold war అనే మాటకు ప్రచ్ఛన్న యుద్ధము అని Summit Conference అనే పదానికి శిఖరాగ్ర సమావేశం అని నార్ల వారు స్ఫోరక పదాలను సృష్టించారు.

భావాన్ని సుభంగా బట్వాడా చేయగల అర్థవంతమైన అనువాదాలకు నార్ల

స్వీకారం చుట్టారు. దినపత్రిక ద్వారా అంతర్జాతీయ పరిజ్ఞానం ఆంధ్రులకు కల్పించిన కీర్తి ఈయనదే. భాషా విప్లవంతో భావ విప్లవానికి దోహదం చేశారు. శైలిలో, నూతన శబ్ద కావిష్కరణలో, వైజ్ఞానిక దృక్పథంలో తెలుగు జర్నలిజానికి ఆయన వదలి వెళ్ళిన వార సత్వం సుసంపన్నమైనది.

తెలుగు పత్రికల రూపురేఖలను దిద్ది, దారి తెన్నూ నిర్దేశించిన తొలితరాల సంపాదక మహనీలైన కందుకూరి వీరేశలింగం పంతులు, ముట్నూరి కృష్ణారావు, గాడిచర్ల హరిసర్వోత్తమరావు, కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు, తాపీ ధర్మారావు, సురవరం ప్రతాపరెడ్డి, నార్ల వేంకటేశ్వరరావు. ఇలా ఎందరో మహానుభావులు పునాదులు వేసిన తెలుగు పత్రికా రంగ సౌధానికి మహాద్భుతమైన చరిత్ర ఉంది.

## మహిళా సంపాదకులు

1. శ్రీమతి మాడభూష చాడమ్మ

కళ్ళేపల్లి వెంకట రమణమ్మ

1902 – హిందూ సుందరి అనే పత్రికకు సంపాదకత్వం వహించారు.

2. పులుగుర్త లక్ష్మీనరసమాంబ

1904 – సాహితీ పత్రికను 7 సంవత్సరాల కాలం నడిపింది. ఈమె తన పత్రికలో ముఖ్యంగా కందుకూరి వారికి వ్యతిరేకంగా రచనలు సాగించేది. వితంతు వివాహం, సంఘసంస్కారం వంటి కార్యాలలో వీరేశలింగం గారికి వ్యతిరేక వాదధోరణితో పత్రికను కొనసాగించింది. స్త్రీ విద్యను ప్రచారం చేయడంలో స్త్రీ విద్యాభివృద్ధిని కొన సాగించడంలో ప్రోత్సాహం వహించేది. ఈమె 'జనానా', హిందూ సుందరి వంటి పత్రికలకు వ్యాసాలు రాసేది. స్త్రీల పురోభివృద్ధికి ఉపన్యసించి ఆ ఉపన్యాసాలను పత్రికలలో రాసేది.

ఉదా : పాతివ్రత్యం, అగ్రసవాది పురాది ఉపన్యాసం, ఆధ్యాత్మిక విద్యను మన దేశ ప్రకృతికి గల సంబంధం వంటి వ్యాసాలు ఈ పత్రికలో ప్రచురించబడ్డాయి.

3. వింజమూరి వెంకట రత్నమ్మ

1914 – 'అనసూయ' మాసపత్రికగా స్థాపించింది. సంఘసేవకు కృషి చేసింది. ఈమె చాలా పత్రికలకు వ్యాసాలు, కథలు, పద్యాలు రాసి పంపింది. కేసరి 'గృహలక్ష్మి' లో రచనలు విరివిగా ప్రచురితమయ్యేవి. నవ్య సాహితీ సమితిలో ఒకే ఒక్క స్త్రీ సభ్యురాలుగా ఉండేది. ఈమె అనంతరం ఈమె కుమార్తెలయిన సీత, అనసూయ ఈ పత్రికను నడిపారు.

4. శ్రీమతి రామాబాయి

1919 – సౌందర్యవల్లి ఈ పత్రికను గాడిచర్ల హరిసర్వోత్తమరావు గారి భార్య శ్రీమతి రామాబాయి గురుస్వామి శెట్టి సహాయంతో ఈ పత్రికను నడిపింది. ఈమె భర్త వలె సంఘసంస్కరణలను బలపరిచేది. మహిళా సమస్యలను ఈ పత్రిక ద్వారా ప్రకటించేది.

5. పొణకా కనకమ్మ

1930 – 'జమీన్ రైతు' పత్రికను నడిపింది. పొణకా కనకమ్మ, ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మ తొలిజంట రచయిత్రులు పేరుగాంచారు. గీతలో ఉన్న శ్లోకాలను అనువదించి పత్రికల్లో ప్రచురించేవారు. కనకమ్మ తరచు పత్రికలకు రచనలు చేస్తుండేది.

6. ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మ

1931 – 'వీరభారతి' అనే తెలుగు జాతీయ మహిళా వారపత్రికకు సంపాదకురాలుగా పనిచేసింది.

7. గుమ్మిడిదల దుర్గాబాయమ్మ

1942 – 'ఆంధ్ర మహిళా' పత్రిక 22 సంవత్సరాలు కొనసాగింది. మహిళల కోసం, మహిళాభ్యున్నతి కోసం నిర్విరామంగా కృషి చేసింది. ఈ పత్రిక మహిళా రచయిత్రులను ప్రోత్సహించింది. ఈ పత్రికలో స్వాతంత్ర్య సమర యోధులైన కనపర్తి వరలక్ష్మమ్మ, పెద్దాడ కామేశ్వరమ్మ వంటి వీరవనితల వ్యాసాలు ప్రచురితమయ్యేవి. ఈ పత్రికకు చాలా మంది మహిళలు సంపాదకత్వం వహించారు. వారిలో లక్ష్మీ రఘురాం, చెన్నగంటమ్మ, మాలతీ చందూర్, కె.రాజ్యలక్ష్మి ముఖ్యులు.

ఇంతవరకు చెప్పిన వారందరూ సంపాదకులుగా ఉండి పత్రికా రచనకు తోడ్పడినారు. సంపాదకులుగా కాకుండా మరి కొంతమంది పత్రికా రచనలో విశిష్టమైన కృషి చేశారు. పత్రికా రచనకు తోడ్పడ్డారు.

1. జి. కృష్ణ

"బయట జరిగిన సంఘటనను ఇంట్లో మీ అమ్మకం ఎలా వివరిస్తారో, ఆ క్రమంలోనే విషయాన్ని కాగితం మీద పెట్టి అదే భాష వాడండి. అదే ఒక చక్కటి వార్త అవుతుందని వివరించాడు."

2. పందిరి మల్లికార్జునరావు (విలేఖరి)

జనవాణి పత్రికకు రాజమహేంద్రవరం నుండి పందిరి మల్లికార్జునరావు విలేఖరిగా ఉండేవాడు. తన అనుభవాలను వివరిస్తూ జనంలో మంచి పత్రిక అని జనవా

ణికి పేరుండేదని దీనిని అందరు 'కానీ' పత్రిక అనే వాళ్ళని అన్ని విధాలా ఆనాటి ఆంధ్రపత్రిక కన్నా చాలా బాగా ఉండేదని చెప్పారు.

## కార్టూనిస్టులు

కార్టూన్ అంటే రాజకీయ సాంఘిక ఆర్థిక రంగాలలో దుర్మార్గులను, వ్యక్తుల పోకడలను, సున్నితమయిన రీతిలో విమర్శిస్తూ వ్యంగ్య ధోరణిలో పత్రికలలో ముద్రించే చిత్రం.

### 1. తలిశెట్టి రామారావు

తెలుగు కార్టూన్ పితామహుడు.

### 2. విశ్వాత్మల నరసింహమూర్తి

ఆంధ్రపత్రికలో కార్టూన్‌లు గీసేవారు. వీరి కార్టూన్లే గాక కార్టూన్ కథలు, బొమ్మల కథలు కూడా గీసేవారు.

### 3. సత్యరాజు లక్ష్మీనారాయణ (బాపు)

మన సంస్కృతీ సాంప్రదాయాన్ని ప్రపంచానికి గర్వంగా చూపగల్గినవి బాపు బొమ్మలు.

### 4. శ్రీరామభట్ల

తొలితెలుగు రాజకీయ కార్టూనిస్ట్. విశాలాంధ్రలో ఈయన కార్టూన్లు వచ్చేవి.

## పత్రికలు (నాడు - నేడు)

తెలుగు సాహిత్య పత్రికల కృషి ఫలితంగానే తాళపత్ర గ్రంథాలలో శిథిలావస్థలో ఉండి ప్రచురణకు నోచుకోలేనటువంటి అమూల్యమైన ఎన్నో ప్రాచీన ఆంధ్ర, సంస్కృత కావ్యాలు వెలుగు చూశాయి. పాశ్చాత్య విద్య, సాహిత్యాల ప్రభావం వలన తెలుగులో ఆవిర్భవించినటువంటి ఖండకావ్యం, నవల, కథానిక వ్యాసం, విమర్శక వ్యాసం, పరిశోధన వ్యాసం, కవిత వంటి నవీన రచనా ప్రక్రియలు సాహిత్య పత్రికల ద్వారానే బహుళ ప్రచారాన్ని సంతరించుకున్నాయి.

నేటి పత్రికల్లో భాషా శైలి చాలా సరళంగా మారిపోయింది. మాండలిక పదాలు, పారిభాషిక పదాలు, సంస్కృత పదాలు, ఆంగ్ల పదాలు, హిందీ ఉర్దూ పదాలు ఎక్కువగా కనిపిస్తున్నాయి. కాని పత్రికతో పది కాలాలు నిలిచే రచనలు, వ్యాసాలు రాయడం లేదు. విలువలు పతనమవుతున్నాయి.

భాషా సాహిత్య వ్యామోహం నుంచి పత్రికలు దూరమై చలన చిత్ర వాణిజ్య ప్రకటనలతో సొమ్ము చేసుకోవడంతో మొదలైంది. పత్రికలు పంచవన్నెలతో, తళుకు

ెళుకులతో, అర్ధనగ్న చిత్రాలతో వాణిజ్య సమాచారంతో, కుల మత స్ఫూర్తితో ఆకర్షణ
రంగా మారాయి. పత్రికా ప్రచురణ భారీ పరిశ్రమగా మారిన తరువాత ప్రకాశకుల
ృష్టిలోన కాక పాఠకుల స్వభావంలో కూడా మార్పులు వచ్చాయి. జాతీయత భావం
్థానంలో ప్రాంతీయతాభిమానం పెరిగింది. భాషా సాంస్కృతిక విషయాలకన్నా వాణిజ్య
స్తరణలకే ప్రాముఖ్యం పెరిగింది.

ఇప్పుడు విలేఖరి పేరు ఎక్కువగా వేస్తున్నారు. అలా వేయడానికి వెనుక
ఖం చిట్లించుకునేవారు. మహా అయితే Candidus, Magnas, Super మొద
గు కలం పేర్లు పెట్టుకో గల్గేవారు. పత్రికా రచన వెనుకటి కంటే ఈనాడు ఎక్కువగా
దివింప చేసేటట్లు ఉండవచ్చు. కానీ దానిలో జ్ఞానబోధకమైనది తక్కువగా ఉన్నట్లు
ిపిస్తున్నది. నలభై యేండ్లకు పూర్వం కంటే ఇప్పుడు సాహిత్య ప్రక్రియలు చాలా
ా తక్కువ ఉండటంలోను, సాహిత్య సాంస్కృతిక విభాగాలలో విషయ పరిజ్ఞానం
వడుతుంది.

ుగింపు

ఒకప్పుడు కొద్దిమంది మేధావుల, పండితుల, దేశభక్తుల పరిశ్రమకు తాలవంగా
్న పత్రికా ప్రచురణ నేటికి వ్యాపార రంగంగా అనేకులకు ఉపాధి కల్పించగల
్రమగా మారుతుండగా విద్యారంగంలో జర్నలిజం ప్రత్యేక శాస్త్రంగా మొలకెత్తింది.

## ఉపయుక్త గ్రంథ సూచి

1. దత్తాత్రేయ శర్మ, ఎం. : 1992. *ముట్నూరి కృష్ణారావు గారి సంపాదకీయాలు.* హైదరాబాద్ : పద్మావతి ఆర్ట్స్ ప్రింటర్స్

2. ప్రసాద్, ఏటుకూరి. : 1989. *తాపీ ధర్మారావు జీవితం – రచనలు.* హైదరాబాద్ : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్.

3. రామచంద్ర, తిరుమలల. : 1989. *తెలుగు పత్రికల సాహిత్య సేవ.* హైదరాబాద్ : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్.

4. విశ్వేశ్వరరావు, నామాల. : 2003. *తెలుగు జర్నలిజం చరిత్ర.* హైదరాబాద్ : ప్రోగ్రెసివ్ కమ్యూనికేషన్స్.

5. వేంకటేశ్వరరావు, పొత్తూరి. : 2000. *నాటి పత్రికలు – మేటి విలువలు.* హైదరాబాద్ : ఆకృతి ఆఫ్‌సెట్ ప్రింటర్స్.

6. వేంకటేశ్వరరావు, పొత్తూరి. : 2004. *తెలుగు పత్రికలు.* హైదరాబాద్ : ఆకృతి ఆఫ్‌సెట్ ప్రింటర్స్.

7. సౌభాగ్యమ్మ, ఎస్.హెచ్. : *తెలుగులో సాహిత్య పత్రికలు.* తిరుపతి : ఎస్జీడి. పబ్లికేషన్స్.

8. హనుమచ్ఛాస్త్రి, జానుమద్ది. : 1994. *సుప్రసిద్ధుల జీవిత విశేషాలు.* హైదరాబాద్ : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్.

9. రామారావు, ఎస్వీ. : *తెలుగులో సాహిత్య విమర్శ.* హైదరాబాద్.

## పత్రికలలో వెలువడిన వ్యాసాలు

1. కృష్ణ, జి. : 1991 ఏప్రిల్ సంచిక , తెలుగు వైజ్ఞానిక మాసపత్రిక. *తెలుగు భాషాభివృద్ధిలో పత్రికల పాత్ర.*

2. ద్వా.నా. శాస్త్రి. : 1993 జనవరి సంచిక, తెలుగు వైజ్ఞానిక మాస పత్రిక. *సాహిత్య సేవలో ఆంధ్రసాహిత్య పరిషత్.*

3. నారాయణరావు, అవటపల్లి. : 1982 మార్చి సంచిక, భారతి. *దేశోద్ధారక శ్రీకాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు.*

4. నిత్యానందరావు, వెలుదండ. : 1997 సెప్టె. సంచిక, తెలుగు వైజ్ఞానిక మాసపత్రిక. *ప్రముఖ పత్రికా సంపాదకులు ఆంధ్రశేషగిరిరావు.*

ఫరంగరావు, వాకాటి. : 1988 జూలై-ఆగష్టు. తెలుగు వైజ్ఞానిక మాస పత్రిక, *తెలుగు పత్రిక రచనా వికాసం.*

్రయ్య, గొట్టిపాటి. : శ్రీవాణి పత్రిక. *ఆధ్యాత్మిక తేజస్వి ముట్నూరి కృష్ణారావు.*

్మోహనరావు, నండూరి. : 1991, తెలుగు పత్రికలలో కొత్త ప్రయోగాలు – పరిణామాలు. *తెలుగు పత్రికలలో నూతన ప్రయోగాలు – పరిణామాలు.* సికింద్రాబాద్ : తెలుగు విశ్వవిద్యాలయం.

్రరెడ్డి. : 1991 మే సంచిక, తెలుగు వైజ్ఞానిక మాస పత్రిక, *తెలుగు జర్నలిజంలో నార్లవారి నూతన పోకడలు – వాటి వైశిష్ట్యం.*

ుగోపాల్, నాగసూరి. : 1992 డిసె. సంచిక, తెలుగు వైజ్ఞానిక మాసపత్రిక. *తెలుగు జర్నలిజానికి వెలుగు దివ్వె – నార్ల.*

ారదా ప్రసాద్, హెచ్.వై. : 1989 ఆగష్టు, తెలుగు వైజ్ఞానిక మాసపత్రిక. *పత్రికా రచన అప్పుడు ఇప్పుడు.*

ంతోష్ కుమార్, కోపెల. : 1997 మార్చి, తెలుగు సాహిత్య మాస పత్రిక. *తెలుగు పత్రికలు – పత్రికల తెలుగు.*

ాత్య నారాయణ రావు, ఎం. : 1997 సెప్టె, తెలుగు వైజ్ఞానిక మాసపత్రిక. *తెలంగాణాలో తెలుగు పత్రికలు – గోల్కొండ పత్రిక.*

సిమ్మన్న, వి. : 1990 మార్చి, తెలుగు వైజ్ఞానిక మాసపత్రిక. *తెలుగు పత్రికా ప్రపంచానికే వరం – సురవరం.*

సిమ్మన్న, వి. : 1992 ఏప్రిల్, తెలుగు వైజ్ఞానిక మాసపత్రిక. *నూట అరవై యేళ్ళ తెలుగు జర్నలిజం.*

సుధాకర్ రెడ్డి, బి. : 1989 అక్టోబరు. స్రవంతి. *తెలుగు పత్రికల చరిత్ర.*

సోమసుందర్, ఆవత్స. : 1991 ఏప్రిలు. తెలుగు వైజ్ఞానిక మాసపత్రిక. *తెలుగులో తొలి ప్రహసన రచయిత – వీరేశలింగం.*

# పరిశోధకుడుగా గురజాడ

– తాటితోటి కిరణ్‌బాబు

గురజాడ యొక్క సృజనాత్మక రచనలు, ఆయన చేసిన ఇతర సారస్వత కృషిని మరుగుచేశాయనేది చారిత్రక వాస్తవం. గురజాడ సృజనకున్న శక్తి అంత గొప్పది. అందుకు 'కన్యాశుల్కం' నాటకమే నిదర్శనం. తెలుగు సాహిత్యచరిత్రను ప్రభావితం చేసిన ఆయన రచనల వెనుక అపారమైన పరిశోధన ఉన్నది. ఆయన వ్యాసాలు, లేఖలు, డైరీలు పరిశీలిస్తే ఈ సంగతి స్పష్టంగా అర్థమౌతుంది. గురజాడ బహుముఖ ప్రజ్ఞాశాలి. చరిత్రపరిశోధన, భాషాశాస్త్రం, శాసన పరిశీలన, నాటకరచన, నాటక ప్రదర్శన, నవలారచన, విద్యాబోధన, ఇతర భాషలతో తెలుగు తులనాత్మక సింహావలోకన, కావ్యవిమర్శ మొదలైన విషయాలెన్నో ఆయన పరిశోధనా కృషిని వివరిస్తాయి. గురజాడ స్వతస్సిద్ధంగానే పరిశోధనా దృక్పథం కలవాడు. దీనికితోడు తన కాలంనాటి గ్రాంధిక-వ్యావహారిక భాషావాదాలు మరింత సహకరించాయి. ఆనందగజపతిరాజు, జయపూరు రాజులిద్దరూ తమతమ వంశావళుల చరిత్ర యొక్క నిజానిజాలను వెలికితీసే బాధ్యతను కూడా గురజాడకు అప్పగించడంతో గురజాడ పరిశోధన మరింత ముందుకుసాగింది.

గురజాడ చేసిన పరిశోధన ప్రధానంగా 3 విభాగాలకు చెందినది. అవి 1. శాసన పరిశోధన, 2. చారిత్రక పరిశోధన, 3. భాషా పరిశోధన. సందర్భాన్ని బట్టి, అవసరాన్నిబట్టి ఒక్కోసారి దేనికదే విడివిడిగానూ, పలుసందర్భాల్లో సంయుక్తంగానూ ఈ పరిశోధనను కొనసాగించాడు. అందుకోసం తన అనారోగ్యాన్ని సైతం లెక్కచెయ్యక చారిత్రక ప్రాంతాలను విస్తృతంగా పర్యటించాడు. శాసనలిపిని మరింత బోధపరుచుకునేందుకు, దాని వృద్ధిని గమనించేందుకు తోటిభాషయైన కన్నడాన్ని కూడా నేర్చుకున్నాడు. ఇండియన్ యాంటిక్వరీ వాల్యూములు తిరగేశాడు. ఓరియంటల్ లైబ్రరీని గాలించాడు. చారిత్రక పరిశోధనారంగంలో విశేషకృషి చేసిన హెచ్. కృష్ణమూర్తి, వెంకయ్య, డా.ప్లీట్, భండార్కర్ మొదలైనవారితో సంబంధ బాంధవ్యాలేర్పడ్డాయి. మద్రాస్ గవర్నర్ అనుమతితో సెయింట్ జార్జికోటలోని పురాతన రాజ్యపత్రాలు తిరగేశాడు. ఊహలతో చరిత్రనల్లకుండా శాస్త్రీయ పద్ధతులను చేపట్టి దక్షిణ భారతదేశ చరిత్రను పునర్నిర్మించాలని సంకల్పించాడు.

లభ్యమైన ఆధారాలనుబట్టి ఆయా కాలాల్లోని రాజుల వంశచరిత్రలు, పరిపాలనా కాలాలు, అన్నిటికంటే ప్రధానంగా తెలుగు లిపి- పరిణామం, భాషాస్థితి,

---

పొరుగు భాషలైన కన్నడ, తమిళ భాషల ప్రభావం, ద్రావిడభాషలుగా వాటివాటి స్థానాలు మొదలైన విషయాలెన్నో శోధించాడు. శాసనాధారాలనుబట్టి నన్నయకంటే ముందే పొరుగు భాషా సాహిత్యాలవలెనే తెలుగుభాషకు కూడా తనదంటూ కావ్యభాష ఉన్నట్లుగా గుర్తించాడు.

శాసనపరిశోధనకు చాలా సున్నితమార్గాలు అవలంబించవలసి ఉంటుంది. శాసనాధారాలను బట్టి ఒక విషయానికి సంబంధించి కొత్త ఆధారాలు దొరికినపుడు పాతవి అప్రమాణికాలౌతుంటాయి. అలాంటి సదర్భంలో దొరికిన కొత్త ఆధారాలనుబట్టి నిశ్చయజ్ఞానాన్ని అన్వయించుకోవాలనేది గురజాడ దృక్పథం. 'మహాపండితులు సైతం తప్పులు చెయ్యకపోరు. చరిత్రతో అనుసంధించి చెప్పడానికి తగినన్ని ఆధారాలు దొరకనప్పుడు, శోధించాల్సిన అనేక విషయాలింకా మిగిలి వుంటున్నప్పుడు పరిశోధనారంగంలో పొరపాట్లు రాక తప్పవు. దొరికిన శాసనాధారాలను బట్టి నిశ్చయజ్ఞానం అన్వయించుకోవలసి ఉంటుంది. భారతదేశంలో పరిశోధనారంగాన ఇప్పటి పరిస్థితుల్లో యిట్టివి తప్పవు. మనం ఇంకా అనేక ప్రధాన విషయాలు పరిశోధించవలసి వుంది. బహుభాషారాష్ట్రంలో శాసనపరిశోధకుడు అనేక చిక్కులను ఎదుర్కోవలసి వస్తుంది' అన్న గురజాడ మాటలు పరిశోధనా అనుభవాన్ని వివరిస్తాయి. గురజాడ పరిశోధనలలో ఒక్కో విభాగాన్నీ పరిశీలిస్తే ....

శాసన పరిశోధన:

బెజవాడ యుద్ధమల్లుని శాసన పరిష్కరణ గురజాడ శాసనపరిశోధనల్లో ప్రామాణికమైనది. గురజాడకు శాసన పరిశోధనల్లో గిడుగు వెంకట రామమూర్తి, వేటూరి ప్రభాకరశాస్త్రి, కొమర్రాజు లక్ష్మణరావుపంతులు, జయంతి రామయ్యా పంతులు, హెచ్. కృష్ణ శాస్త్రి గార్ల సహకారం కూడా ఉండేది.

ప్రథమాంధ్ర కవి ఎవరు? అన్న చర్చ విస్తృతంగా జరుగుచున్న ఆ రోజుల్లో, కొత్తగా దొరికిన శాసనాలను గిడుగుతో కలిసి పరిశీలించిన పిదప నన్నయ కంటే పూర్వమే తెలుగు సాహిత్యానికి సుస్థిరమైన స్థానం ఉందని గుర్తించాడు. బెజవాడ యుద్ధమల్లుని శాసనాన్ని పరిశోధించి అందలి లిపినిబట్టి, అది రాజరాజ నరేంద్రుని కన్నా ప్రాచీనమైనదని నిర్ధారించాడు. ఈ నిర్ధారణతో కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి, టేకుమళ్ళ రాజగోపాలరావు పంతులుగారు, కోటేశ్వరశర్మ మొదలైన పండితులు ఏకీభవించలేదు. ఎందుకంటే 'మల్లపుడు' అనేరాజు 1202లో పిఠాపురం రాజుగా పట్టాభిషిక్తుడైనట్లు 'మల్లదేవుని శాసనం' పేర్కొంటుంది. అయితే గురజాడ నిర్ధారణ

{సిన యుద్ధమల్లుని తాతపేరు కూడా మల్లపుడే. ఈ ఆధారాన్ని చూపిస్తూ గురజాడ ర్ధారణను ఆమోదించలేదు.

కానీ, బెజవాడ శాసనపు యుద్ధమల్లుని పాలనాకాలం క్రీ.శ. 927-934 నీ, పిఠాపురానికి చెందిన మల్లపుదేవుని శాసనం 1202 నాటిదనీ ఆధారాలతో హా నిరూపించాడు. శాసనాధారాలను బట్టి 1202వ సంవత్సరంలో శాసనం {యించిన మల్లప్ప విష్ణువర్ధన మహారాజనీ, బెజవాడ యుద్ధమల్లుడు ాళుక్యవంశజుడనీ, సల్కి, చాళుక్య, చాళ్కి, చలకియా, సాళోంగే అనేవి ామాంతరాలని వివరిస్తాడు. అందుకు నిరూపణగా సమకాలీన శాసనాలైన ెజవాడశాసనం, గుంటూరు శాసనం, శివానందయోగీశ్వరుని మరాఠీ వంశావళి, విరాజమార్గం, డైనాస్టీస్ ఆఫ్ కేనరీస్ డిస్ట్రిక్ట్స్ ఇన్ బాంబే గజిట్ వాల్యూమ్ ార్ట్.1 లనుండి ఆధారాలను చూపిస్తాడు.

ఈ చాళుక్య యుద్ధమల్లుని సంతతివారు కృష్ణాజిల్లాలోని సామంత ప్రభువులుగా ఉన్నారన్న సంగతిని కూడా, బందరుజిల్లా గణపవరం గ్రామంలో ంభించిన శిలాఫలకంపై ఉన్న విశేషాలద్వారా వెల్లడి చేశాడు. వేంగీ గొంకరాజు అనేవాడు యుద్ధమల్లుని వంశం వాడేననీ, ఇతని కుమారుడైన మల్లపరాజు ునుమడైన మహాదేవరాజు రెండు శాసనాలు కూడా వేయించాడని నిరూపించ ానికి శాసనస్థ ప్రమాణాలద్వారా వంశావళి చరిత్రను నిర్మించాడు.

ఈ క్రమంలోనే గురజాడ యుద్ధమల్లుని బెజవాడశాసనంతో పాటుగా ెండవ అమ్మరాజు వేయించిన మల్లియపూడి శాసనం, నెల్లూరి శాసనం, ాజరాజనరేంద్రుని కోరుమిల్లి శాసనం, విష్ణువర్ధన తాళరాజు గుంటూరు శాసనం, అయిహోళి శాసనం, తూర్పు చాళుక్యుల శాసనాలు మల్లపదేవుని శాసనం, ుబ్బవిష్ణువర్థనుని సతారా శాసనం, వేంగీరాజైన మహాదేవరాజు శాసనం, రెండవ పులకేశి హైదరాబాదు శాసనం, పశ్చిమ చాళుక్య రాజైన 6వ విక్రమార్కుని శాసనాలను పరిశోధించాడు.

యుద్ధమల్లుని బెజవాడ శాసనాన్ని గురజాడకు పూర్వం ఇలియటు దొర అనే పాశ్చాత్య పరిశోధకుడు కొందరు పండితుల సహాయంతో ఈ శాసన విశేషాలను వెలికితీయాలని ప్రయత్నించినప్పటికీ సఫలం కాలేకపోయారు. అందుకుకారణం 6-9 సంఖ్యల మధ్య వ్యత్యాసాన్ని లేఖకులు గుర్తించలేకపోవడమేనంటాడు గురజాడ. అంతేకాక ఈ శాసనంలోనికాలం శకసంవత్సరం ప్రకారం ఉండడంచేత పండితులు కూడా పొరబడ్డారని వివరించాడు.

అమ్మరాజు నాటి లిపులకు - రాజరాజు నాటి లిపులకు మధ్య ఉన్న ఒక ప్రత్యేకభేదాన్ని కూడా గుర్తించాడు. అమ్మరాజులనాటి లిపులలో అక్షరాల తలకట్టు సూక్ష్మంగా శాణాం (wedge) వలే ఉంటుందనీ, రాజరాజునాటికి కొమ్ములవలే తలకట్లు లేచి కోణం తీరి ఉన్నాయని గుర్తించాడు.

గురజాడ శాసనపరిశోధనను ప్రోత్సహించినవారిలో ఆనందగజపతిరాజు కూడా ముఖ్యులు. అప్పటి విజయనగరం మహారాజైన ఆనంద గజపతి చిన్నతనంలో తన పూర్వులకు సుబేదార్, మహామండలేశ్వర బిరుదులుండేవని విజయరామగజపతి ద్వారా వినివున్నాడు. దాంతో ఆ నిజానిజాలను తెలుసుకోవాలనే వాంఛ ఆనందగజపతిని తొలుస్తుండగా, దాన్ని పరిష్కరించడానికి ఆశ్రితుల సహాయం కోరాడు. ఆ బృందంలో గురజాడ ప్రధానుడు. అప్పటికే గురజాడ విజయనగరం మహారాజావారి కళాశాలలో చరిత్ర అధ్యాపకుడుగా పనిచేస్తున్నాడు. ఇలాంటి పరిస్థితుల్లో పని ఒత్తిడివల్ల గురజాడ ఆరోగ్యం దెబ్బతిన్నది. గురజాడ పరిశోధనలు భావితరాలకు ఎంతో అవసరమని గుర్తించిన ఆనందగజపతి, గురజాడను అధ్యాపక పదవినుండి తప్పించి, నాటినుండి(1896) సంస్థాన శాసన పరిశోధకుడిగా నియమించాడు. ఈ వెసులుబాటు గురజాడ పరిశోధనలకు మరింతగా ఉపకరించింది. తన పరిశోధనకు మెచ్చి అప్పట్లోనే మహారాజావారు రూ.2350/- పారితోషకంగా ఇచ్చారని గురజాడ తన డైరీలో రాసుకున్నాడు.

ఆనందగజపతిరాజు 1897లో చనిపోగా, సంతానహీనుడౌటచేత విల్లుప్రకారం అతని మేనమామ కొడుకుని దత్తతచేసుకొని స్వీకారమహోత్సవం జరిపించారు. అది చెల్లదని రాజబంధువులు దావావేశారు. గురజాడ సంస్థాన ఆంతరంగిక కార్యదర్శి కావడంచేత ఆ దావాలో వంశమూలపురుషుల వృత్తాంతాన్ని శాసనప్రమాణాలతో నిరూపించవలసి వచ్చింది. అందుకుగాను ఉషాభ్యుదయం, శ్రీకృష్ణవిజయం మొదలైన ప్రబంధాలను, విజయనగరరాజుల శాసనాలను పరిశోధించి దావాను విజయవంతంగా పరిష్కరించాడు.

*చారిత్రక పరిశోధన:*

గురజాడ చరిత్ర అధ్యాపకుడు, సంస్థాన శాసన పరిశోధకుడు కావడంచేత ఆయన ఇల్లే ఒక గ్రంథాలయంలా ఉండేది. తెలుగు, సంస్కృత గ్రంథాలు, శిలాశాసనాల రికార్డులు గల ఎపిగ్రాఫికా ఇండికా, ఇండియన్ యాంటిక్వేరీ వాల్యూములు, నెల్లూరుజిల్లా శాసనాలు, విజయనగర సంస్థానానికి చెందిన

శాసనాలు, విజయనగర రాజుల బంధువుల వంశవివరాలను తెలుపే పద్యకావ్యాలు, వచనగ్రంథాలు ఉండేవి. అందుకే రాజులు, పండితులు చరిత్రకు సంబంధించిన విశేషాలకోసం గురజాడతో తరుచుగా ఉత్తరప్రత్యుత్తరాలు జరిపినట్లు ఆయన లేఖల్లో గమనించవచ్చు.

గురజాడ కళింగచరిత్ర, ఆంధ్రకవుల చరిత్ర రాయడానికి ఎంతో ప్రయాసపడ్డాడు. కులాల చరిత్రలను కూడా శోధించాలని ఎన్నోసార్లు ప్రయత్నించాడు. కానీ ఈ విషయాలలో గురజాడ ప్రయాస ఫలించలేదు. అందుకు చాలా కారణాలున్నాయి. వాటిలో సంస్థాన వారసత్వపు తగాదా, తన అనారోగ్యం, వ్యావహారిక భాషా ప్రయోగం అనేవి ప్రధాన ఆటంకాలయ్యాయి.

కళింగదేశచరిత్రను రాయడానికి సంకల్పించి దానికి కావలసిన శాసనాలను, రికార్డులు సేకరించి పరిశోధించాడు. అన్ని వివరాలు రాసుకుని మంచి ప్రణాళిక కూడా సిద్ధం చేసుకున్నాడు. అయితే చరిత్రరచనలో ఉపయోగించే భాషవిషయమై గురజాడకు, కొమర్రాజు లక్ష్మణరావు పంతులుగారికీ ఏకీభావం కుదరలేదు. గురజాడ వ్యావహారికభాషలోనే రాయడానికి పట్టుబట్టగా, ప్రచురణకర్తలైన కొమర్రాజుగారు అందుకు అంగీకరించలేదు. కానీ గురజాడ తన ప్రయత్నాన్ని

ఆపలేదు. ఆ మధ్యలోనే సంస్థానపు వారసత్వదావాలో 1897-1912 వరకు తలమునకలైపోవడంతో చరిత్రరచనకు అంతరాయం ఏర్పడింది. దీనికితోడు అనారోగ్యం మరింత కృంగదీసింది. గురజాడ అవసానదశలో ఉన్నపుడు తాను పరిశోధించిన శాసనాలను, శ్రమపడి సేకరించిన రికార్డులను, రాసిన భోగట్టాను ఆధారం చేసుకుని తగిన పండితులచేత తాను తలపెట్టిన కళింగచరిత్రను పూర్తి చేయించాల్సిందిగా ఫౌలరు దొరను కోరాడు. (ఈయన అప్పటి విజయనగరం జిల్లా కలెక్టరు మరియు సంస్థాన వ్యవహారాలను అజమాయిషీ చేసే ధర్మకర్తృత్వ సంఘపు పెద్ద). గురజాడ మరణానంతరం మిత్రుడైన గిడుగు దీన్ని సమకూర్చాలని ప్రయత్నించాడు కానీ పూర్తి చేయలేదు. ఈ కారణంగానే గురజాడ విశేషంగా పరిశోధించిన పూసపాటి గజపతుల చరిత్రగానీ, విశాఖజిల్లా చాణుక్యుల చరిత్రగానీ వెలుగులోకి రాలేకపోయాయి.

ఆంధ్రకవులు రాసిన ప్రబంధాలలోని ప్రథమాశ్వాసాలలో కృతిపతియొక్క, కృతిభర్త యొక్క వంశావళులను వెల్లడిచేసే పద్యాలను తీసి, అందుండే చారిత్రక విషయాలను విడదీసి, శిలాశాసనాలలోని రాజుల, మంత్రులు జీవిత కాలాల

ఆధారాల వల్ల ఆంధ్రకవుల, వారిపోషకుల కాలనిర్ణయం చేసి కవుల చరిత్రను రాయడానికి ఉపక్రమించాడు. అయితే గురజాడ ఆ కవుల చరిత్రను పూర్తి చేయడానికిముందే కందుకూరివారి కవులచరిత్ర వెలువడింది. కానీ ఈ రెండుకవుల చరిత్రలలోని కాలనిర్ణయాలలో కొంత భేదభావాలున్నాయి. అయినప్పటికీ ఆంధ్ర కవుల చరిత్రను పూర్తిచేసి ప్రచురించాలని ప్రయత్నం చేశారు. అది కూడా పూర్తి కాలేదు. ఆ ప్రణాళిక అలాగే మిగిలిపోయింది.

గురజాడ చరిత్రపరిశోధనా కృషిని గుర్తించిన జయపూరురాజు, జయపూరుకు సంబంధించిన చారిత్రక వివరాలను తెలియపరచమంటూ గురజాడ సహాయాన్ని కోరాడు. జయపూరుచరిత్రను పూర్తిగా పరిశీలించిన మీదట, అప్పటివరకు వ్యాప్తిలో ఉన్న అనేక అసంగత విషయాలతో విభేదించాడు. ఆ పరిశోధనలో గురజాడ వెలికితీసిన విషయాలు. . .

:- జయపూరు వంశమూలపురుషుడు కాశ్మీరునుండి రాలేదు. ఆ కాలంలో కాశ్మీరుపాలకులు వేరు. శంకర వంశీకులు ఎన్నడు కాశ్మీరును పరిపాలించలేదు.
:- కటకము రాజులకు జయపూరు వారు సామంతులని ప్రభుత్వం అచ్చువేసిన జయపూరు పత్రాల్లో ఉన్నది. అది నిజమగుటకు అవకాశాలున్నాయి.
:- శంకరుడు ఆదిపురుషుడు కాగలిగిన వంశాలు రెండేరెండు.
1. కదంబులు, 2. పల్లవులు.
:- శంకరుని కనుబొమలనుండి కదంబులు జన్మించారని కథ. వారి గోత్రమ మానవుస.
:- జయపురవంశం పల్లవవంశానికి చెందినదని చెప్పవచ్చు. అందుకు అనేక ఆధారాలున్నాయి. పల్లవులది భరద్వాసజ గోత్రం. వివాహసంబంధం వల్ల పల్లవులకు - చాళుక్యులకు బాంధవ్యం కలిగింది.

*భాషాపరిశోధన:*

గురజాడ పరిశోధనలన్నింటిలో కెల్లా తలమానికమైనది భాషాపరిశోధన. తన జీవితకాలంలో అత్యంత విలువైన అత్యధికమైన సమయాన్ని గడిపింది భాషా పరిశోధనలోనే. అందుకు కారణం వాడుకభాషకు సాహిత్యగౌరవం కల్పించాలన్నదే గురజాడ ధ్యేయం. అప్పటి పాశ్చాత్య ఆంగ్ల విద్యాప్రభావంతో తన చుట్టూ ఉన్న ప్రపంచంలో గురజాడను ప్రధానంగా ఆకర్షించినవి రెండే రెండు. 1. భాష, 2. నాటకం.

ప్రపంచంలోని పలుదేశాల్లో భాషకు సంబంధించిన పరిణామాలను తనకు లభ్య మైన ఆధారాలను బట్టి సూక్ష్మంగా పరిశీలించాడు. పొరుగుభాషలైన తమిళం,

కన్నడం, బెంగాలీ భాషల్లోనూ, యూరోపియన్ భాషల్లోనూ సంభవించే మార్పులు, చర్చలు ఎలా జరుగుతున్నాయో ఎప్పటికప్పుడు ఉత్సుకతతో తెలుసుకునేవాడు. ఆ సమాచారం కోసం వివిధ ప్రాంతాలకు చెందిన భాషాశాస్త్రవేత్తలతో పరిచయాలేర్పరచుకుని వారినుండి ఉత్తరప్రత్యుత్తరాల ద్వారా సమాచారాన్ని సేకరించి అవగాహన చేసుకునేవాడు. అంతర్జాతీయ పత్రికల్లో వెలువడే భాషావిశేషాలను అధ్యయనం చేసేవాడు. దీనివెనుక ఉన్న బలమైన కారణం ఒక్కటే. తెలుగును నిత్యనూతనంగా, సజీవభాషగా నిలపాలన్నదే గురజాడ ఆకాంక్ష. సాహిత్యం, విద్య కొందరి గుత్తసొమ్ముగానే ఉండడాన్ని అంగీకరించలేదు. అవి సమాజంలోని అన్నివర్గాలలకు వ్యాపించాలని, అందుకు మార్గం వ్యావహారభాషే అన్నది గురజాడ వాదన. ఆ ప్రయత్నంలో గురజాడకు తీవ్రమైన ప్రతిఘటన ఎదురైంది. దాన్ని ఎదుర్కొనేందుకు విస్తృతమైన భాషాపరిశోధన చేశాడు. ఆ పరిశోధనకు ప్రతిరూపమే 'అసమ్మతిపత్రం'. అందులో గురజాడ చేసిన భాషాపరిశోధన చారిత్రాకమైనది, వర్ణనాత్మకమైనది, తులనాత్మకమైనది, అనువర్తితమైనది. గురజాడ అసమ్మతిపత్రంలో భాషకు సంబంధించిన ప్రతీ సూక్ష్మాంశమూ పరిశీలించబడింది. దాన్ని చదివేకొలదీ ఇన్ని అంశాలను ఇంత సూక్ష్మాతిసూక్ష్మంగా, అంతకన్నా విస్తృతంగా ఎలా చర్చించగలిగాడా! అన్న ఆశ్చర్యం కలుగకమానదు. ఒక ప్రత్యేకమైన పరిశోధన చేయగలిగినంత ప్రాధాన్యతను కలిగినటువంటిది ఈ అసమ్మతిపత్రం.

ఇంటర్మీడియట్ పరీక్షలో విద్యార్థులు రాసే సమాధాన పత్రాలలో అనుమతించదగిన తెలుగుభాషాశైలి ప్రమాణాన్ని నిర్ణయించడానికి మద్రాసు విశ్వవిద్యాలయం 1911వ సంవత్సరంలో ఒక సంఘాన్ని నియమించింది. అందులో గురజాడ కూడా ఒక సభ్యుడు. మూడు - నాలుగేళ్ళు తీవ్ర వాదోపవాదాలు, తర్కవితర్కాలతో సుదీర్ఘ మైనచర్చలు జరిగాయి. అనంతరం 1914లో ఆ సంఘంచేసిన నిర్ణయాలు విద్యాభివృద్ధికి మేలుచేయకపోవడమే కాకుండా తప్పక కీడు చేస్తుందని నిరూపిస్తూ విశ్వవిద్యాలయానికి గురజాడ సమర్పించిన విశ్లేషణాత్మక, పరిశోధనాత్మక నివేదికయే 'అసమ్మతిపత్రం'. (THE MINUTE OF DISSENT TO THE REPORT OF THE TELUGU COMPOSITION SUB-COMMITTEE).

సాహిత్యరచనలో/ వ్యాసరచనలో వ్యావహారికభాషా ప్రయోగాన్ని నిరసిస్తూ లక్ష్మణరావుగారు 'గ్రామ్యరూపాలన్నీ దేశంలోని ప్రతీప్రాంతంలోనూ వాడుకలో ఉన్నాయన్న' గురజాడ వాదనను ఆక్షేపిస్తారు. (అపుడు

గ్రాంధికభాషావాదులు వ్యావహారికభాషకు పెట్టినపేరు 'గ్రామ్యం'). అందుకు గురజాడ 'అవిస్తే' అన్న సంయుక్త హల్లు ఉండే క్రియారూపాలను వందలకొద్ది ఉదాహరణలిస్తాడు (వస్తూ, చేస్తే, చూస్తూ, ప్రార్థిస్తూ, తెలుస్తూ, రాస్తూ మొ.వి). అతిప్రాచీనకాలంనాటినుండి శాసనాది సాహిత్య, గ్రంథాలు మొదలుకొని తనకాలంనాటివరకు గలరచనల్లో ఆప్రయోగం ఎంత విస్తృతంగా వాడబడిందో వందలకొద్ది ఆధారాలను చూపిస్తాడు.

నేడు మనం దేన్నైతే ప్రామాణికభాష అంటున్నామో, ఆ కృష్ణా గోదావరుల ప్రాంతానికి చెందిన శిష్టవ్యవహార మాండలికానికిగల ప్రామాణికతను, సహేతుకతను పలు ఉపపత్తులద్వారా చూపించాడు. ఆ మాండలిక ప్రాంతానికి గల చారిత్రక, రాజకీయ, సాహిత్య ప్రాధాన్యతలను వివరిస్తూ ఆ మాండలికం ప్రామాణికం కావడంలో వాటి పాత్రను వివరించి, అది ఎంతవరకు అర్థ మైనదో కూ విశ్లేషించాడు. తనవాదానికి ఉపపత్తులుగా, తనకంటే ముందుగానే తెలుగుభాష పరిశోధన చేసిన డా.గ్రియర్సన్, డా. స్టెన్‌కొనొవ్, రావుబహద్దుర్ వి. వెంకయ్యగార వ్యాకరణ, భాషాశాస్త్ర గ్రంథాలనుండి, భారతదేశ భాషావిషయక దర్యాప్తు, బ్రౌ తెలుగు- ఇంగ్లీషు నిఘంటువు సవరించిన కూర్పుకు పీఠిక, అహోబలపండితీయం గౌయిన్-భాషాబోధనాధ్యయన కళ మొదలైన వాటినుండి ఆధారాలను చూపిస్తాడు

తెలుగులో సంస్కృతపదాలు విస్తృతంగా ప్రవేశించడానికి కారకుల ప్రాకృతపండితులనీ, వ్యావహారిక భాషారూపాలు తెలుగుసాహిత్యంలో విరళంగా ప్రయోగింపబడకపోవడానికి కారకులు దేశీయపండితులనీ తెలుగుభాషను చారిత్రకంగా పరిశోధించి వెల్లడించాడు. ఎందుకంటే తెలుగుకవులు ప్రాకృతభవాలను, ప్రాకృతసమాలను విశేషంగా వాడుకోవడంతో కావ్యభాష ఒక క్లిష్టమైన భాషాప్రక్రియగా మారిపోవడాన్ని చారిత్రాత్మక పరిణామంగా పేర్కొంటాడు గురజాడ.

సాహిత్యంలో వ్యావహారికభాషను ఉపయోగించడం ద్వారా భాషకున్న పవిత్రత, పటుత్వం పోయి, సాహిత్యం సామాన్యస్థితికి దిగజారుతుందనేది గ్రాంధికభాషావాదుల వాదన. ఈ భ్రమను పోగొట్టడానికి ప్రపంచంలోని పలుభాషల వికాసాన్ని చారిత్రకమైన ఆధారాలతో వివరించాడు. ఇలాటి గ్రాంధికవాదులపట్టు ప్రతీదేశంలోనూ ఉన్నదేననీ, ఈజిప్టు, యూరోపియన్ భాషలలో కూడా ఆరంభంలో ఇలాంటి ప్రతిఘటనలే ఎదురయ్యాయని ఉదాహరణలు చూపించాడు. అయితే కాలక్రమంలో ఆయాదేశాల్లో వ్యావహారికభాష సాధించిన ఫలితాలను, వికాసాన్ని చూచినపిదప వారు తమ అభిప్రాయాలను మార్చుకున్నారని కూడా అసమ్మతిపత్రంలో వివరించాడు.

అసమ్మతి పత్రానికి ముందే మనభాషలో సంస్కరించుకోవలసిన సందర్భాలను తరుచుగా ఎత్రులకు లేఖల ద్వారానూ, వ్యాసాల్లోనూ సూచిస్తూ ఉండేవారు. వ్యాకరణబద్ధంగా రాయాలనే పండితులే ఎన్నిరకాలుగా వ్యాకరణ నియమాలను ఉల్లంఘించారో వారి రచనలనుండే ఉదాహరణలిస్తాడు. వాడుకభాషకు 'గ్రామ్యం', 'మ్లేచ్ఛం' అనే పేర్లుపెట్టి హేళనచేసే గ్రాంధికవాదులు, అసలు ఆ పదాలనే ఎంత తప్పుగా అర్థంచేసుకున్నారో చూపించడానికి పంతజలి మహాభాష్యం మొదలుకొని పలు వ్యాకరణగ్రంథాలనుండి ఉపపత్తులు చూపిస్తూ అసలు అర్థాన్ని గ్రహించమంటాడు.

గురజాడ పరిశోధనాకృషికి మచ్చుతునకలి . ఆయన పరిశోధనా కృషి అపారం. ద్య, భాష, చరిత్ర, సాహిత్యం, శాసనాలు, నాటకరంగం మొదలైన షయాలకు సంబంధించి గురజాడ చేసిన పరిశోధన అపరి ఎతమైన . కానీ మనకు అందిన ఫలాలుమాత్రం పరి ఎతమే. అయినప్పటికీ అ ప్రామాణికంగా చరిత్రలో నిలిచిపోయాయన్నది గమనార్హం.

### ఉపయుక్త గ్రంథాలు


1. అసమ్మతి పత్రం - గురజాడ అప్పారావు
2. జాబులు-జవాబులు, దినచర్యలు - గురజాడ అప్పారావు. (సం. సెట్టి ఈశ్వరరావు)
3. లేఖలు - గురజాడ అప్పారావు (సం. అవసరాల సూర్యారావు)
4. వ్యాసచంద్రిక - గురజాడ అప్పారావు (సం. అవసరాల సూర్యారావు)
5. వ్యాసాల సంకలనం - గురజాడ అప్పారావు (సం. సెట్టి ఈశ్వరరావు)
6. భాషాసాహిత్య మర్శకుడుగా గురజాడ- తాటితోటి కిరణ్ బాబు (అముద్రితం)


(2003లో ఎం.ఫిల్ పట్టాకోసం హైదరాబాదు శ్వ దయాలయానికి సమర్పించిన సిద్ధాంత వ్యాసం)

# ''కళాప్రపూర్ణ'' శ్రీవజ్ఝులవారి భాషాసాహిత్య పరివస్య

– బేతవోలు రామబ్రహ్మం

తెలుగు వ్యాకరణానికి ఒక శాస్త్రప్రతిపత్తిని కల్పించి పాణినీయుల ఆమోదాన్ని సంపాదించిపెట్టిన తొలితరం పండితుడు శ్రీ వజ్ఝులవారు. ఈ నాటివరకూ కొనసాగుతున్న తెలుగు వ్యాకరణ పరిశోధనకు వీరిదే గురుపీఠం. దూసివారితో ప్రారంభించి అంబటిపూడి నాగభూషణం వరకూ వచ్చిన బాల – ప్రౌఢవ్యాఖ్యాతలూ, అరుణాచల శాస్త్రిగారితో ఆరంభించి అమరేశం రాజేశ్వరశర్మ వరకూ వెలసిన అహోబల పండితీయ వ్యాఖ్యాతలూ – అందరూ ప్రత్యక్షంగానో పరోక్షంగానో వజ్ఝులవారి వ్యాకరణ పాఠశాలకు సంబంధించినవారే. అనంతర పరిశోధకులు అవుననడానికి గానీ కాదనడానికి గానీ ఈయనే దిక్కయి కూర్చున్నాడు.

పార్వతీ పురానికి చేరువలో ఉన్న సీతారామపురం వీరి మాతామహుల ఊరు. 18-06-1878వ తేదీ వీరి పుట్టిన రోజు. (29-07-1878, 25-06-1878, 29-08-1878 ఇత్యాదిగా దీనికీ పాఠాంతరాలు ఉన్నా అవి నిలిచేవి కావు) సీతారామ పురదేవత పేరుమీద వీరు సీతారామస్వామి శాస్త్రి అయ్యారు. వీరి పినతండ్రి కుమారుడిదీ ఇదే పేరు. ఆయన పెద్ద. అందుచేత ఈయన చినసీతారామస్వామి శాస్త్రి అయ్యారు. బొబ్బిలి బరంపురం విజయనగరం చెన్నపట్టణం, విశాఖపట్టణం – ఇలా చాలా విద్యాసంస్థల్లో పండిత పదవులు నిర్వహించి అనేక గ్రంథాలు రచించి వాదవివాదాలు సాగించి అలిసిపోయి చివరికి 29-05-1964 వ తేదీన తనువు చాలించారు.

1910లో చిత్రకవితారూప వినాయకస్తుతితో ప్రారంభమైన వీరి రచనా వ్యాసంగం 1962 వరకూ కొనసాగింది. తొలినాటి బాల్య రచనలన్నీ స్తుతులూ స్తోత్రాలూ దండకాలూనూ. ఇవి చాలావరకు అముద్రితాలు. 1915లో వెలువడిన ''వసుచరిత్ర విమర్శనము'' వీరికి పండితుడిగా గుర్తింపు నిచ్చింది. అటుపైన కర్ణ చరిత్ర (1917) హరిశ్చంద్ర నలోపాఖ్యాన విమర్శనము (1918), సటీకాధర్వణ కారికావళీ విమర్శనము (1918), వివాహయోగ్య సంబంధ విమర్శనము – స్త్రీవివాహ వయోనియమనము (1922-25) వీరసింహుడు (1923-24) మార్గోపదేశిక (రెండు తరగతులు 1923-25) చింతామణి విషయ పరిశోధనము (1931) బాలసరస్వతీయ పీఠిక (1932) వైయాకరణ పారిజాతము (1936) ఆంధ్రవ్యాకరణ సంహితా సర్వస్వము (రెండు భాగాలు – 1950) ద్రావిడ భాషా పరిశీలనము (రెండు భాగాలు – 1955) బాలవ్యాకరణోద్ద్యోతము (1959) ద్రావిడ భాషా సామ్యములు

---

తెలుగులో తొలితరం పరిశోధకులు-జాతీయసదస్సు,
తెలుగుశాఖ, హైదరాబాదు విశ్వవిద్యాలయం-నవంబరు 7-9,2005

(1959) ఇంకా అనేక వ్యాసాలు - ఇవి వీరి రచనల్లో ముద్రణ పొంది ఇప్పటికీ దొరుకుతూ పేరెన్నికగన్న గ్రంథాలు. ''నన్నయాథర్వణీయము-సుబోధ వ్యాఖ్యాన సహితము'' అన్న పేరుతో అహోబల పండితీయానికి వీరొక వ్యాఖ్యానం 1962 ప్రాంతాల్లో సంతరించారనీ అనారోగ్య కారణంగా పూర్తి చేయలేకపోయారనీ వీరి అంతేవాసులు గట్టిగా చెబుతున్నారు. దీనికి దాఖలాగా చిత్తుప్రతియైనా దొరక్కపోవడం మరీ విచారించ దగిన అంశం. అవసాన దశలో వీరు చాలాకాలం - దాదాపు ఏడాదిపైగా - కోమాలో ఉండిపోయారుట. ఆ కాలంలో ఆ చిత్తుప్రతి ఎటుపోయిందో! ఏమయిందో! కాగా - ఈ ముద్రితాలలో భాషా సంబంధి ఎనిమిది రచనలు, సాహిత్య సంబంధి రెండు రచనలు (వసు - హరిశ్చంద్రనలవిమర్శలు) ఈనాటికీ ప్రామాణికాలుగా గౌరవింప బడుతున్నాయి. 1918 నుంచి వీరు ప్రధానంగా తెలుగు వ్యాకరణాలకే అంకితం అయిపోయారు. మధ్యలో చెన్నపట్టణ నివాసం (మద్రాసు విశ్వవిద్యాలయంలో తెలుగు పండిత పరిశోధక పదవి) ద్రావిడ భాషల్ని స్పృశింప జేసింది. అది మినహాయిస్తే వీరి ప్రధాన తంత్రం - వ్యాకరణం.

ఇంతటి వ్యాకరణ చుంచువుకి జరగవలసిన గౌరవాలన్నీ జరిగాయి అనలేము. కానీ 1947 లో ఆంధ్ర విశ్వకళా పరిషత్తు కళాప్రపూర్ణ బిరుదుతో సత్కరించడం తల మానికమే.

మొత్తం వీరి రచనల్లో కర్ణుడు - వీరసింహుడు అనేవి గద్యప్రబంధాలు. నవల లాంటివి. వివాహ వయోనియమనము ధర్మశాస్త్ర సంబంధి. ద్రావిడ భాషా సామ్యములు - ద్రావిడ భాషా పరిశీలనము అనేవి ఇతర భాషా సంబంధులు. కాగా తక్కినవన్నీ తెలుగు వ్యాకరణ - తెలుగు సాహిత్య సంబంధులు. వీటిలో మార్గోపదేశిక - బాలవ్యాకరణోద్ద్యోతాలు స్వతంత్రాలు. వసుచరిత్ర విమర్శనము - హరిశ్చంద్ర నలోపాఖ్యాన విమర్శనము అనేవి విమర్శనాత్మకాలు. తక్కినవన్నీ వ్యాఖ్యానాలు.

స్వతంత్రాల్లో మొదటివి మార్గోపదేశికలు. ఇవి ప్రాథమిక ఉన్నత పాఠశాలల్లో బోధన కోసం రూపొందించిన రచనలు. Approved by the Text Book Commity of Madras ... అంటూ ముఖపత్రంపై ముద్రింపబడిన పుస్తకాలు. ఇవి చాలా ముద్రణలు పొందాయి. మొదటి మార్గోపదేశికలో భాషా ప్రకరణం, అక్షర ప్రకరణం, పదప్రకరణం, వాక్య ప్రకరణం అని నాలుగు ప్రధాన భాగాలు. చివర్లో వ్యాస లేఖన పద్ధతి. ప్రతి ప్రకరణం చివరలోనూ ప్రశ్నలు అభ్యాసాలు ఉన్నాయి. జనులు తమ అభిప్రాయములను ఒకరికొకరు తెలిపికొనుటకు వాడుక చేసికొను ధ్వనిరూపములగు శబ్దములే భాష అనిపించుకొనును. విభక్త్యంతమగు శబ్దము పదమనించుకొనును. కర్త కర్మ క్రియ అను మూడును గాని, కర్త క్రియ అను రెండు గాని యున్న పదముల మొత్తమునకు వాక్యమని పేరు - ఇలాంటి నిర్వచనాలు ఇందులో కనిపిస్తాయి.

రెండవ మార్గోపదేశిక ఉన్నత పాఠశాల విద్యార్థుల కోసం రూపొందించింది. ఇందులో వ్యాసలేఖన ప్రకరణం ఛందః ప్రకరణం అలంకార ప్రకరణాలు అదనంగా ఉన్నాయి. ఒక పెద్ద పండితుడు చిన్నారి విద్యార్థుల కోసం తపన పడటం వీటి అంతరంగంలో మనల్ని ఆకట్టుకొంటుంది.

బాలవ్యాకరణోద్ద్యోతాన్ని పేరును బట్టి చాలామంది వ్యాఖ్యాన గ్రంథమే అనుకున్నారు. కానీ ఇది స్వతంత్ర వ్యాకరణ గ్రంథం. బాల ప్రౌఢ వ్యాకరణాలకు పై సంగతిగా అవతరించిన రచన. బాల ప్రౌఢ వ్యాకరణములందలి యపసిద్ధాంతములను లక్షణ విరోధములను తొలగించి యందు పేర్కొనబడని లక్షణ విశేషములను చేర్చి మిగిలిన బాలవ్యాకరణ విషయములను నిల్పి రచించుట విద్యార్థులకత్యంతోపకారకమగునని తలంచి ఈ బాలవ్యాకరణోద్ద్యోతమును రచించితిని - అని వజ్ఝులవారే స్పష్టపరిచారు. ఇందులోని ఒకటి రెండు సూత్రాలను తులనాత్మకంగా చూస్తే దీని ఉద్దేశం మరింత స్పష్టపడుతుంది.

1. సంస్కృతంబునకు వర్ణంబులేబది (బా. వ్యా.)
   కావ్య సంస్కృత భాషకు వర్ణములేబది (ఉద్ద్యోత.)
2. ప్రాకృతమునకు వర్ణములు నలువది (బా. వ్యా.)
   మహారాష్ట్ర ప్రాకృతమునకు వర్ణములు నలువది (ఉద్ద్యోత.)
3. తెలుగునకు వర్ణములు ముప్పదియారు (బా. వ్యా.)
   అచ్చ తెలుగునకు వర్ణములు ముప్పదియేడు (ఉద్ద్యోత.)
4. ఉత్తునకచ్చు పరంబగునపుడు సంధియగు (బా. వ్యా.)
   ఉత్తునకచ్చు పరంబగునపుడు పరరూప సంధి నిత్యము (ఉద్ద్యోత.)
5. అమహన్నపుంసకంబుల కదంతంబులకు ముపర్ణకంబగు (బా. వ్యా.)
   అమహన్నపుంసకంబుల ప్రథమైక వచనమునకు ముపర్ణకమాదేశమగు (ఉద్ద్యోత.)

బాలవ్యాకరణానికి నొక్కులు తీర్చడం వీరి లక్ష్యంగా తెలుస్తూనే ఉంది. దీని సాధనకు వీరు చింతామణికి మరింత చేరువైన తావులూ ఉన్నాయి. దీర్ఘాణాం హ్రస్వః స్యాత్, న చ దేశ్యపదే న చైక వర్ణేఽపి అని చింతామణి చెబితే, చిన్నయసూరి నామంబుల తుది దీర్ఘంబునకు హ్రస్వంబగు - ఏకాక్షరంబులకు హ్రస్వంబు లేదు - అన్నాడే తప్ప దేశ్య పదాల గురించి పట్టించుకోలేదు (నవలాలు - వేటగాడు - అటమటీడు). అంచేత వీరు దేశ్యాలను పరిహరిస్తూ సంస్కృత ప్రాకృత ప్రాతిపదికంబుల తుది దీర్ఘమునకు హ్రస్వంబగు అని సూత్రించారు. ఏకాక్షరాలకు హ్రస్వం లేదనడాన్ని గ్రహించారు.

చింతామణి క్వచిద్గకారో వః అంది. గకారం వకారంగా మారిందనడానికీ, వకారం గకారంగా మారిందనడానికీ - వీలున్న సూత్ర రచన ఇది. దీన్ని సూరి

అపదాద్యంబై అసంయుక్తంబైన గకారంబునకు వకారంబు విభాషనగు అంటూ పరిమితం చేశాడు. ఇందువల్ల బందువులు - బందుగులు, పవడము - పగడము లాంటి వాటిలో ఇబ్బంది కలుగుతోంది. అంచేత వజ్ఝులవారు ''అచ్చిక గ-వ లు కొన్ని యెడల పరస్పరము విభాషగా నాదేశములగు'' అన్నారు. ప్రౌఢ వ్యాకరణ శైలిలో కొన్నియెడల అన్నారే తప్ప (క్వచిత్ ని గౌరవించడం!), ఎట్టి యెడల అన్నదాన్ని సూరిలాగా స్పష్టపరచలేకపోయారు.

సమాన కర్తృకయోః పూర్వకాలే అన్న పాణినీయాన్ని సూరి సమానాశ్రయంబులన్ అని మార్చి ఏదో ఒక ప్రయోజనాభాసాన్ని సూచించాడు. వీరు మాత్రం పాణినికే నమస్కరించి సమానకర్తృకంబులం బూర్వకాలంబునం దివర్థకంబగు అన్నారు.

ఇలా చాలా విషయాలలో ఈ బాలవ్యాకరణోద్ద్యోతం బాలప్రౌఢలకు మెరుగులు దిద్దింది. కొన్ని చోట్ల అవి మెరుగులు కాకపోయినా సంస్కృత మూలాలకు చేరువయ్యింది. అయినా సూత్రరచన ఆకర్షకంగా లేకపోవడం చాలాచోట్ల సూత్రత్వమే కొరవడటం కారణాలుగా ఇది నిలదొక్కుకోలేకపోయింది.

ఇక వీరి వ్యాఖ్యాన గ్రంథాలలో వైయాకరణ పారిజాతము మొదటిది. దీనికే సీతారామ పండితీయము అని నామాంతరం. తాము వ్రాయ తలపెట్టిన నన్నయాథర్వణీయ సుబోధ వ్యాఖ్యకు ఇది పూర్వభాగమని వజ్ఝులవారే పీఠికలో చెప్పారు. అయితే అది పూర్తికాలేదు. ఈ పూర్వభాగంతోనే ఆగిపోయింది. ఇందులోని ఆరు ప్రకరణల లోనూ తద్భవ ప్రకరణం నేటికీ మార్గోపదేశకమే.

నన్నయాథర్వణీయాలకే ఏమి మొత్తం తెలుగు వ్యాకరణాలన్నిటికీ కలిపి వ్యాఖ్యానం రాద్దామని ఆలోచన వచ్చినట్టుంది. దీన్ని ఆపేసి ఆంధ్రవ్యాకరణ సంహితా సర్వస్వ రచన ఆరంభించి పూర్తి చేశారు. ఇది పాణినీయానికి మహాభాష్యం లాంటి ఉద్గ్రంథం. రెండు భాగాలుగా ఆంధ్రవిశ్వవిద్యాలయమే ప్రచురించి పుణ్యం కట్టుకుంది. ఇదొక మహారణ్యం వంటి వ్యాఖ్యాన గ్రంథం. సంస్కృత వ్యాకరణంలో ఉన్న పాణినీయ - పాణినీయేతర సంప్రదాయాలూ ప్రాకృత వ్యాకరణాలూ కవి ప్రయోగాలూ వీరికి కరతలామలకాలని దీని ప్రతిపుటా చెబుతుంది. కల్పతరు వ్యాఖ్య పేరుతో నన్నయాథర్వణీయాల వివరణ, సంజీవిని పేరుతో బాలవ్యాకరణ వివరణ అనుబంధాలూ పాదసూచికలలో ఇతర గ్రంథాల పరామర్శ అన్నీ ఒక్కుమ్మడిగా సాగిన బృహద్వ్యాఖ్యానమిది. ద్రుతము - ద్రుతప్రకృతికము, ద్రుతాంతము, నాంతాల వింగడింపు, స్త్రీలింగ - సీసమ - స్త్రీతుల్యాదుల నిర్ధారణ, హనుమానుడు రూపసాధన, ఘటమునన్ దగ్గర అన్యోన్యాశ్రయ దోషాశంకనం, ననబోడి - కన్దోయి సమాసాల సంగతి, నుమ్యోతః అర్థనిర్ణయం, భవేద్ధర్మాది శబ్దానామ్ - కారికా పాఠ నిర్ణయం, ఇలా చెబుతూ

పెడితే ఇదొక చేటభారతం అవుతుంది. ఇవన్నీ వజ్ఝలవారి తీర్పునంబడి మనల్ని తెదీపిన పడవేశాయి. సంహితా సర్వస్వానికి సలాము చెయ్యని గులాము లేడు, ఉండడు.

విమర్శనాత్మకాలుగా వీరు సంతరించిన చింతామణి విషయ పరిశోధనం బాల సరస్వతీయ పీఠిక సటీకాధర్వణకారికావళీ విమర్శనం మరికొన్ని వ్యాసాలు - సారాంశం మీద సంహితా సర్వస్వంలో అంతర్భవించినవే. దేని ప్రత్యేకతలు దానికి ఉన్నా లక్ష్యసిద్ధిలో వీటి ఏక వాక్యతను తేలికగానే గుర్తించవచ్చు.

ఇంకా వీరు రచించిన సాహితీ విమర్శలు ప్రధానంగా రెండు. అవి రెండూ రామరాజ భూషణుడివే కావడం ఒక విశేషం. వసుచరిత్ర విమర్శను ఎనిమిది భాగాలుగా సమకూర్చారు. వీటిలో అనుకృతులు అనే భాగం ఈ వైయాకరణుడికి ఇంత కావ్య పరిచయమా అని అబ్బుర పరుస్తుంది.

సంస్కృతాంధ్ర కావ్యాల నుంచి మూర్తికవి ఏమేమి ఎలా ఎలా తెచ్చుకున్నాడో ఎంత అందంగా ఇముడ్చుకున్నాడో - వీరు చాలా సరసంగా చూపించారు. రామరాజ భూషణుడు, భట్టుమూర్తి, మూర్తికవి - ముగ్గురూ ఒక్కడే అని వీరి నిర్ధారణ.

ఐదు ప్రకరణాలుగా సాగిన హరిశ్చంద్ర నలోపాఖ్యాన విమర్శలో నాల్గవ ప్రకరణం వజ్ఝల వారికే సాధ్యమైన భాగం. ఈ ద్వ్యర్థికావ్యం లోని సంస్కృతాంధ్ర వ్యాకరణ విశిష్ట ప్రయోగాల నిరూపణ ఇది. బాహుక - బాహక శబ్ద చర్చ, ప్రాచీన ప్రతుల్లోని ''వాహక'' అపపాఠమని తేల్చడం ఇత్యాదులు పాండిత్య వీరాన్ని ఆస్వాదించే సమబుద్ధులకు వసంతోత్సవాల్లాగా ఉంటాయి.

ద్రావిడ భాషల మీద వీరు రచించిన గ్రంథాలను మదింపు వెయ్యగల్గిన శక్తి నాకు లేదు. అంచేత తొలితరం పరిశోధకుడిగా వజ్ఝల వారు వసు - హరిశ్చంద్ర నలోపాఖ్యానాలతో పాటు ప్రధానంగా తెలుగు వ్యాకరణానికి చేసిన అపూర్వమైన వరివస్యకు ప్రణమిల్లుతున్నాను. ఈ సందర్భంగా తమ అముద్రిత సిద్ధాంత గ్రంథాన్ని (వజ్ఝల వారి వ్యాకరణ వరివస్య - ఒక సమీక్ష) నాకు అందించి సహకరించిన డా॥ ఎ. గోపాలరావు (విజనగరం)గారికి కృతజ్ఞతలు తెలుపుతున్నాను.

బేతవోలు రామబ్రహ్మం

03-11-05

# తెలుగులో తొలి నవలా విమర్శకులు

- సి.ఆనందారమం

తెలుగులో ఇంగ్లీష్ సాహిత్య ప్రభావం వల్ల వచ్చిన ఆధునిక సాహితీ ప్రక్రియలన్నీ 19వ శతాబ్ది ఉత్తరార్థంలోనే ప్రసిద్ధి పొందాయి. నవల పుట్టు పూర్వోత్తరాలూ, నిర్వచనమూ, ఎలా ఉన్నా, ఈనాడు మనం నవలగా వ్యవహరిస్తున్నది బ్రిటిష్ పాలనలో పాలకవర్గానికి తెలుగు సమాజాన్నీ, తెలుగు జీవితాన్నీ, పరిచయం చేసే ఉద్దేశంతో, వారి ప్రోత్సాహంతోనే ఆవిష్కృత మయిందని అంగీకరించక తప్పదు. కుల నిర్మూలన, స్త్రీ విద్య, వితంతు వివాహాలు మొదలయిన సంఘ సంస్కరణోద్యమాల ప్రచార కాలంలోనే "నవల" సాహితీ రంగంలోకి అడుగు పెట్టింది.

నవలా విమర్శలన్నింటిలో, - చింతామణి పత్రికలో నవలల పోటీ నిర్వహిస్తూ, నవల రచనకు ఇచ్చిన నియమావళినే, మనం నవలకు తొలి విమర్శ సూత్రాలుగా భావించవచ్చు.

ఈ నియమావళి ఇంగ్లీష్ భాషలోని నవలా విమర్శ సూత్రాలను స్పృశించకపోవటం గమనార్హం. నవలను "వచన ప్రబంధం"గానే వ్యవహరిస్తూ దీనికి సన్నిహితంగా ఉండే నియమాలనే ఏర్పరిచారు.

రచన 'వచనంలో ఉండాలి' అనేది ప్రధానం. నాయకుడు ఉత్తముడు కావాలి. నవలలో, తెలుగు వారి ఆచార వ్యవహారాలు ప్రతిఫలించాలి. శైలి గ్రాంథికమయినా 'సరళ గ్రాంథిక' మయినా ఉండాలి. - మొదలయిన నియమాలను పరిశీలిస్తే ఒక విషయం స్పష్టమవుతుంది.

నవలా ప్రక్రియ ఆవిర్భావానికి ముందే తెలుగులో వచన రచన ప్రారంభమయింది. కాబట్టి కేవలం వచన రచనను వారు నవలగా భావించినట్లు చెప్పటానికి వీల్లేదు. నవల అంటే కథ చెప్పటమని కూడా వారు అభిప్రాయపడినట్లు తోచదు. అప్పటికే రావిపాటి గురుమూర్తిశాస్త్రిగారు తెలుగులో విక్రమార్క కథలు, పంచతంత్ర కథలు ప్రచురించారు. "నవాన్ గృహ్ణాతీతి ఇతి నవలా" అనే కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారి నిర్వచనాన్ని బట్టి నవల అంటే 'కొత్తది' అనే అర్థం వస్తుంది. స్పష్టంగా చెప్పుకోకపోయినా, నవలా రచనలో సమాజ స్వరూపావిష్కరణకు ఇస్తున్న ప్రాధాన్యాన్ని బట్టి, సమాజాన్ని సాహిత్యంతో అనుసంధించే సాహితీ ప్రక్రియగా నవలను తొలిదశలోనే నిర్ధారించినట్లు మనం గ్రహించవచ్చు. ఇదే ఈ ప్రక్రియలోని కొత్తదనం.

శ్రీ మరుపూరు కోదండరామిరెడ్డిగారు, 'కళాపూర్ణోదయ ప్రబంధాన్నీ'. శ్రీ నోరినరసింహశాస్త్రిగారు మహాభారతాన్నీ పద్యరూపంలో ఉన్న నవలలుగా పేర్కొన్నారు. నిజమే. వాటిలో సమాజ స్వరూపం, దేవుళ్ళూ, పౌరాణిక పాత్రలూ,

మహత్త్వాలూ మాటున దోబూచులాడింది. నవలలో సమాజ స్వరూపం నేరుగా ప్రవేశించింది.

నాకు తెలిసినంతలో విశ్వవిద్యాలయ స్థాయిలో డాక్టరేట్ డిగ్రీ పొందిన మొదటి నవలా పరిశోధన గ్రంథం డాక్టర్ బొడ్డపాటి కుటుంబరావుగారి ఆంధ్రనవలా పరిణామం. (బి.వి.కుటుంబరావు, 1971). ఈ గ్రంథాన్ని వీరు గద్యకావ్య భేదాలతో ప్రారంభించారు.

"ఆఖ్యాయికా, కథా. ఖండకథా, పరికథా తథా కథానికేతి మన్యంతే, గద్యకావ్యంచ పంచధా।" (అగ్నిపురాణం. 337వ అధ్యాయం) అనే అగ్నిపురాణ శ్లోకాన్ని ఉటంకించి (quote చేసి) ఆయా గద్య భేదాలను సవిస్తరంగా వివరించారు. వచన భారతం మొదలయిన తెలుగు వచన గ్రంథాలను ప్రస్తావించారు. కొక్కొండ వెంకటరత్నం పంతులుగారి మహాశ్వేత (1867) ఇతివృత్తాన్ని స్థూలంగా తెలియపరిచారు.

ఇది వచనంలో ఉన్నా, శైలి ప్రౌఢంగా ఉండటంవల్లా, కాదంబరిని పోలి ఉండటం వల్లా దీనిని మొదటి నవలగా విమర్శకులు గుర్తించలేదు.

కుటుంబరావుగారు "ఏది మొదటి నవల?" అనే చర్చకు పూనుకోలేదు.

నరహరి గోపాలకృష్ణమశెట్టి గారి "రంగరాయచరిత్ర (1872)"తో ప్రారంభించి 20వ శతాబ్ధపు పూర్వార్థం వరకూ ఉన్న నవలల ఇతివృత్తాలను స్థూలంగా పరిచయం చేసారు. వీరు నవల విశ్లేషణకు పూనుకోలేదు. వివిధ వాదాల జోలికి పోలేదు. అయితే, ఈనాడు మనకు లభ్యంకాని "ధర్మవతీ విలాసము; లక్ష్మీ సుందరీ విజయము' మాలతీ రాఘవము; - మొదలయిన కొన్ని నవల ఇతివృత్తాలు తెలుసుకొనే అవకాశం లభిస్తుంది. వీరి వస్తు విభజన కాలానుగుణంగా సాగింది నవలల వర్గీకరణకు వీరు పూనుకోలేదు. అయినా ఒక కాలం నాటి నవలల సమగ్రమయిన పట్టిక, ఇతివృత్తాల స్థూల పరిచయాలోతో సహా వీరి గ్రంథంలో కనిపిస్తుంది. ఇంతటి విషయ సేకరణ శ్రమతో కూడుకొన్నపని.

శ్రీ ఆర్.ఎస్. సుదర్శనంగారి "సాహిత్యంలో దృక్పథాలు"(1958) నవలా సాహిత్యం మీద వచ్చిన విలువయిన పరిశోధన గ్రంథం. తరువాతి విమర్శకులలో చాలా మంది, ఈ గ్రంథాన్ని ఉపయోగించుకున్నారు. దీనిలో వీరు విశ్వనాథ, చలం, గోపీచంద్ వంటి నవలా రచయితల ప్రధానమైన నవలలను విశ్లేషించి ఆయా రచయితల దృక్పథాలను సవిమర్శకంగా సోపపత్తికంగా నిర్ధారించారు.

ఈ విమర్శలో నాకు తోచిన ప్రధానమయిన అంశాలు :

1. విశ్వకవి కావలసిన విశ్వనాథ తన "రచనలో చొరబడే తత్త్వం కారణంగా ఆ స్థాయి అందుకోలేక పోయారు.

2. చలంగారి పాత్రలు చాలా వరకు ప్రతీకాత్మకాలు.

3. విశ్వనాథ-చలం : ఇద్దరూ కాల్పనిక రచయితలే. ఇద్దరూ సమాజాన్ని తమకు కావలసిన రీతిలోనే చిత్రించారు.

4. గోపీచంద్ స్త్రీ పాత్రలు బలహీనమయినవికావు. వికసన శీలం కలవి. వారి వ్యక్తిత్వాలు వ్యవస్థలో ఒదగవు. అవి సమాజం నెత్తురుతో గీసిన గిరిని దాటిన పాత్రలు.

సుదర్శనంగారు ఇంగ్లీష్ లెక్చరర్‌గా పని చేసారు. ఇంగ్లీష్ నవలా విమర్శకుల ప్రభావంతో, నవలా విమర్శ చేసినవారాయన.

వీరు "అస్తిత్వవాదం" మీద భారతిలో మంచి విమర్శ వ్యాసం రాసారు. దానిలో భగవద్గీతలోని

"శ్రేయాన్ స్వధర్మోనిగుణః
పరధర్మాత్ స్వనుష్ఠితిత్
స్వధర్మే నిధనం శ్రేయః
పరధర్మో భయావహః ॥" (అ.3.శ్లో.35)

అనే శ్లోకాన్ని అస్తిత్వవాదానికి అన్వయించి వ్యాఖ్యానించారు. "స్వధర్మం" అనే పదాన్ని "ఆత్మధర్మం"గానూ, (Being for itself) `పరధర్మం' అనే పదాన్ని 'ఇతరుల కొరకు ఆచరించే ధర్మం'గానూ, (Being for others) వీరు వ్యాఖ్యానించారు. ఇలాంటి అన్వయం సాహిత్య విమర్శలో కొత్తది.

మొదలి నాగభూషణశర్మ తన "తెలుగు నవలా వికాసం" లో (1971) నవలల వర్గీకరణ చేసారు. అనువాద నవలలు, అనుసరణ నవలలు, జాతీయోద్యమ నవలలు, సంఘ సంస్కరణోద్యమ నవలలు, చారిత్రక నవలలు, రాజకీయ నవలలు, తాత్త్విక నవలలు, మొదలయిన వీరి వర్గీకరణ తరువాతి వారు అనుసరించారు. ఇ.ఎం. ఫార్‌స్టర్ మొదలైన ఆంగ్ల నవలా విమర్శకుల విధానాలను అనుసరిస్తూ ఈయన పాత్ర, ఇతివృత్తము, వస్తువు మొదలయిన నవలా స్వరూప విభాగాలను విశ్లేషించారు. నవలా సాహిత్యంలోని కొన్ని ప్రధానమయిన నవలలను ప్రత్యేకించి విమర్శించారు.

శ్రీ గొర్టిపాటి వెంకటసుబ్బయ్యగారు "చలం జీవితం - సాహిత్యం" అనే పరిశోధన గ్రంథంలో చలంగారి తాత్త్విక దృక్పథాన్ని వివరించారు.

'తెలుగునవల - నూరు సంవత్సరాలు' (1973) వివిధ పరిశోధన వ్యాసాల సంకలన గ్రంథం సాహిత్య అకాడమీ ప్రచురణ.

అక్కిరాజు రమాపతిరావు తన "వీరేశలింగం - సమగ్ర పరిశీలన" (1972) అనే పరిశోధన గ్రంథంలో, వీరేశలింగంగారి జీవితంలో ఆయన సృష్టించిన సాహిత్యాన్ని అనుసంధించి పరిశీలించారు. బయోగ్రాఫికల్ క్రిటిసిజమ్ (Biographical Critism)కు ఇది

ప్రారంభం అని చెప్పుకోవచ్చు. ఈ పుస్తకంలో వీరేశలింగంగారు "సతీహిత బోధిని", "వివేకవర్థని" మొదలయిన పత్రికలను స్థాపించి, వాటిని తన సిద్ధాంత ప్రచారానికి ఎలా ఉపయోగించుకున్నారో వివరించారు. అది పత్రికా వ్యాప్తి ప్రచారాన్ని పొందుతున్న కాలం స్త్రీలకు ప్రత్యేక పత్రిక ప్రారంభించింది పంతులుగారే. ఈ గ్రంథంలో రమాపతిరావు గారు "మొదటి నవల ఏది?" అనే చర్చకు పూనుకున్నారు.

1872లో లార్డ్ మేయో జంగాల జీవిత విశేషాలను వివరించే రచన కావాలని కోరటంవల్ల, నరహరి గోపాలకృష్ణయశెట్టిగారు శ్రీరంగరాయచరిత్ర రాసారు. (ఈ విషయం రచయిత స్వయంగా చెప్పుకున్నారు.) ఈ నవలలోని శైలి సరళ గ్రాంథికమే. లంబాడీల జీవితం విపులంగా లేకపోయినా, వారి ఆచారాల ప్రస్తావన ఉంది. ధీర స్త్రీ పాత్రలున్నాయి. అయినా, రంగరాయచరిత్రలోని ఇతివృత్తం పూర్తిగా కాల్పనికం. కథా నాయకుడు రంగరాజు లంబాడీ కన్యను వివాహం చేసుకున్నా, ఆమె అతనికి మేనత్త కూతురని బయట పడింది. నవలలోని ప్రధాన పాత్ర శారద రాజుకు రెండవ భార్య కావటం వల్ల, వేశ్య కావటం వల్ల, పాఠకుల సానుభూతి సంపాదించలేకపోయింది. సమాజ యదార్థ స్వరూపం ఎలా ఉన్నా, పాఠకులు నవలలో దాని "ఆదర్శ రూపాన్ని" చూడాలని కోరుకుంటారనటానికి ఇదొక నిదర్శనం.

రాజశేఖర చరిత్రలోనూ కాల్పనిక సమాజ చిత్రణమే ఉంది. కానీ వితంతువుల దుస్థితి, కులనిర్మూలన, మూఢ విశ్వాసాల నిర్మూలన, స్త్రీవిద్య మొదలయిన ఆనాటి సంస్కరణ భావాలు నవలలో చూపారు. ఈ కారణాలవల్ల రాజశేఖర చరిత్రనే మొదటి నవల అనవచ్చునని రమాపతిరావుగారు నిర్ధారించారు.

నవల ప్రధానంగా సమాజ స్వరూపాన్ని ప్రతిఫలించేదిగా ఉండాలని విమర్శకాభిప్రాయమైనట్లు మరోసారి స్పష్టమైంది.

సి. ఆనందారామం, అంటే నేను, రాసిన "తెలుగు నవలలో కుటుంబజీవన చిత్రణం" అనే పరిశోధన గ్రంథం ఇంటర్ డిసిప్లినరీ క్రిటిసిజమ్‌కి చెందినది (Inter-disciplinary) (1979) ఈ పుస్తకంలో నేను ప్రాచ్య, పాశ్చాత్య దృక్పథాల ననుసరించి వివాహవ్యవస్థ స్వరూపాన్ని వివరించాను. రామాయణ భారతాలలో పతివ్రతలుగా చెప్పుకొనే స్త్రీ పాత్రల ధీర స్వభావాన్ని సోదాహరణంగా చూపాను. పతివ్రతలు కావటానికి స్వతంత్ర వ్యక్తిత్వాలు లేనివారు కావలసిన అవసరం లేదని పురాణాలు ఆధారంగా చూపాను.

కుటుంబ వ్యవస్థను తాత్త్వికంగా గౌరవించిన విశ్వనాథ నవలలను, వ్యవస్థను ధిక్కరించిన చలం నవలలనూ, వ్యక్తిత్వ వికాసానికి ప్రాధాన్యం ఇచ్చిన గోపీచంద్ నవలలనూ, కుటుంబ వ్యవస్థను ఆర్థిక ప్రాతిపదికతో పరిశీలించిన కొడవటిగంటి

కుటుమబరావు గారి నవలలనూ, స్త్రీ స్వాతంత్ర్య ప్రధానం లక్ష్యంగా ఉన్న రంగనాయకమ్మగారి నవలలనూ, సూత్రబద్ధంగా కాని ప్రణయాన్ని చిత్రించిన లత గారి నవలలనూ, పరిశోధనకు తీసుకున్నాను.

ఈ పుస్తకంలో నేను ప్రతిపాదించిన ప్రధానాంశాలు :

1. తనను ఎదిరించిన వారిని సమాజం ఏనాడు క్షమించలేదు. క్షమించదు. భారతంలో కర్ణుడు, వేయిపడగలులో మంగమ్మ, చలం స్త్రీ పాత్రలూ, రంగనాయకమ్మ అంధకారంలో నవలలోని రాజేశ్వరి అందరూ శిక్షననుభవించిన వాళ్ళే.

2. చలం స్వేచ్ఛా ప్రణయం విశృంఖల కాముకత్వం కాదు. నియమనిబంధనలకు తల ఒగ్గి విధి లేక కలిసి ఉండటం కాక, ప్రేమించకుండా ఉండలేని ప్రగాఢ ప్రణయ భావనతో స్వేచ్ఛగా ప్రేమించటం.

3. విశ్వనాథకూ, చలానికీ సిద్ధాంతాలు వేరయినా, వారిద్దరూ ప్రధానంగా సాహితీ శిల్పులు కావటంవల్ల వారు ప్రతిపాదించిన విషయాలు అసంకల్పితంగా ఒకటయ్యాయి. ఉదాహరణకు విశ్వనాథ స్త్రీ స్వాతంత్ర్యాన్ని సమర్థించరు. కానీ, వేయి పడగలులో 'మంగమ్మ' ఇల్లు దాటి వచ్చిన తరువాతనే తనను తాను సంస్కరించుకుంది.

వ్యవస్థలో స్త్రీకి ఆనందం లేదన్నాడు చలం. కానీ, మైదానంలో రాజేశ్వరి వ్యవస్థను ధిక్కరించి వచ్చినందుకు ఆమె జీవితం దుఃఖాంతమే అయింది. అనేక సందర్భాల్లో చలం స్త్రీకి వ్యవస్థలోనే రక్షణ ఉందని ఒప్పుకున్నాడు. కానీ, రక్షణ, వేరు, ఆనందం వేరు అంటాడు.

తరువాతి కాలంలో నవలపై చాలా విమర్శ గ్రంథాలు వచ్చాయి. ఆంగ్ల నవలా విమర్శకుల ప్రభావంతో, మనో విశ్లేషణాత్మక సిద్ధాంతాలపైన, అస్తిత్వ వాదం పైన, నవల - స్వరూప స్వభావాల పైన, నవలా కథన శిల్పం పైన, ప్రామాణికమైన విమర్శ గ్రంథాలు వచ్చాయి. వాటిని ఆచార్య ముదిగొండ వీరభద్రయ్య గారు నవల-నవలా విమర్శకులు(2000) అనే తమ పరిశోధన గ్రంథంలో చక్కగా విశ్లేషణాత్మకంగా వివరించారు.

సమాజ స్వరూపం ఎప్పటికప్పుడు మారక తప్పదు. దానికనుగుణంగా నవలా స్వరూపమూ, శిల్పరీతులూ కూడా మారతాయి. వాటిని బట్టి విమర్శ విధానాలలోనూ కొత్త పోకడలు వస్తాయి. అలా నవలా విమర్శ ఎప్పుడూ 'నవల'గానే ఉంటుందని నా విశ్వాసం.

# తెలుగులో తొలితరం వ్యాకరణ పరిశోధకులు

- లకంసాని చక్రధరరావు

అత్యుత్తమాలంకారికులయిన ఆనందవర్ధనులు తమ ధ్వన్యాలోక గ్రంథంలో "ప్రథమేహి విద్వాంసో వైయాకరణాః, వ్యాకరణ మూలత్వాత్సర్వవిద్యానామ్" (ప్రథమోద్ద్యోతః) (అన్ని విద్యలకు మూలం వ్యాకరణం కాబట్టి వైయాకరణులు ప్రథమ విద్వాంసులు) అని తెలిపి వ్యాకరణ కర్తల, వ్యాకరణ పఠితల, వ్యాకరణ పండితుల ప్రాధాన్యాన్ని స్పష్ట స్పష్టపరిచారు! వ్యాక్రియన్తే వివిచ్య ప్రదర్శ్యన్తే అనేన శబ్దాః ఇతి వ్యాకరణమ్. వ్యాకరణం ద్వారా శబ్దాలు స్పష్టంగా వివరంగా ప్రదర్శించబడతాయని వ్యాకరణశబ్ద నిర్వచనం. వ్యాకరణాధ్యయనం వల్ల భాషా స్వరూపం స్పష్టంగా అవగతమయి భాషాప్రియులు భాషా యోషను స్వాధీనం చేసుకోవచ్చు. ప్రపంచంలో వ్యాకరణ శాస్త్రాలు కల భాషలు తక్కువ. భారతీయ భాషలలో సంస్కృత భాషకు పాణిని, వరరుచి, పతంజలి, భర్తృహరి ప్రభృతులు సంస్కృత వ్యాకరణ రచనలు కావించి వ్యాకరణ శాస్త్ర పరిజ్ఞానాన్ని పరిపుష్టం కావించారు.

కేతన మొదలైనవారు "ఆంధ్రభాషా భూషణము, ఆంధ్రశబ్ద చింతామణి, వికృతి వివేకము, కవిశిరోభూషణము" మొదలైన వ్యాకరణ గ్రంథాల ద్వారా తెలుగు వ్యాకరణాన్ని పరిపుష్టం కావించారు. బాలసరస్వతి ప్రభృతులు వాటిపై వ్యాఖ్యలు వెలయించారు. ఆధునిక కాలంలో కల్లూరి వారు, దువ్వూరి వారు, దూసి వారు, వజ్ఝులవారు మొ॥ వారు పరిశోధనలు కావించారు. వీరి పరిశోధన సరళిని పరిశీలిద్దాం.

## శ్రీకల్లూరి వేంకట రామశాస్త్రిగారు

తూర్పు గోదావరి జిల్లా ముగ్గుళ్ళ అగ్రహారంలో శ్రీ కల్లూరి వేంకట రామశాస్త్రి గారు క్రీ.శ. 1857వ సంవత్సరంలో జన్మించారు. రాజమండ్రి సర్వకళాశాలలో సంస్కృత ప్రధానోపాధ్యాయులుగా అధ్యాపన వృత్తిని అవలంభించి విశ్రాంతి తీసుకున్న తర్వాత 1930 ప్రాంతంలో బ్రహ్మైక్యం చెందారు. వీరు రచించిన గ్రంథాలలో "బాలవ్యాకరణ గుప్తార్థ ప్రకాశిక" అత్యంత ప్రసిద్ధమైనది. ఈ సమాసానికి బాల వ్యాకరణంలోని రహస్యాలను ప్రకాశింప చేసేది అని అర్థం. గుప్తార్థం అంటే దాచబడ్డ అర్థం అని అర్థం. బాలవ్యాకరణ గ్రంథ కర్తృత్వం విషయంలోని కొన్ని సూత్రాల వివరణలోను బ్రహ్మశ్రీ కల్లూరి వారికి శ్రీవజ్ఝుల చిన సీతారామశాస్త్రిగారితోను, మహామహోపాధ్యాయ తాతాసుబ్బరాయ శాస్త్రి గారితోను వివాదాలు చోటు చేసుకున్నాయి. వీరు వివిధ పత్రికలలో సమరాంగణ పార్థమూర్తి, ధటా సూర్యదర్శి, కన్నెపల్లి వేంకట సీతాపతి శాస్త్రి అనే మారుపేర్లతో ప్రత్యర్థులను విమర్శించారు. 567 పుటల ఈ గ్రంథం వీరి

---

తెలుగులో తొలితరం పరిశోధకులు-జాతీయసదస్సు,
తెలుగుశాఖ, హైదరాబాదు విశ్వవిద్యాలయం-నవంబరు 7-9,2005

పాండితికి నిదర్శనం. ''బాలవ్యాకరణ గుప్తార్థ ప్రకాశికాకార పార్థమన్యుశ్రీ మహోత్సవము ''ను (232 పుటలలో) తమ వ్యాఖ్యకు అనుబంధంగా శ్రీకల్లూరివారు ప్రకటించారు. బాలవ్యాకరణములోని ''అమహన్నపుంసకములకదంతంబులకు మువర్ణకంబగు'' (తత్సమ. 39. సూ.) అనే సూత్రానికి శ్రీకల్లూరి వేంకట రామశాస్త్రిగారు ''హ్రస్వాకారము (హ్రస్వ + అకారము) అంతమందుఁగల అమహత్తులైన నపుంసకలింగములకు మువర్ణకంబు వచ్చును. అనఁగా అనగా మహద్వాచకములు కానిపైన నపుంసకలింగమ్ము హ్రస్వాకారంతమందుఁగల వానికి వర్ణకము వచ్చును.'' (గుప్తార్థ ప్రకాశిక పుట 112). ఈ బాల వ్యాకరణ తత్సమ 39వ సూత్రంలోని ''అమహన్నపుంసకములు'' సమాసాన్ని శ్రీ కల్లూరి వారు కర్మధారయ సమానంగా భావించటం సరికాదు, ఇది ద్వంద్వ సమాసమే. అదంతములగు అహత్తులకును, అదంతములగు నపుంసకములకును 'ము' ప్రత్యయమగును. ఇది కర్మధారయమనుటకుఁ బుంలింగ వృక్ష శబ్దమును, మహన్నపుంసకములగు దైవమిత్రాది శబ్దములును బ్రబలనిదర్శనములు'' (బాలవ్యాకరణ ఘంటాపథ వ్యాఖ్యాన పుటలు 122, 123) అని శ్రీవజ్ఝుల వారిని వంతరాం రామకృష్ణ గారు సమర్థించారు. ప్రమాదోధీమతామపి (ధీమంతులకు కూడ పరాకు కలగవచ్చు) అని ఆర్యోక్తి. శ్రీకల్లూరి వేంకట రామశాస్త్రిగారు ప్రమాదం వల్ల ''అమహన్నపుసంకములు'' సమాసాన్ని ద్వంద్వంగా కాకుండా కర్మధారయంగా భావించి వ్రాశారు. దీని కోసం ఎంతో సమయాన్ని వెచ్చించారు. మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ తాతాసుబ్బరాయ శాస్త్రిగారు వంటి మహాపండితులను వివాదం లోకి లాగారు. వీరి పాండిత్యాన్ని ఎవరూ శంకించరు.

## కళాప్రపూర్ణ వజ్ఝుల చినసీతారామశాస్త్రిగారు

కళాప్రపూర్ణ వజ్ఝుల చినసీతారామశాస్త్రిగారు ఆంధ్రవ్యాకరణ విహాయసంలో ''వెలుగు తేఁడు''. కళాప్రపూర్ణ దువ్వూరి వేంకటరమణ శాస్త్రిగారు, విద్వాన్ దూసి రామమూర్తిగారు, వంతరాం రామకృష్ణారావుగారు వీరివద్ద వ్యాకరణ రహస్యాలను గ్రహించి గుర్తింపు పొందారు. విజయనగరంలోని మహారాజా సంస్కృత కళాశాలలో ఆంధ్రోపన్యాసకులుగాను, ఆంధ్ర విశ్వకళా పరిషదాంధ్ర శాఖలో ఆంధ్రోపన్యాసకులుగాను ఆంధ్ర వ్యాకరణ శాస్త్రాధ్యాపనం కావించారు. వీరి వ్యాకరణ శాస్త్ర పరిజ్ఞానం అపారం, ప్రయోగ పరిశీలన, సమన్వయం, అనునిత్యశాస్త్ర పఠనం అనితారసాధ్యం. వీరి తొట్టతొలి వ్యాకరణ పరిశోధన గ్రంథం ''ఆంధ్ర శబ్ద చింతామణి విషయ పరిశోధనము'' (1927). ఆంధ్రశబ్ద చింతామణి నన్నయ కర్తృకమని వీరి దృఢాభిప్రాయం. చింతామణిలోని శ్లోకాలను విపులంగా ఈ గ్రంథంలో శాస్త్రిగారు

వివరించారు. చింతామణి లోని గూఢాశయాలను శ్రీవజ్ఝుల వారు వివరించి విశదీకరించారు. ''సర్వత్రా జ్వత్కార్యం జ్ఞేయం యస్య ద్రుత ప్రకృతికేభ్యః'' అనే సూత్రానికి వజ్ఝుల వారి వివరణ పదాది యకార స్థాపన ఈ గ్రంథంలో ఉన్నాయి. ఈ గ్రంథంలో వీరి సునిశిత దృష్టి గోచరిస్తుంది.

కళాప్రపూర్ణ వజ్ఝుల చినసీతారామ శాస్త్రిగారి వ్యాకరణ విశ్వరూపాన్ని చూపిన గ్రంథం ''ఆంధ్ర వ్యాకరణ సంహితాసర్వస్వము'' (1951, 1952) ఆంధ్రశబ్ద చింతామణి, వికృతి వివేక సూత్రాల వివరణ ఈ గ్రంథంలో ఉంది. ఇది 1794 పుటల బృహద్గ్రంథం. బాలవ్యాకరణ సూత్రాల ఉదాహరణలతోపాటు తద్వ్యాఖ్యానం కూడా ఇందులో ఉంది. వీరు సందర్భానుసారంగా అహోబల పండితీయాది గ్రంథాలలోని విషయాలను స్పృశించి వివరించారు. సిద్ధాంత కౌముదిని సందర్భాన్ని బట్టి ఉట్టంకించి ఆంధ్ర వ్యాకరణాల సూత్రాలతో సమన్వయించారు. ''ఆర్య వ్యవహారంబుల దృష్టంబు గ్రాహ్యంబు'' (బాల వ్యా. సంజ్ఞా 23 సూ.) పెద్దలు వ్యవరించిన మాట గ్రామ్యంబయిన గ్రహింపఁదగునని తాత్పర్యము. కఱకంఠుఁడు, ప్రాణగొడ్డము, జీవగఱ్ఱ, కపిలకన్నులు, కపిలగడ్డము, కపిలజడలు అనేవి వృత్తి ఉదాహరణలు. ఈ సూత్రం కింద ఉన్న వజ్ఝుల వారి వివరణ ప్రశస్తం.

కఱకంఠా! క్షమియింపుము

నెఱినెవ్వరికెఱుఁగఁదగునె? నీచంతంబుల్'' (భార. ఆరణ్యా. 1 ఆ. 326) అనే పద్యాన్ని వీరు ఉదాహరించారు.

కళాప్రపూర్ణ వజ్ఝుల చినసీతారామశాస్త్రి గారి మరో ప్రసిద్ధ వ్యాకరణ గ్రంథం ''వైయాకరణ పారిజాతము'' (1957). మొదటి ప్రకరణంలో ప్రాకృత పఠనం అవసరమనీ, రెండో ప్రకరణంలో తద్భవాల గురించిన అన్ని విషయాలను, మూడో ప్రకరణంలో అక్షరాలను గురించి, నాల్గో ప్రకరణంలో అనుస్వారాన్ని గురించి, ఐదో ప్రకరణంలో అంతస్థం గురించి ఆరో ప్రకరణంలో దంత్య తాలవ్యాలను గురించి సమగ్రంగా చర్చించారు. 1959 లో బాలవ్యాకరణోద్ద్యోతాన్ని రచించారు. దీనిలో సూరిగారి మూలసూత్రాలను కూడా మార్చివేశారు. Rt. Rev. Robert. Caldwell రచించిన "A Comparative Grammar of the Dravidian" ను ''ద్రావిడ భాషా పరిశీలనము'' 1955 అనే పేరుతో శ్రీ వజ్ఝులవారు దాదాపు అనువదించారు.

## డాక్టర్ చిలుకూరి నారాయణరావు గారు

డాక్టర్ చిలుకూరి నారాయణరావు గారు మద్రాసు విశ్వవిద్యాలయం నుండి 1930లో 11వ శతాబ్ది తెలుగు భాషను గురించి, శోధన కావించి పిహెచ్.డి. పట్టాను

పొందేరు. వీరు అనంతపురం రాయలసీమ కళాశాలలో తెలుగు, సంస్కృతం, కన్నడం భాషలను బోధించేవారు. వీరు రచించిన ''ఆంధ్రభాషా చరిత్రము'' (1750 పుటలు) గ్రంథాన్ని రెండు భాగాలుగా 1937లో ఆంధ్ర విశ్వకళాపరిషత్ వారు ప్రచురించారు. ఇది గొప్ప పరిశోధన గ్రంథం. ఈ గ్రంథంలోని మూడో అనుబంధం (269 పుటలు) ఆంధ్రశబ్దచింతామణికి సంబంధించిన వ్యాఖ్యానం. ఈ వ్యాఖ్యానంలో అనేక విశేషాలను వీరు వెల్లడించారు. ఆంధ్రశబ్ద చింతామణి నన్నయ కర్తృకం కాదని శ్రీ కందుకూరి వీరేశలింగం గారితో పాటు, డాక్టర్ చిలుకూరి నారాయణ రావుగారు కూడా భావించి, చింతామణిని భాషాశాస్త్ర రీత్యా వ్యాఖ్యానించి నిరూపించారు.

''యొక్క చ శేషే షష్ఠీ'' (ఆం.శ.చిం. హలన్త పరి. సూ.33.) సంబంధార్థమున 'యొక్క' అనుప్రత్యయము షష్ఠియందు వచ్చును. 'యొక్క'కు కావ్యములందుఁ గాని వ్యవహారము నందు గాని ప్రయోగము లేదని ఇంతకు ముందు చెప్పబడినది (ఆం.భా.చ. పుట. 1631). ఆనాటి వ్యవహారంలో యొక్కకు ప్రయోగం లేదని మనం చెప్పలేము. కానీ కావ్యప్రయోగాలు మాత్రం లేవు. ''న చ దేశ్య పదే'' (ఆం.శ.చిం. హలన్త పరి. సూ.49). దేశ్యపదము తుది దీర్ఘమునకు మాత్రము హ్రస్వము కలుగదు. నన్నయ కాలమున కాలమున దీర్ఘాంతములగు దేశ్యపదములకుదాహరణములు కానరాలేదు. (ఆం.భా.చ. పుట. 1634) ఇది వీరి పరిశోధన.

## విద్వాన్ దూసి రామమూర్తి గారు

''ఆంధ్రభాషా భూషణము'' వంటి గ్రంథాలు పద్యకృతులు కావటం వల్ల ఆంధ్రశబ్ద చింతామణి, వికృతివివేక, కవిశిరోభూషణాది గ్రంథాలు సంస్కృత భాషలో ఉండటం వల్ల సామాన్యులకు అవి అవగతం కాకపోవటం వల్ల శ్రీ పరవస్తు చిన్నయ సూరి ఒక ప్రణాళికను ఏర్పరచుకొని బాలవ్యాకరణ గ్రంథాన్ని రచించారు. ''మును మదుపజ్ఞంబగుచుం, దనరిన వ్యాకృతిని సూత్రతతి యొక కొంతం, దెనిఁగించి యిది ఘటించితి, ననయము బాలావబోధమగుఁభంగిఁదగన్'' అనే పద్యంలో గ్రహణ ధారణ పటువులైన వారికి సులభంగా తెలుగు వ్యాకరణం అవగతం కావటానికి తాను బాలవ్యాకరణాన్ని రచించినట్లుగా సూరిగారు స్పష్టపరిచారు. కళాప్రపూర్ణ వజ్ఝుల చినసీతారామశాస్త్రిగారి ప్రియశిష్యులైన విద్వాన్ దూసి రామమూర్తి శాస్త్రిగారు బాలవ్యాకరణానికి ''బాలవ్యాకరణ సారసర్వస్వ పేటిక''ను శ్రీ విజయనగర మహారాజ కళాశాలాంధ్రోపాధ్యాయులుగా ఉండి బాలురకు అధ్యాపనం కావించిన అనుభవంతో రచించారు. శ్రీ దూసి వారు ''శాస్త్ర పద్ధతిని గ్రాంథికాంధ్ర స్వరూపము నెఱింగించు నిట్టి వ్యాకరణమును దెనుఁగున రచియింపఁ జిన్నయ సూరిని బ్రోత్సహించెనని

సంభావింపనగు'' అని తమ తొలి పలుకులో పేర్కొన్నారు. ప్రాచీనాంధ్ర భాషను సరిగా అర్థం చేసుకోవటానికి వ్యాకరణం సహాయపడుతుంది అనే వీరి భావన సరి అయినది.

విద్వాన్ దూసి రామమూర్తి శాస్త్రిగారు బాలవ్యాకరణ సూత్రాలకు ఆంధ్రశబ్ద చింతామణి, వికృతివివేక, కవిశిరోభూషణాది గ్రంథాలలో కనిపించే మూల శ్లోకాదులను ఎక్కడికక్కడ ఇచ్చి వ్యాఖ్యానించారు. ఈ పద్ధతి మరే ఇతర బాలవ్యాకరణ వ్యాఖ్యలలోను కానరాదు.

''సంస్కృతమునకు వర్ణములేఁబది'' (బాలవ్యా. సంజ్ఞా. పరి. 1. సూ.) అని బాలవ్యాకరణంలోని మొదటి సూత్రం. ''ఆద్యాయాః పంచాశద్వర్ణాః'' అనునది మూలము అని దూసివారి టీక. తర్వాతి బాలవ్యాకరణ సూత్రం ''ప్రాకృతమునకు వర్ణములు నలువది'' దీనికి మూలమైన ''ప్రకృతే స్తుతే దశోనాః స్యుః'' అనునది మూలమని శ్రీదూసివారి మూల నిరూపణ.

''అంద్వాదుల కలిగాగమంబు సమాసంబునందగు'' (బాల వ్యా.సంధి. 45 సూ.) అని సూరి సూత్రించి ''ఎందు శబ్దము కలిగాగమము కొందఱు లేదంద్రు'' అని వృత్తిని రచించారు. శ్రీదూసి వారు ''జేరలిచ'' అనే మూలాన్ని చూపి ''అథర్వణాదులెందు శబ్దమునకల్యాగమములనంగేకరింపమిని గొందఱెందు శబ్దమునకలిగాగము లేదంద్రని సూరి వివరించవలసి వచ్చెను'' అని వివరించారు. ''అల్యాగమః స్యాదంద్వింద్వోః'' అనే సూత్రాన్ని సూచించారు. విద్వాన్ దూసి వారిది పరిశోధనా దృక్పథం. బాలవ్యాకరణంలోని అన్ని సూత్రాలకు మూలాల్ని చూపించి శాస్త్రీయం గావించారు. ఇది వీరి ప్రత్యేకత.

తులనాత్మకంగా మూల నిరూపణలతో నిరంతరాధ్యాపన జనిత విశేష విజ్ఞానంతో శాస్త్రీయంగా పరిశోధనాత్మకంగా వెలుగొందినది ఈ దూసి వారి బాలవ్యాకరణ సార సర్వస్వ పేటిక.

## కళాప్రపూర్ణ వాఙ్మయ మహాధ్యక్ష వడ్లమూడి గోపాలకృష్ణయ్య

కళాప్రపూర్ణ వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారు పొన్నూరు సంస్కృత కళాశాలలో ప్రధానోపాధ్యాయులుగా, ఓరియెంటల్ మాన్యుస్క్రిప్ట్ లైబ్రరీ డైరెక్టర్‌గా తెలుగు వ్యుత్పత్తి కోశ పథక సలహాదారులుగా ఉండడటమే కాక అనేక సద్గ్రంథాలను రచించి ఆంధ్రలోకానికి అందించారు. కేతన కృతమైన 'ఆంధ్రభాషా భూషణము' అనే వ్యాకరణ గ్రంథానికి దివ్య ప్రభావివర పీఠికను రచించి వ్యాకరణంలో ఉత్తమ పరిశోధకులుగా వీరు వాసికెక్కారు. ''తెలుగులో వెలసిన స్వతంత్రాంధ్ర వ్యాకరణము ఆంధ్రభాషా భూషణ''